గీ. మరుసటిదినంబు పద్మినీవరుడు తూర్పు గట్టునను నిల్చి తనలేత కరము లెలమి
నలుదెసల బుచ్చి పృథివిని నలచు శీత లమ్మును విరియజేసె నిర్మల మనగ.

చ. తొలుత నగాగ్రపంక్తులను దోరపుటున్నత భూజ మస్తకం
బులను గృహోపరిస్థలుల బొల్పుగ మాదగు బండిమీదనున్
లలితపు లేతయెండ చలిసల్లులు దీరగ బడ్డవేళ భూ
లలన విభూష తాత నగరమ్మను స్టేషను జేరినా మొగిన్.

కం. ఆ తాతానగరము వి ఖ్యాతంబగు నినుపపనుల నలరుచు హిందూ
మాతకు గూర్చిన సుతయై భూతల మంతటను పేరుపొందెను మివులన్.

ముగింపు :

గీ. నాగపుర దూర్గ జిల్లాల నలువుగాంత్రతు రాయపూర్బిలాస్పూరు జిల్లాల వెలయు
జాతులేగాని నాగపూర్జగము నందు గానిపింత్రు మహారాష్ట్రి సంఘమ్ము మిగుల
దూర్గునను గొండొ జాతియు దోచు మిగుల.

గీ. ఈ విధంబున యాత్ర గావించి ముదము మీర సంతుష్ట మతులమై మించి మేము
ఖడ్గ పురికిని మరలంగ గరము ప్రీతి ముప్పదవతేది బండిలో బోయినాము.

కం. దారిని తాతానగరము జేరం బోయితిమి దాస జెన్నగు కార్ఖా
నా రహిగాంచి పురము చెలు వారసి మేము పయనమ్ము నరసితిమి వెసన్.

గీ. ముప్ప దొక్కడు రాతిరి బొలుపు మీర ఖడ్గపురిని మా నివాసము ల్లదిసినాము
పయనమీ రీతి బూర్తిగా ప్రబలతుష్టి పరలి రెండు నాళులు ఖడ్గపురిని నిలిచి
వెనుక శ్రీకాకుళము జేరుకొంటిమి నెలమి.

విశేషాంశములు :

ఇది ఉరిటి శ్రీరామమూర్తి గ్రంథావళిలోని ఒక కావ్యము. ఇది నాగపురయాత్ర యనుకావ్యపు కాగితపుప్రత. ఇందు కవి నాగపూరు జూడబోవుట, అందు నందుగల ప్రదేశముల విశేషాదులు జనుల ఆచార వ్యవహారాదులు వర్ణించబడినవి. ఇది సమగ్ర ప్రతి ఇందు వ్యావహారికభాష ఉపయోగింపబడినది. ఈ ప్రతి బాగుగానున్నది.

# నిరోష్ఠ్య నలరాజచరిత్ర

## గోడి మృత్యుంజయ కవి



ప్రారంభము :

క॥ శ్రీమహి .... .... ాంతర సీమా సీమంతకరుణ చిరచరితార్థో
ద్దామ నఖరాగ్రునకు సం గ్రామోద్యోద్ధనుజ దళన కరణోగ్రునకున్.

క॥ అక్షాంతి శాంతి సంశ్రయ రక్షోపర తత్కుమార రణకోప కృపా
శిక్షాకర రక్షాకర సాక్షాత్కారునకు దురిత సంహారునకున్.

వ. సవినయ భక్తియుక్తంబుగా నే సమర్పింపం బూనిన నలరాజచరిత్రం బను నిరోష్ఠ్య కావ్యంబునకు గథా క్రమం బెట్టిదనిన.

సీ॥ తన దయారస చిరంతన నీరధి సితైక శరణ రాజ్యేందిరాసతి గనంగ
తన ఖడ్గ రదన సాధన కరాహి యరాతి కంఠానిల గ్రాసకారి గాగ
తన కీర్తి చంద్రికా .... యాంధకారాహతి యాచరించ
తన సదాకృతి నిరంతర చైత్రలీలకాం తాలతికానంద ధాత్రి గాగ
రహి దనర్చె నశేష దిగ్రాజగణ్య జలద సంతాన ఖేచర జలధి చంద్ర
రాజిత ఖ్యాతి .... రస్క్రియా ని దాన దాని నలాఖ్యాక ధరణి జాని.

ముగింపు :

తే. గీ. హరిచరణ కంజసంజాత యైనయట్టి జాతి యిచ్చట నగణిత ఖ్యాతిచేత
సిరి గనియజాల నీలైకచేల ధారి యైన యాహలి ఘనత యెంతని హసించి.

సీ. జిగిగల్గ నీయింతి నగిన చాయల నెల్ల కేసర జాలకాకృతి జెలంగ
యిన్నీల కైశిక గన్న చాయల నెల్ల నీలనీరజ రాజి నిండ నెరయ
యీ చంచలాక్షి కేలిడిన చాయలనెల్ల సరస కంకేలికా శంక యడర
యీ నాతి చలితాంఘ్రి యైన చాయల నెల్ల లాలితస్థిర నీరజాలిగల్గ

జట్టి ననలెల్ల జెల్లిన జాడ దెలియ రాక యాసల దిరిగెడి రసిక జనత
సంతసించంగ దగియె నిచ్చటి లతాంత సంతతి క్రియకారిణి కాంతరీతి.

విశేషాంశములు :

ఈ ప్రతిని ముండ్లపూడి సుబ్బారాయుడు వ్రాసుకొనినట్లు తెలియు చున్నది. ఇందు రెండో అశ్వాసము నందు 100 పద్యముల వరకే యున్నది. లిపి స్పష్టము. లేఖన దోషములు కలవు. ప్రతి క్రిమిదష్టమై కొన్ని పత్రములు విరిగి యున్నవి.

# నిర్వచనోత్తర రామాయణము

## తిక్కన సోమయాజి - జయంతి రామభట్టు

ఆక్సెషన్ నెం : 159. కాల్ నెం : టి3-340

ప్రతి : తాళపత్రము; సమగ్రము పత్రములు : 145

ప్రతిపరిమాణము : 44X3.5 సెం. మీ. పత్రపంక్తులు : 5

ప్రారంభము :

శ్రీరస్తాన్మనుమ క్షితీశ్వర భుజా స్తంభే జగన్మంగళా
ప్రాసాద స్థిర భార భాజి దధతీ సా సాలభంజీ శ్రియా
శుండాలోత్తమ గండభిత్తిషు మదవ్యాసంగ మస్యాత్మనాం
యావంతే జయతే తరా మధురిహా మానంద సాంద్రస్థితిః.

ఉ. హరిహర పద్మగర్భులను నాది కవీంద్రుల నూత్న సత్కవీ
శ్వరులను భక్తి గొల్చి తగ వారి కృపన్ కవితా విలాస వి

స్తర మహనీయు డైన నను సర్వగుణో త్తరమూ ర్తి మన్న భూ
వరుడు తగంగ రా బనిచె వారని మన్నన నాదరింపుచున్.

సీ. అఖిల భోగమ్ముల కాస్పద మగుచోట భో గీంద్ర పట్టణంబునకు నెనయు
ధన సమృద్ధులకును తల్లి యిల్లగుట కు బేరుని వీటికి పెద్దయనియు
పై భవములకు నావాసంబు నగుటయు నమరాధిపతిపురి కధిక మనియు
నిర్మలవృత్తికి నెల వీ డగుట ఖార తీశ్వరు పోలికి నెక్కు డనియు

ఆ.వె. వినుతి సేయ జాలి వివిధోత్సవంబుల నతిశయిల్లి సజ్జనాభిరామ
మై కరంబు వొలుచునన్న గరంబు వి స్ఫురిత సకలవస్తు పూర్ణ మగుచు.

క. చని చని యచ్చోటం జి క్కనొకో తారకలనన్ ప్రకీర్ణరుచుల ద
వ్వున భిత్తి ప్రాగ్భాగం బున ఖచితము లైన వజ్రములు చెలు వొందున్.

ముగింపు :

తరలము

ధరణి యందును గాలవర్షము దైవయోగ సమగ్రమై
కురియు సస్యము లన్నియన్నియు గోరినట్టుల పండు ధ
ర్మగతి సర్వజనంబు నుత్తమ మార్గవర్తన శీలతన్
బొరయు మోదము నొందు రాఘవ పుంగవుండు మహోన్నతిన్.

మాలిని :

ధరణి భరణ విద్యాత్రార్థనత్వ ప్రకాంతా
హరిణ పరిణతుం డుద్యద్గుణాఢ్య క్షితీంద్రా
చరణ కరణ గాఢోత్సాహ బాహబలం డుదాంత
స్ఫురణ వరణ నిత్యస్తుత్య లక్ష్మీశు దుర్విన్.

గద్య :—

ఇది శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనా మాత్యపుత్ర బుధారాధన విరాజి తిక్కన నామధేయ ప్రణీతంబైన ఉత్తరరామాయణం బను మహాకావ్యంబునందు దశమా శ్వాసము.

ఏకాదశాశ్వాస ప్రారంభము :—

శం. శ్రీమద్రఘుకుల జలనిధి సోమా పరమాత్మనామ సుమనస్స్తోమా
భీమావహ దైత్యకుల వి రామా భద్రాద్రిదామ రాఘవరామా.

కం. శ్రీరాముడు చెలువం బగు ధారుణి పాలింపుచుండి ధర్మనిరతుడై
సారెకు మైథిలి దలపుచు కారుణ్యము చెలిమి కలిమి గారవ మొప్పన్.

కం. కుశలవపు తత్వబోధము కుశలపులకు ననుజులకును కుశలము జెందన్
విశదముగ వేదశాస్త్రీ పశమన మగు రాజ్యనీతి పద్ధతి తెలిపెన్ ॥

ఏకాదశాశ్వాసాంతము :

వ. ఇట్లు పరమేశ్వరుం డైన శ్రీమన్నారాయణుం డాశ్రిత రక్షణంబు కర్తవ్యంబు గావున, పురజన ఋష వానర తిర్యగ్సమూహంబులకు పుణ్యలోకంబు లొసంగి శ్రీధరా నీలా వధూమణులు వక్షస్థలోభయ పార్శ్వంబుల చంద్రబింబ నిభ కర్పూర సదృశ కాంతి విభ్రమంబులగు వింజామరంబులు వీవ గరుడ వాహనారూఢుండై సుర జ్యేష్ఠ లేఖర్షభు లిద్దరు తమతమ వాహనంబులం దేవర్షి దిక్పాలక సమూహంబుతో పరివేష్టింపి తోడన చనుదేర వైకుంఠ నిలయంబు ప్రవేశించు ముందర తుంబురు నారదాదులు గీత ప్రబంధంబు లుగ్గడింప సనకసనందన సనత్కుమారులు సేవింప పారిజాత వృక్ష మూలంబున కేతెంచి రత్నసింహాసనంబున పదునాలుగు భువనంబులు పాలింపుచు సుఖాసీనుండై మహావిభవంబుల శాశ్వతంబు గనుచు నుండె నంత.

కం. జనరహిత మయోధ్యాపుర మనువుగా నయతాబ్ద గణము లటు గోప్రదరం
బన దదె ఋషభుడు గైకొనె వినుతిగ తత్పట్టణంబు విభవము దాల్చెన్ ।

ఉ॥ తిక్కన సోమయాజి మును తెన్గుగ నుత్తరకాండ చెప్పి యం
దొక్కటి చెప్పు డయ్యె కడుయొద్దిక నే రచియింప వేడ్క చే
నిక్కము సంస్కృతంబు విని నెమ్మది భక్తిని నే రచించితిన్
చక్కని దేవళంబు తుద స్వర్ణఘటం బిడు పోల్కి దోచగన్ ॥

మాలిని :

దినకరకులదీపా దివ్యశౌర్య ప్రతాపా మునివరనుతపాదా ముక్తిసౌఖ్యప్రమోదా
దనుజకులవిదారీ దానధర్మోపకారీ ప్రణుతజనవికాసా భద్రభలాభృన్నివాసా ॥

**గద్యః**

ఇది శ్రీమద్రుద్రాదిరామ వరప్రసాద లబ్ధ కవితా గార్గేయగోత్ర పవిత్ర జయంతి కృష్ణభట్టారక సుభద్రాంబ వరతనూజ రామభట్ట ప్రణీతం బైన శ్రీమద్రామాయణం బను నాదికావ్యంబున నుత్తరకాండ తిక్కనసోమయాజి విరచితంబై యున్న శేషంబునం గల్గు మీదటి కథయందు శ్రీరాముల కుశలవులకు విద్యాభ్యాసనంబును త్రిరాత్రి వాజి పేయ పౌండరీకాదిగా శతక్రతువులు గావించుటయు భరత తనూజులకు గంధర్వ పురంబు పట్టంబు గట్టుటయు భరతు విజయంబును, రాము సన్నిధికి తాపస వేషధారియై వచ్చి శమను దేకాంతంబును, లక్ష్మణ వియోగంబును రామచంద్రుండు మహాపథంబున కుపక్రమించుటయు, భరతుడయోధ్యావాసుల తోడనె చనుటయు, లక్ష్మణుం డనంతుండై వైకుంఠ నగరంబునకుం జనుటయు, బ్రహ్మోపదేశంబున రామవేశ్వరుండు నారాయణాఖ్యుం డగుటయు, భరత శత్రుఘ్నులు శంఖ చక్రంబులై కొల్చుటయు, పురజన ఋక్ష వానర తిర్యక్సమూహంబుల పుణ్యలోక నివాసులం జేయుటయు, నారాయణాఖ్యుం బ్రవర్తిల్లి పూర్వరీతిని వైకుంఠ పురప్రవేశంబును, నను కథలు గలిగి సర్వంబును నేకదశాశ్వాసము.

**విశేషాంశములు :**

**ప్రతి విలేఖనము :**

వికారి సంవత్సర ఆశ్వీజ శుద్ధ 10 గురువారం రోజు మూడు ఝాముల వర్కు గంటుల్లి వేంకట్రామదాసు పంతులిగారి పుస్తకంలో కుప్పిలి చిననరసయ్యగారి వెంకట నరసయ్య కుమారుడు రంగయ్య పూర్వప్రతి నున్న క్రమంగా వ్రాసెను.

గ్రంథము క్రిమిదష్టము కాలేదు చక్కనిది వ్రాత బాగుగా నున్నది.

ఈ నిర్వచనోత్తర రామాయణ ప్రతియందు మొత్తము 11 ఆశ్వాసములు గలవు. ప్రస్తుతము నేటి ముద్రిత ప్రతియందు 10 ఆశ్వాసములే గలవు. ఈ 11వ ఆశ్వాసపు కర్త రామభట్టకవి తండ్రి జయంతి కృష్ణభట్టారకుడు తల్లి సుభద్రాంబ.

11వ ఆశ్వాసపు తుదను కవి తిక్కనసోమయాజి మేనుతెనుగున నుత్తరకాండ చెప్పి, రామ నిర్యాణముగల కథాభాగమును చెప్పనందున ఆ కథా భాగమును తాను పూర్తిచేసినట్లుగ వ్రాసుకొనెను.

తిక్కనసోమయాజి 10 ఆశ్వాసములను నిర్వచనముగా రచింప, రామభట్టకవి చంపూపద్ధతిలో అనగా గద్యపద్యమిశ్రితముగా వ్రాసెను. ఈ పద్ధతి తిక్కన రచచి పద్ధతికి భిన్నము. నిర్వచనోత్తర రామాయణ మని తిక్కన దీనికి పేరిడెను. కనుక రామభట్టకవి కూడా 11వ ఆశ్వాసమును నిర్వచనముగా రచించిన తిక్కన ఆశయసిద్ధి నెరవేరి యుండెడిది. అది యుచితము కూడా!

తిక్కన నన్నయ సంప్రదాయానుసారముగ గ్రంథాదిని సంస్కృత శ్లోకరూపము గనే మంగళాచరణ మొనర్చెను. ఇతడు నిర్వచనోత్తర రామాయణ రచన చేయు నాటికి యజ్ఞముచేసి సోమయాజియై యుండ లేదని యాశ్వాసాంత గద్యవలన దెలియు చున్నది.

ఈ గ్రంథమందు షష్ఠ్యంతిమ:లులేవు. ఇది మనుమసిద్ధి నృపాలున కంకితము.

# నిర్వచనోత్తర రామాయణము

## తిక్కన సోమయాజి

## జయంతి రామభట్టు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : | 2745 | కాల్ నెం | : | టి 8-542 |
| ప్రతి | : | తాళపత్రము ; అసమగ్రము | పత్రము | : | 81 |
| ప్రతిపరిమాణము | : | 41×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : | 7 నుండి 8 |

**ప్రారంభము :**

శ్రీరమణ చరణ శరదం భోరుహ భృంగ పతిచే త్రిభువన ప్రదితా
చారునిచే గనకాచల ధీరునిచే మనుమవసుమతీ వల్లభుచే ॥

**విశేషాంశములు :**

**ప్రతి విలేఖనము :**

శాలివాహనశకే గతసౌరాబ్దాః పింగలనామ సం॥ కార్తిక బ॥6 స్థిరవారం రాత్రి రెండు ఘడియలవరకు యధామాతృక ప్రకారం కొమ్మనాపల్లి సన్యాసికుమాళ్ళు

కృష్ణమ్మ ఆచంద్రార్కంగా చదువుకోగలందులకు శ్రీమద్రామాయణం బాదికావ్యంబున నుత్తరకాండ సంపూర్ణంగా శ్రీకృష్ణార్పణంగాను శ్రీరామ చంద్రార్పణంగాను వ్రాసుకొనెను.

ఈ ప్రతియందు తిక్కన వ్రాసిన దశాశ్వాసముల గ్రంథమే కాక మిగిలిన రాముని యొక్క మహాప్రస్థానాదులు ఏకాదశాశ్వాసమున జయంతి రామభట్టు రచనయును గలదు. కాని ప్రారంభమునందలి మూడు ఆశ్వాసములు ఈ ప్రతియందు లేవు. చతుర్థాశ్వాసారంభమునుండి ఏకాదశాశ్వాసాంతము వరకు గలదు.

ప్రతి నలుపుదిరుగు చున్నది. ఇందలి లిపి స్పష్టముగ లేదు. ఒక పత్రము మాత్రము కొంతనష్టమై యున్నది. ప్రతి విలేఖనమున స్వల్ప దోషము లున్నవి.

# నిర్వచనోత్తర రామాయణము

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 3638 | కాల్ నెం | : టి 3-376 |
| ప్రతి | : తాళ పత్రము; సమగ్రము. | పత్రములు | : 186. |
| ప్రతిపరిమాణము | : 41×3 సెం.మీ. | పత్రపంక్తులు | : 5 |

విశేషాంశములు :

ప్రతి విలేఖన కాల మిందు పేర్కొన బడలేదు.

గ్రంథము అచ్చటచ్చట క్రిమిదష్ట మగుటయేగాక కొన్నిపత్రములు ఎడమభాగమున శిథిలమై యున్నవి. వ్రాత బాగుగానున్నది.

# నిర్వచనోత్తర రామాయణము

## తిక్కన సోమయాజి

ఆక్సెషన్ నెం : 1792 కాల్ నెం : టి 3-589

ప్రతి : తాళపత్రము,అసమగ్రము పత్రములు : 15

ప్రతి పరిమాణము : 50×5.2 సెం.మీ. పత్ర పంక్తులు : 20 నుండి 25 వరకు

**విశేషాంశములు :**

ఈ ప్రతి విక్రమనామ సంవత్సరమున వ్రాయబడినది. ప్రతి క్రిమిదష్టమై తునకలై శిథిల మగుటకు సిద్ధముగా నున్నది.లిపి బహుసూక్ష్మము. చదువుట కష్టసాధ్యము. లేఖన దోషములు కలవు.

# నిర్వచనోత్తర రామాయణము

## తిక్కన సోమయాజి

ఆక్సెషన్ నెం : 3639 కాల్ నెం : టి 3-377

ప్రతి : తాళపత్రము;అసమగ్రము. పత్రములు : 141

ప్రతిపరిమాణము : 33.5×3.5 సెం.మీ. పత్రపంక్తులు: 7

**విశేషాంశములు :**

**ప్రతివిలేఖనము :**

దుర్ముఖి నామసంవత్సర కార్తీక బహుళ ౩ ఆదివారం రోజువరకు ఉత్తరరామాయణం పూతవిల్లి వారి ప్రతిని పున్న క్రమానను అమిరెపు అచ్చిరాజు కుమారుడు అప్పరాజు వ్రాసెను.

గ్రంథమునందలి ప్రతిపత్రము క్రిమిదష్టమై యున్నది. వ్రాత బాగుగా నున్నది. కొన్ని పత్రములు లోపించినవి.

# నిర్వచనోత్తర రామాయణము

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5569 | కాల్ నెం | : టి 3-361 |
| ప్రతి | : కాగితము;అసమగ్రము. | పుటలు | : 8 |
| ప్రతి పరిమాణము | : 32×24 సెం.మీ. | పుట పంక్తులు | : 24 |

విశేషాంశములు :

అసమగ్రము. ఈ ప్రతియందు నిర్వచనోత్తర రామాయణములోని ప్రథమాశ్వాసములోని సుమారు 61 పద్యములు మాత్రము గలవు. వ్రాత చక్కనిది. వ్రాత దోషములు కలవు.

# నిర్వచనోత్తర రామాయణము

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 702 | కాల్ నెం | : టి 3-341 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 22 |
| ప్రతిపరిమాణము | : 37×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 |

విశేషాంశములు :

ఇవి కేవలము విడిపత్రములు. మూడు నాలుగు ఆశ్వాసములకు సంబంధించిన పత్రములు కానోపును. మధ్య పెక్కు పత్రములు లోపించినవి.

# పంచతంత్రము

## దూబగుంట నారాయణ కవి

ఆక్సెషన్ నెం : 3647 కాల్ నెం : బి 3-229

ప్రతి : తాళపత్రము; అసమగ్రము. పత్రములు : 128

ప్రతిపరిమాణము : 27×4 సెం. మీ. పత్రపంక్తులు : 7

ప్రారంభము :

సీ. .... .... .... .... .... ....

....లు తొడలు మస్తకములు ఖండంబు లైన వేదండ తతులు

చరణంబు లూరులు బరులు గంధరములు తునకలై పడియున్న తురగములును

కంకణాంగదములు గడునొప్పి విరిగిన బాహుదండంబుల భటకులంబు

గీ. గల్గి బీభత్స రౌద్ర శృంగారములకు నాస్పదంబుగ గనుపట్టినట్టి నేల

కౌతుకంబున బొడగాంచి కదియు నంత దవుం నొక మహాధ్వని గుండె లవియ నిగుడ.

సీ. అమ్మహాధ్వని విని అత్యంత భయముతో మృగధూర్త మిట్టట్టు మెదల వెరచి

కనుమూసి తెరువ కెక్కడ జొత్తు ననుబుద్ధి శోకించి కనువిచ్చి చూచు నంత

ధారుణి బడియున్న భేరి మీదను దరి తరుశాఖ గాలిచే దాకు చుండ

పొడగని తనలోన బొడమిన భయ మెల్ల బోయిన నాభేరి డాయ వచ్చి

గీ. అప్పు డది గాననేరక యధిక భీతి పారిపోవంగ జూచితి పట్టు విడిచి

సొలవ కిది భాగ్యదేవత చూపె నాకు ననుచు నా నక్క యాత్మ నిట్లని తలంచె.

గీ. ఇది మహాభోజ్య మిచ్చట నొదవె నాకు నిప్పు డిది వ్రచ్చు కొని చొచ్చిహిత మెలర్ప

వలయు మాంసంబు భక్షింప వచ్చు నంచు సొలవ కాభేరి వ్రచ్చి తా జొచ్చి చూచి.

వ. అమ్మృగ ధూర్తం బందు నేమియుం గానక, వృథాస్థూలం బనుచు బోయెం గావున శబ్దమాత్రంబునకు శంకింపం బనిలేదు, అచ్చట శబ్దంబు వినంబడియె, నచ్చటికిం బోయి తెలిసికొని వచ్చెదం బనుపు మన వల్లె యని పింగళకుం డనుప సంజీవకుం డున్న యడకుంబోయి యతని కిట్లనియె.

ముగింపు :

వ. ఇట్లు తనభార్య చెప్పిన వివేక వచనంబులకుం బ్రమోదంబును నవిచార మూర్ఖత్వంబున నైన నకులవ్యాపారంబునకు పరితాపంబునునైన .... .... సర్వంబును దైవాధీనంబు గాకయని పలికి యమ్మహీదేవుండు తననందను నుపలాలనంబు సేయుచు దన భార్యయు దానును చింత వోవ నా స్థితి ప్రవర్తిల్లె నని చెప్పిన సుదర్శన క్షితీశ్వర నందనులకు విష్ణుశర్మ యిట్లనియె.

చ. కథ పఠియించు లోకహిత కార్యము లెల్లను దోచు మూఢులై
చదువని వారికిం దెలివి చాల నొనర్పదు నీతి సంపదా
స్పద మగు నీ ప్రబంధము విశాల గుణోన్నతి నెల్లనాడు న
భ్యుదయము జేయు భక్తి వినుచుండిన బాఠము సేయుచుండినన్.

క. ధర్మార్థ కామ సాధన కర్మములకు దగిన యట్టి కథ లన్నియు నీ
కర్మిలియై వినుతించితి నిర్మల దృఢ చిత్తు లగుచు నెగడుడు మీరల్.

వ. అనిన విష్ణుశర్మకు కుమారు లిట్లనిరి.

చ. విమల గుణోన్నతా పరుసవేది యొకించుక సోకి నట్టి లో
హమమర శుద్ధకాంచన మయత్వమునన్ గనుపట్టు భంగి ను
త్తమ భవధీయ వాగమృతధారల నాత్మలు నిర్మలంబులై
యమర వివేక సంపదకు నర్హుల మైతిమి మీ కతంబునన్॥.

వ. అని యతనికిం బ్రణామంబులు చేసి మరియు నక్కుమారులు నృప నీతి శాస్త్రంబు చదువుచున్న యనంతరంబ, సుదర్శన క్షితీశ్వరుండు, విష్ణుశర్మ రావించి యనఘా మీ వలన గుమారు లత్యంత ప్రజ్ఞాదురంధరులై బ్రతికి రిటమీద నాయుధాభ్యాసంబు చేయ గాలంబు గావున చదువు చాలింపుమని, నమ్మహీదేవున కగణ్య గోహిరణ్యాది దానంబుల నధిక సంతుష్టుంజేసి, బహుమానంబుగా ననుపుటయును.

శా. బాలాహృత్సరసీ .... .... గమనా ....
లీలా ... యంతపద్మ .... నాళీనూత్నకందర్పనా
రీలా వణ్యధనాధిపాత్మజ కుమారాపూర్ణ రాకా ....
భూలోకప్రమదా రమాధిపసితాంభోజాత పత్రేక్షణా॥.

**గద్య :**

ఇది శ్రీమైత్రావరుణ గోత్ర పవిత్ర. బ్రహ్మనామాత్య పుత్ర సుకవిజన విధేయ నారాయణ నామధేయ ప్రణీతంబైన పంచతంత్రియను మహాకావ్యంబునందు సంప్రేక్ష్య కారిత్వంబను పంచతంత్రంబునందు సర్వంబును పంచమాశ్వాసము.

**విశేషాంశములు :**

ప్రతి విలేఖనము: సౌమ్యనామ సంవత్సర మార్గశిర బహుళ ౧౩ బుధవారంవరకు వ్రాయ నయినది.

గ్రంథము క్రిమిదష్టమై యున్నది. గ్రంథపాతము కలదు. గ్రంథాది లుప్తము.

ఇది పంచతంత్రమను పద్యకావ్యము. ఇందు మిత్రభేదము, సహృల్లాభము. సంధి విగ్రహము, లబ్ధనాశము, అసంప్రేక్ష కారిత్వమను ౫ తంత్రములు కలవు. ఇందు మిత్రభేదము ప్రారంభమునుండి లేదు. సుమారుగా పీఠికతోసహా 150 గద్యపద్యములు లోపించినవి. మిత్రభేదము తక్క తక్కిన నాల్గు తంత్రములు సంపూర్ణముగా గలవు.

# పంచతంత్రము

## వేంకటనాథ కవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3827 | కాల్ నెం | : ట 3-276 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 83 |
| ప్రతిపరిమాణము | : 40 × 4.5 సెం. మీ. | పత్రపంక్తులు | : 9నుండి 11 |

**ప్రారంభము :-**

శ్రీ వృత్తస్తన నిస్తులైణ మదసంసిక్తం బురోవీథి బా
గై విన్నాణపు పుట్టుమచ్చ రవికన్యాసన్న విశ్వంభరా
దేవీ విభ్రమలక్ష్మి తేటపరుపం దీపించు త్రైలోక్య ర
క్షావర్ధిష్ణుడు కృష్ణు డూర్జిత మనీషన్ నాకు దిక్కయ్యెడిన్.

మ. సరసీజాతము లాటపట్టులు నిశాచారాతి చంచద్భుజాం
తర మావాసము పుట్టినిల్లు సలిలస్థానంబు దారిద్ర్య భూ
ధర వజ్రాయుధ కోటి మాపు నిగమాంతఃప్రోక్తలాశంసినీ
పరిషద్భాగముగా జెలంగు జగదంబన్ బద్మ గీర్తించెదన్.

చ. తరలక హో యుపాంశు జపదంభమునన్ వనజాత పీఠిక
న్నర మొగుడించి సృష్టికరుణాయతి మూలకు ద్రోచు భారతీ
చరణ శిఖాంత విభ్రమ రసంబులు ప్రస్తుతి సేయు ధాత మ
న్నిరుపమ దివ్యకావ్య పదనిర్మితి బ్రోడి యొనర్చు గావుతన్.

సీ. వనజగర్భ కటాహ వర్ధిష్ణు వరణంబు బలి బహూకృత పుణ్య సలిలఖేయ
మరుణాంశు శకలభాసుర రత్నసౌధంబు కుధరభిద్గృహ చుంబి గోపురంబు
ధనదవాక్రీడ సచ్ఛాత్ర నిష్కుటకంబు బ్రహ్మ నిష్ఠ ద్విజ ప్రాంజలంబు
.... .... .... .... .... ....

తే.గీ. పద్మనాయక శుభ విభాభ్యర్చమాన విద్వదావాస మండలి విహార మాణ
భూరిసంతాప తిమిరంబు పొగడ నెగడు పూర్ణ గరిమంబు పాటలీపుత్ర పురము.

సీ. హాలహలం బిదిగాదె యభ్యమిత్రీయ జీ వానిల గ్రాహివ ప్రాధిపతికి
పదమదం బిదిగాదె పరుషారి వారిజో న్మూల కృద్బాల శుండాలపతికి
చిరతరం బిదిగాదె వరరాజ సంరోధి పరజ మండల చక్రవాళమునకు
క్రొమ్మెరుం గిదిగాదె కుటిల శాత్రవ తను క్షతజ యుక్ప్రాకార చక్రమునకు

తే.గీ. క్షౌద్ర మిదిగాదె ప్రతిపక్ష జాతి చెడని కొమ్మరేకుల గనుపట్టు కోటదమ్మి
కనగ జనలోచనోత్థపం బాచరించె పరిఘవిల్లు పొగడ్త నప్పురి యగడ్త.

ముగింపు :—

చ. పటు రభసంబునం బొదివిపట్టి దురాత్మకత యిట్టి వారి నే
డిటువలె జేసి చంపుటకు నెవ్విధి సీ మను సోర్చె వీరు ని
ష్కుటిల చరిత్రు లన్యులకు గోర రొంకింతయు గీడు వీరిపై
కటకట మచ్చరం బెటుల గల్గె వృథా యిది పోల దెయ్యెడన్.

క. నిటల లిఖితాక్షరంబులు కుటిలాత్మ మనం దెనలగొన బగు జెటులం
కటుల గతి జంపి తీవని కటములు పొంగార క్రూరగతి వారంతన్.

క. ఆ క్షురి గొని దొడిబడ నల భిక్షుని పాదములు సరసబెట్టి భుజాహే
తి క్షితి మనిమిరి ధర నప రిక్షిత కార్యాలు గ్రజింపరే యాపదలన్.

చ. ప్రశమనరేఖ పాదమున బ్రామి యహో యవివేకరోష సం
వశు డగుచుం ధరాస్థలి నవారణ నెవ్వడు వేగిరించి సం
భృశతర కార్యముల్ సలుపుపెద్దయు వేయును నేల సర్వ దు
ర్దశలు గలంచు వానితముదా గుణ లుబ్ధులు బొందు సంపదల్.

వ. కావున నీవును నా పితునకుం దోడుబోయిన వాడవు నీవని ప్రాణేశ్వరునిం జూరి, సుఖ స్థితి నుండిరని విష్ణు శర్మండు జప్పిన విని నీతి కథార్ణవంబునకు సుదర్శన కుమారులు లబ్ధ వర్ణులై తండ్రి నలవరింపుచుండిరి.

మ. సతత శ్రీధృత రాగదేహ కృతయోషా భాగరత్నా స్థిదా
మత విత్తారక యుక్త వారిధర సమ్యక్కాయ చిత్తేయ ష
ణ్ముతమోహాధృతికర్తృ కామహితగామ ప్రేమగోపాంగణా
శతచామీకర చామరానిల చలాంచత్ఫాల లోలాలకా.

క. హాటక మణి నూపుర నృప కోటీ కమలాప్త చరణ రుచిరాగ్నిశిఖా
వాటీర భసిత పల్లవ పాటల మందార పాదప ప్రతిమానా.

మాలిని :

త్రిపుర రిపువరస్త్రీ త్రీవమాన చ్ఛిదాధీ నిపుణతర విహారా నిత్యసంతోష పూరా
జపకరణ చరణార్యాసక్త మానాభి గమ్యా త్రిపటుతను విలాసా దివ్యధామైక వాసా.

గద్య :—

ఇది శ్రీ వేంకటనాథ కరుణాలబ్ధ సరస సాహిత్య కవితా విలాస సకల సుకవి ప్రశంసా భాషణోల్లాస రాజకుల పారావార పర్వ శర్వరీరమణ పరిశీలిత నీతిశాస్త్ర మార్గ పరి శ్రమణ ధైర్యపరాయ దీకృతనీహార పర్వత పర్వతరాజ కుమార నిస్సహాయ

ప్రబంధ నిర్మాణ భోజభూదార సుధామధుర భారతీసనాథ వేంకటనాథ ప్రణీతం బైన పంచతంత్రంబున నసంపేక్ష్యకారిత్య మన్నది పంచమ తంత్రం సంపూర్ణం.

విశేషాంశములు : —

ప్రతివిలేఖనము :

శ్లో. క్షయాబ్దే చైత్రమాసె షష్టిమ్యాం సితపక్ష కే
స్వృగువారే త్రియామేచ లిఖ్యంతే మమపుస్తుకం ॥

సూగూరు తాలూక కొత్తకోట గోపాలుగారి స్వహస్త ప్రతిక్రమాన చూచి వ్రాసిన పంచ తంత్రం అయిదుతంత్రాలు పం॥ వెంకయ్య మొకాం విభరాంబాద తమ స్వధాకు వ్రాసుకున్నది.

కవి తాను అసహాయ సరసకవితా రసికు డని చెప్పుకొనెను. ఆశ్వాసాంత గద్యయందు యీ కవి తనకు పెక్కు విశేషణముల నుపయోగించుకొని తన ప్రౌఢిమను కవిత్వ పటిమను తెలుపుకొనెను. ఇందు మిత్రభేదము, సుహృల్లాభము, సంధి విగ్రహము, లబ్ధ నాశము అసంపేక్ష్య కారిత్వము అను అయిదు తంత్రములు ఐదు భాగములుగ నున్నవి. నిరక్షరకుక్షులు అగు రాజకుమారులకు విష్ణుశర్మ పశుపక్ష్యాదుల కథల ద్వారా నీతిబోధ గావించి వారిని నీతికోవిదుల గావించుట ఈ కావ్యకథ. నీతి ధర్మాదుల యందు తనకు గల జ్ఞానప్రౌఢిమను కవి దీనియందు ప్రదర్శించెను. కావ్యము హరిహర నాథాంకితము. ఈ ప్రతియందు పూర్తికావ్యము ఉన్నది. ప్రతి కొద్దిగా నలుపు దిరిగినవి. లిపి స్పష్టము కాదు. కొన్ని చోట్ల పదములు, కొన్ని పాదములు వదిలి వేయబడి ఖాళీ ప్రదేశము లుంచబడినవి. అక్షర దోషములును స్వల్పముగ గలవు.

# పంచతంత్రము

## వెంకటనాథ కవి

| | | | |
|---|---|---|---|
| అక్సేషను నెం | : 6119 | కాల్ నెం | : టి 3 - 617 |
| ప్రతి | : తాళపత్రము : అసమగ్రము పత్రములు : 152 | | |
| ప్రతిపరిమాణము | : 45.5×2 సెం.మీ. | పత్ర పంక్తులు | : 5 నుండి 6 వరకు |

విశేషాంశములు :

నందన నామ సంవత్సర భాద్రపద శుద్ధదశమి సోమవారంవరకు కుంచపర్తి బాపనయ్య కుమారుడు కోటయ్య చదువు తాలూకు మాకు రూపాయిబేడా అరవీసం బాకీ వుండగా దీనికిందను పంచతంత్రి అనే ఈ గ్రంథం ఖరీదు చేసి ఇచ్చినాడు గనుక అత్తలూరి రాజలింగం కొనుక్కున్నాడు.

ఈ గ్రంథమునందు రెండు పత్రములు మాత్రమే లోపించినవి. ప్రతి బాగున్నది. లిపి స్పష్టము. లేఖన దోషములు, పద్యపాద లోపములు గలవు. గ్రంథాంతమున సిరి బాకీకి చెల్లుగా అమ్మ ఇది నట్లున్నది.

# పంచతంత్రము

## వెంకటనాథ కవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 4630 | కాల్ నెం | : టి 3-104 |
| ప్రతి | : తాళపత్రము ; సమగ్రము. | పత్రములు | : 124 |
| ప్రతి పరిమాణము | : 45×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 7 |

విశేషాంశములు :

ఈ ప్రతియందు ఆద్యంతములుగల పూర్తి గ్రంథ మున్నది. ప్రతి క్రిమిదష్టమైనది. లిపి స్పష్టముగా లేదు. అటనట పద, పాదచ్యుతములు గలవు. లేఖన దోషములును గలవు.

# పంచతంత్రము

## వెంకటనాథ కవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 4631 | కాల్ నెం | : టి 8-145 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము | పత్రములు | : 55 |
| ప్రతిపరిమాణము | : 42×4 సెం.మీ | పత్ర పంక్తులు | : 7 నుండి 9 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు ప్రథమ పద్యమే అసంపూర్ణముగ నున్నది. రెండవ పత్రము లేదు. కథా ప్రారంభము నుండి మిత్రభేద మంతయు గలదు. అటనట కొద్దిగా వదిలి వేయబడినది. సుహృల్లాభమున "అతి సంచయేచ్ఛ వినాశహేతు" వను కథవరకు మాత్రమే కలదు. ఇందును అచటనచట కొన్ని పద్యములు వ్రాయక వదిలి వేయ బడినవి. పత్రముల పార్శ్వభాగములు కొంత నశించినవి. లిపి స్పష్టము. కాని ప్రతి విలేఖనమున చాల దోషములు గలవు. ప్రతి నలుపు దిరుగు చున్నది.

# పంచతంత్రము

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 3939 | కాల్ నెం | : టి 3-292 |
| ప్రతి | : కాగితము ; అసమగ్రము. | పుటలు | : 51 |
| ప్రతిపరిమాణము | : 29×16 సెం.మీ. | పుట పంక్తులు | : 23 |

**ప్రారంభము :**

.... .... .... .... సుహృల్లాభ తంత్రం విను .... .... ...
.... జు కొమాళ్లకు యిట్లనియె.

శ్లోకం ॥

అసాధనం విత్తహీనం బుధివంతం సుసౌంజ్ఞికం।
సాధయా సర్వకార్యాణి కాకకా మృగకూర్మ ....

**టీక ॥**

కార్యాంత మనే వనమందొక వృక్షం మీదను మేఘవర్మ డనేటి వాయసరాజు సుఖంగా వుండగాను ఆ వాయసం తన ఆహార నిమిత్తం పోతు వుండగాను ఆ దారి యందు విద్యు ... టి ఒక వేటగాడు నానావలలు కొంచుబోయిన వాటినిగని యీ వాయసం తనలో తాను ఆలోచన చేసుకొని నేను పోతేను యిక్కడ అతడు వచ్చి తన పుత్ర మిత్ర కళత్రాదులను వలలచే పట్టుక పోపునని ఆహారానకు పోకను... వృక్షానకు వచ్చి వుండంగాను, ఆ వేటగాడు వలల దీసుక కూర్చుండెను ... ... ...

ముగింపు :

టీక॥ దైవం కటాక్షం చేతను. బ్రాహ్మల ప్రసాదం చేతను. నాలుకమీద సరస్వతి నిలిచి వుండంగాను, ముందర వచ్చేకార్యం వెనుక అయిన కార్యం కనుపించును భానుమతి మచ్చకంటి కనుపించును అనిన రాజు మహాసంతోషపడి ఇతనికి సష్టాంగం యిచ్చెను. శతానందుడు తన ప్రధాని రాజు తమప్రాణపదంగాను కూడి వుండిరి. అట్లు గనుక యే కార్యమైనా హెచ్చరిక గల్గి చేయవలెను. అని ఆ బ్రాహ్మణి పెండ్లాము మొగనికి యీ కథ జెప్పెనని విష్ణుశర్మ ఈ అయిదు తంత్రాలు సుదర్శనరాజు ముగ్గురు కొమాళ్లకు జెప్పెను. వారు మహాసంతోషపడి జ్ఞానం వచ్చి తమ తండ్రి వద్దకు తమ గురువును విష్ణుశర్మను వెంటబెట్టుకపోయి, తమ ప్రౌఢిమ చూపి, యీ బ్రాహ్మణునికి సంప్రాంగం యిచ్చి, రాజు కొమాళ్లు తాను సుఖంగా వుండిరి.

శ్లోకం ॥

దాసీభృత్యా సఖాబంధూ వస్తువాహన మేవచ।
ధనధాన్య సమోభ్యాయో ఉష్టైశ్వర్యం ప్రకీర్తితః
పంచతంత్రం సంపూర్ణం ॥

విశేషాంశములు :

ప్రమాది నామ సం॥ భాద్రపద శు॥ 9ల వరకు ముగిసినది. దస్తూరి మొగసల చిన్న వీరయ్య కుమారుడు పుల్లప్ప వ్రాసిన పంచతంత్రములు సంపూర్ణము.

ఇందు సుహృల్లాభము సంధి విగ్రహము లబ్ధనాశము అను తంత్రములు మాత్రమే యున్నవి.

ఈ ప్రతియందు కావ్యాంతము గలదు కానీ కావ్యారంభము లేదు. ఇందు ఒక శ్లోకము చెప్పబడి దానికి టీకగా వత్తసించబడి యగు కథ తెలుగు వచనములో చెప్పబడినది. గ్రంథకర్త నామ వివరాదు లీప్రతియందు వ్రాయబడలేదు.

ఈ ప్రతి పైకాగితములు కొంత, ప్రతి అంచులు కొంత విరిగిపోయినవి. మధ్యలో కూడ ఒక కాగితము లుప్తమైనది. ప్రతి నలుపు దిరుగుచున్నది. లిపి స్పష్టముగా కన్పించుట లేదు. భాషా దోషములు లెక్కకు మిక్కుటముగా నున్నవి.

# పండితారాధ్య చరిత్ర

## పాల్కురికి సోమన



ప్రారంభము :

శ్రీమత్శైవ రమావరున్ యమితమ శ్రీ చెన్నమల్లేశ్వరున్
ధీమంతు న్నిగమాగమ శ్రుతివచోద్గీతార్థవేత్తన్ బుధ
స్తోమస్తున్ బ్రభు నూర్ధ్వనేత్రయుగు నాద్యు న్పండితా రాధ్యులన్
కామింతున్ నుతియింతు గొల్తు దలతున్ కామ్యార్థ సంసిద్ధికిన్ ।

వ. మరియు ఆ పండితారాధ్య దేవర చారిత్రంబునందు గృతిపతి నిరూపణంబును భక్త ప్రార్థనయు గృతి ఫలంబును గురుస్తోత్రంబును భక్తప్రశంసయు, భక్తానుగ్రహణంబును ప్రబంధకృతి స్వీకారంబును కవీశ్వర నామంబును నిజవీరవ్రతాను దాడనయును.

శ్రీగురుమూర్తి నూర్జిత పుణ్యకీర్తి నాగమాంత స్ఫూర్తి నానంద వర్తి
వృషభ స్వరూపు నవిద్యా దురాపు విషమ ప్రతాపు నిర్విషయ కలాపు
పరమ కల్యాణు సద్భక్త ధురీణు శరణాగత త్రాణు సజ్జన త్రాణు
ప్రమదైక విశ్రాము భక్త లలాము గమనీయ గుణధాము గణసార్వభౌము
నీతజంగమదాస్యు నిగమ మయాస్యు భూతలైక సమస్యు బుధజనోపాస్యు
శివభక్త సింహంబు చిన్నివాసంబు భవగిరి కులిశంబు బసవలింగంబు
తెల్లంబుగా నస్మదీయేశు చెన్న మల్లికార్జును దివ్యమహిత రూపంబు
దానైన బసవన దండనాయకుల జానొంద మత్కృతి స్వామి గావించి
కమనీయ సకలనిఃకళంక తత్వ మమల ప్రమథుల త్రిభువన ప్రమథులం దలచి
నుతపురాతనభక్త నూతన భక్త వితతి లింగంబుగా వీక్షించి కొలిచి
ఆరూఢముగ మల్లికార్జున పండి తారాధ్యుల చరిత్ర మర్థి వర్ణింతు

**ముగింపు :**

అనగ గురుత్రితయాన్వయ తనయ తనయ పరంపరోత్తమ పరంపరలు
ప్రథుతర గురుపరంపర రేజిల్ల త్రిభువనంబుల బర్వె త్రిపదగ భాతి
వేదత్రయ విభాతి విశ్రుతాగ్నిత్వ మోదిత కలిత మహోన్నత ఖ్యాతి
దానిట్లు కృతి సమాప్తంబయ్యె నంత మానుగా దుది బంచమ ప్రకరణము
అరయ నీ కృతి సార మగు చతుర్థ ప్ర కరణ మధ్యమున సంకలితమై వెలుగు
నవ్యగణ సహస్రనామ స్తవంబు భవ్యముగ పఠించు ఫల లేశమునను
ఐహికాముష్మిక కాద్యత్సనాతన స మాహితాదిష్ట ముఖ్యము లొందు ననిను
ప్రమథ రుద్రాది పురాతన నూత న మహాగణాభి వర్ణనము లోకముల
నారూఢమతి మల్లికార్జున పండి తారాధ్య చరిత్ర మాద్యంతంబు వినిన
చదివిన వ్రాసిన సంగ్రహించిన స ముదితాభినుత ఫలంబులు పొందు టిదె
కావున నీ కృతి గారవించినను వావిరి చదివిన వ్రాసిన వినిన
నరు దొంద వారికి యభిమతార్థములు గరుణించు శివుడు మంగళ మహాశ్రీలు

**గద్య :**

ఇది యసంఖ్యాత మాహేశ్వర దివ్య పదపద్మ సౌరభ భ్రమరాయమాన
జరిగమలింగ ప్రసాదోప భోగ సంగత సుఖసుధా శరధి నిమగ్న
సుకృతాత్మ పాలకురికి సోమనాథ సుకవి ప్రణీత భాసుర వరదండ
నాయక బసవాంకణ ఖ్యాతగుణ గ ణాయత కీర్తి దిగంత త్రిలోక
గురు పండితారాధ్య చరితంబునందు బరువడి పంచమ ప్రకరణ మొప్పు।

**విశేషాంశములు :**

ప్రతి చక్కనిది. క్రిమిదష్టము కాలేదు. గ్రంథపాత శైథిల్యములు లేవు.

గ్రంథాదిని మాత్రము విషయసూచిక వచనములో వ్రాయబడి యున్నది. అట్లే విషయసూచికకు ముందు ప్రార్థనా పద్యము వృత్తములో వ్రాయబడి యున్నది. ఈ భాగము బహుశః ప్రతి వ్రాయసకాడు వ్రాసుకొని నట్లుగా మనం పేర్కొనవచ్చును. ఇందు ౬ ప్రకరణములు గలవు. ఇది శైవమతమునకు సంబంధించిన గ్రంథము. శైవ మత దీక్షను పొందిన వారిలో అగ్రేసరు డగు మల్లికార్జున పండితారాధ్యుని చరిత్రను దెలుపు గ్రంథము. ప్రసక్తానుప్రసక్తముగ నిందు కొందరు శివభక్తుల చరిత్రములు, మహిమలు గూడ వర్ణింప బడినవి.

# పండితారాధ్య చరిత్ర

## పాల్కురికి సోమన

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : | 507 | కాల్ నెం | : | టి 3–79 |
| ప్రతి | : | తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : | 205 |
| ప్రతిపరిమాణము | : | 47 × 3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : | 6 |

విశేషాంశములు :

గ్రంథము మిక్కిలి శిథిలావస్థలో నున్నది. గ్రంథశైథిల్య గ్రంథపాత మధికము. గ్రంథాది మృగ్యము.

# పండితారాధ్య చరిత్ర

## పాల్కురికి సోమన

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : | 4033 | కాల్ నెం | : | టి 3-293 |
| ప్రతి | : | కాగితము;అసమగ్రము. | పుటలు | : | 24 |
| ప్రతిపరిమాణము | : | 16 × 20.5 సెం.మీ. | పుట పంక్తులు | : | 26 |

విశేషాంశములు :

వ్రాత చక్కనిది. చిన్న అక్షరములు కాగితమునకు రెండువైపుల వ్రాయబడినది. వ్రాయసకాని నామము ప్రతి విలేఖన కాలము పేర్కొన బడలేదు.

ఇందు వేదవాదము, కర్మవాదము,కాలవాదము,వేదాంతవాదము,సాంఖ్యవాదము,చార్వాక వాదము,పాంచరాత్రవాదము, బౌద్ధవాదము మొదలగు వాదములు కలవు. బౌద్ధవాదము తక్క మిగిలినవాదములు సమగ్రము. ఈ ప్రతియందు పండితారాధ్య చరిత్రలోని తృతీయ ప్రకరణములోని కొంత భాగము మాత్రము వ్రాయబడినది.

# పండితారాధ్య చరిత్ర

## పాల్కురికి సోమన

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | . | 3992 | కాల్ నెం | : | టి 3-594 |
| ప్రతి | : | తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : | 74 |
| ప్రతిపరిమాణము | : | 43.5 × 5.3 సెం.మీ. | పత్రపంక్తులు | : | 11నుండి12 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు దీక్షాబోధ చెన్నమల్లుసీసములు అనుభవసారము బసవపురాణము మల్లాదేవిపురాణము అను గ్రంథములు కూడ ఉండినట్లు తాళపత్రములో వ్రాయబడినది కాని యవియన్నియు శిథిలములై పోయినవి. పండితారాధ్య చరిత్రలోని చాలభాగము కూడ పూర్తిగా శిథిల మైనది. ప్రతి శిథిలావస్థకు దగ్గరగా నున్నది. పత్రములు నలుపు విరిగి విషయగ్రాహ్యము దుష్కరముగ నున్నది. లిపి స్పష్టము.లేఖన దోషము అధికము.

# పరమయోగి విలాసము

## తాళ్ళపాక తిరువేంగళనాథుడు

| | | | | |
|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 434 | కాల్ నెం | : | టి 3-98 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము | పత్రములు | : | 196 |
| ప్రతిపరిమాణము | : 43×4 సెం.మీ. | పత్రపంక్తులు | : | 6 నుండి 7 |

ప్రారంభము :

శ్రీయలమేల్మంగ........ కృపా పాంగ దోయజ దళనేత్రి దోయధి పుత్రి
శ్రీవేంకటేశ సంశ్రిత కుచ........ దేవేంద్ర వినుత నాదిమ వచోవినుత
గజరాజ మిళిత యంగజరాజ కలిత విజితారి కుంభిణి వికచాబ్జ పాణి
జలజలీలా . . హ సౌవర్ణదేహ జలజాత భవమాత జగదేక మాత

శ్రీవెంకటాధీశు జిరకృపావేశు దేవాదిదేవు సంచీ_ప్త ప్రభావు
దలచి భూని . . ల వడవి యా చక్రి జలజ కౌమోదకీ శార్ఙ్గ ఖడ్గముల
దిరమొందు భక్తి నుతించి యనంత గరుడ విష్వక్సే . . కరుణయుం బడసి
శ్రీకర వైష్ణవ సిద్ధాంత విభవ పాకశాసను దాళపాక శాసనుని
ఆచార్య విజితామరాచార్యు దిరుమ లాచార్యు ఘను మది నాచార్యు దలచి
పరమార్యు వాధూలపతి నప్పగారి గురుతరు లగు సర్వగురు వరేణ్యులను
రామాంఘ్రి కమలాభిరామ తాత్పర్యు రామానుజాకారు రామానుజార్యు
అమలునిం బరమదయాకర మూర్తి నమితవిద్యాపూర్ణుం డగు మహాపూర్ణు
మందార హరణ నిర్మల పాదపద్మ వందారు మా యామునవందారు బొగడి
ఆమోద భరకీర్తి తాబ్జమిత్రాలి రామ మిశ్రాఖ్యుని రామమిశ్రాఖ్యు
మండిత నిజచిత్త మందిర నిహిత పుండరీకాక్షుని బుండరీకాక్షు
కనక చేలునకు శృంగార లోలునకు వినమితేశునకు శ్రీ వెంకటేశునకు
అంకితంబుగను గావ్యంబు గావింతు నింక దత్ప్రారంభ మెయ్యది యనిన
మోదించి నారద ముని చెప్పి నట్టి యాదవశైల మాహాత్మ్యంబు నందు
గౌరవంబున కలౌఖలు భవిష్యంతి నారాయణ పరాయణా యని పలుకు
కలి..............భాగవతంబునందు గలిగి పూర్వాచార్య కథితమై వెలసి
మరియును వృద్ధపాద్మంబునం బద్మ తెరగొప్ప సూత్రవతికి జెప్పి నట్లు
కావున తత్కథాక్రమ మొప్ప నేను గావింతు కృతి దాని క్రమ మెట్టి దనిన
వలనొప్ప చిదచిదీశ్వర తత్వ మగుచు నల చతుర్దశ భువనాత్మకం బైన
కమలజాండంబును గడచి యా మీద గమలతేజోవాయు గగన భూతాది
తతమహదవ్యక్త తత్త్వరూపముల నతిశయం బొందు సప్తావరణముల
డాసిన ప్రకృతి మండలమున వవుల భాసిల్లుచును పరాత్పర వాస మగుచు

ముగింపు :

రామానుజార్యు దారసి సంతసించి ఆమోద వార్ధి నోలాడి యామీద
నారాయణాచలనాథు శ్రీనాథు నారాయణుని భక్తి నాటసే ....చి
యతని యుత్సవ గేయమై యెన్నదగిన జితకాము శతరూప శ్రీమనోహరుని
యదుగిరీశ్వర సంపదాత్మ జాహ్వయుని త్రిదశ వందితుని బ్రతిష్ఠ గావించి
అలమేలుమంగకు నమలాంతరంగ కలిసీలవేణికి నబ్జపాణికిని
అతిలోక మతికి శేషాచలరాజ పతికి సరోముఖ్యాభక్త సంతతికి

సంకితంబుగను శ్రీహరి భక్తి నికర పంకజార్యమ తాళ్ళపాకన్న యార్య
తనయ తిమ్మార్య నందన రత్నశంఖ దనుపమ శ్రీవెంకటాధీశ దత్త
మకరకుండల యుగ్మ మండిత కర్ణ సకల వైష్ణవపాద సంసేవకాబ్జ
సదనావధూలబ్ధ సరస కవిత్వ విదిత మానస తిరువెంగళనాథ
కృత మైన పరమయోగి విలాస కృతిని యతులి....బ్రుగు సప్తమాశ్వాస మయ్యె

విశేషాంశములు :

ఇది మొత్తము 8 ఆశ్వాసములగ్రంథము. ఆశ్వాసములు సంపూర్ణముగా గలవు. 8వ ఆశ్వాసమునందలి చివర 2 పత్రములు శిథిలావస్థలో నున్నవి. గ్రంథము క్రిమిదష్టమై యున్నది. వ్రాత బాగుగా నున్నది. ఈ ద్విపద కావ్యము వేంకటేశ్వరున కంకిత మీయబడినది.

# పాండవ విజయము

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 2322 | కాల్ నెం | : టి 3.189 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము | పత్రములు | : 76 |
| ప్రతి పరిమాణము | : 41×3.5 సెం.మీ | పత్రపంక్తులు | : 5 |

ప్రారంభము :

శ్రీమానినీ మణి చిత్తానురాగ కోమల కంజాత గురుతర మధుర
సాలోల జాల సారంగాయమాన లాలితానందైక రమ్యాంతరంగ
మకరకుండలగండ .......... మకరాంక శతకోటి మహిత లావణ్య
సకల దిశాధీశ సందోహరత్న మ .... జాల మహిత పాదాబ్జ
నతులితానంత కల్యాణ గుణాఢ్య .... భక్తావను ..............
............ సంహార ముక్తామణిహార ............యంగ పీణోపహార
వినుతకీర్తి విలాసు విమల ప్రహాసు కనక సద్యా ....ట శైల వా..
.... మదినుంచి మ్రొక్కి గీర్తించి




....జలధి ముంగరశాన సుకవి పాదపద్మము చాల ప్రస్తుతి చేసి
పదపడి నవరస భావవైఖరుల విలసిల్లు పాండవ విజయకావ్యంబు
వెలయంగ ద్విపద గావించెద నెఱమి ..........పద గుంభనముల
నా కథ వృత్తాంత మది యె . . దనిన

అతులితం బగు నైమిశారణ్య భూమి యతివరేణ్యులు శౌనకాదులు చెలగి
యాతత విఖ్యాతు యతి గుణోపేతు సూతుని కనుగొని సొరిది యిట్లనిరి.
తాపస కులచంద్ర తతికీర్తి సాంద్ర యా పాండవులకును యక్ష నాథునకు
కయ్యంబు దొణగిన కారణం బేమి యియ్యెడ మాకు నీ వి........ల్ల దెలుప
మనిన సూతుడు శౌనకాదుల జూచి వినయ మార్గంబున వివరింప దొణగె
భూతలంబునకు నద్భుతమై జెలంగి చూత మన్మథ వటశోక హింతాల
మాతులుంగాశ్వత్థ మల్లికావకుళ కేతకీ ఖర్జూర కేదార పనస

వసుధపై నలరారు ద్వైత వనం....
....మై తగునా యరణ్య మధ్యమున ధౌమ్యాదు లఖిల శాస్త్రంబులు దెలుప
ద్రౌపదీ సహితులై తగ పాండవేయు లేపు మీరిన కౌరవేశ్వరు గుణము
లెన్నుచు .... బు లీరికె లె త్త నున్నగా శరములు నూరుచు నుండె

ముగింపు :

తడయక ననుజులు ద్రౌపది తాను ... ... ...
వెలయగా నొక యేడు విరటుని వద్ద కొలు వుండి తరువాత గురుతుల దెలిపి
యలరుచు నుత్తర నభిమన్యునకును చెలగి వివాహంబు చేయించి వేగ
విరటుండు ద్రుపద భూవిభుడాది యైన నరవరు లరుదేర నలినలోచనుడు
ఘనత సహాయంబుగా జనుదేర పనుపడ రారాజుపై దండు వెడలి
పెలుచ సంగర భూమి భీష్ము జెండాడి .... మున గలన నాచార్యుని దునిమి
కరకరి బోరిలో కర్ణుని జంపి సరభసంబున నని శల్యుని గూల్చి

కలగక నొంటరి కయ్యబులోన తలపడి యురగకేతనుని మర్దించి
యురుపడి త.... యోధుల నెల్ల వరుసతో డాహవమున ఖండించి

ఐరువిడి నెమ్మితో పొందు నందనులు  సరసిజాక్షుని కటాక్షంబున చెలగి
సకల భోగంబుల సకల సంపదల  సకల భాగ్యంబుల సకల వైఖరుల
సకల ధర్మంబుల సత్య మార్గముల  ప్రకటించి సకల భూభాగ మంతయును
నెనయ మహోన్నతి నేలుచు నుండి  రనుచు సూతుడు శౌనకాదులతోడ
వినయ వాక్ప్రౌఢి సవిస్తరంబుగాను  వినుపించి యిట్లను వేడ్క రంజిల్ల
యీ మహాచరితంబు హిత సంభ్రమముల  వేమరు జదివిన వినిన వ్రాసినను
ప్రేమ పఠించిన పృథివీ తలమున  నా మహామహులకు నాయురారోగ్య
మాదిగ .... వస్తువాహన ధన కనక  నిరత కల్యాణ వర్ధిత భోగభాగ్య
మంచి రపుత్ర రమామణి విలసి  తాందోళన చ్ఛత్రహాటక వస్త్ర
నవరత్న భూషణ నవ్యసంపదలు  వివిధ సౌఖ్యంబు లేవేళ చెలంగి
సకలబాంధవ మిత్ర సహితంబుగాగ  నకలంక .... నలరు చుందురు

**విశేషాంశములు ;**

పాండవవిజయము అను నీ కావ్యముయొక్క కర్త పేరు తెలియుట లేదు. గ్రంథాదిని "ముంగరశాన సుకవి పాదపద్మములు చాల ప్రస్తుతి చేసి" యని యుండుటచే ఆ ముంగరశానసుకవి శిష్యు డొకడు ఈ గ్రంథకర్తయై యుండవచ్చును. ఇది ద్విపద కావ్యము. ఇందు పాండవులు యక్షనాథునితో యుద్ధము చేయుట, విజయులగుట, ముఖ్యాంశము. కౌరవులను జయించుట, రాజ్యము పొందుట మున్నగునవి క్లుప్తముగ చివర చెప్పబడినది. ఇది సులభశైలిలో గలదు.

ఈ ప్రతియందు ఆద్యంతములతో గ్రంథ మంతయు నున్నను పత్రములు చాల భాగము క్రిమిదష్ట మైనవి. చివరి కొన్ని పత్రములలోని పద్యములు అక్షరములు నశించి అసంపూర్ణములుగ నున్నవి. ప్రతి నలుపు దిరిగినది. లిపి సులభగ్రాహ్యము కాదు. అక్షర దోషములును స్వల్పముగ గలవు. ప్రతి శిథిలావస్థలో నున్నది.

# పాండవ విజయము

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 2314 | కాల్ నెం | : టి3-186 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము | పత్రములు | : 90 |
| ప్రతి పరిమాణం | : 40×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 5 |

**విశేషాంశములు :**

ఈ పాండవ విజయము అను ద్విపద కావ్యకర్త ఎవరో తెలియదు. ఈ ప్రతియందు కావ్యారంభము గలదు. కాని కవి పేరులేదు. కావ్యాంత మిందు లేదు. పాండవులు యక్షనాథునితో యుద్ధముచేసి జయమందుట, ముఖ్యవస్తువు. కౌరవులను జయించి రాజ్య లాభమును పొందుట మున్నగు విషయములు క్లుప్తముగా చెప్పబడినవి. ఇది ద్విపదకావ్యము. సులభ శైలి యందున్నది.

ఈ ప్రతియందు తుదిభాగము కొలదిగా మాత్రము నష్టమై యుండవచ్చును. ఇది క్రిమి దష్టమై యున్నది. మిక్కిలి శిథిలావస్థలో నున్నది. కొన్ని పత్రములు పూర్తిగా లేక తునుకలు మాత్ర మున్నవి. ఇది అసమగ్ర ప్రతి.

"ముంగరశానసుకవి పదపద్మములు చాల ప్రస్తుతిచేసి" అని యుండుటచే, ఈ గ్రంథ కర్త ముంగరశాన సుకవి శిష్యుడై యుండవచ్చును.

# పాండురంగ మాహాత్మ్యము

## తెనాలి రామకృష్ణకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 588 | కాల్ నెం | : టి3-100 |
| ప్రతి | : తాళపత్రము;సమగ్రము | పత్రములు | : 70 |
| ప్రతిపరిమాణం | : 48×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 8 నుండి 9 |

ప్రారంభము :

శ్రీకాంతామణి గన్నొరంగి మది ధాత్రిన్ నించినం, దద్రుచి
శ్రీకాదంబిని మీద కుబ్బె ననగా శ్రీవత్సముం దాల్చి ము
ల్లోకంబుల్ బొదలించు గృష్ణుడు దయాళుం డేలు.... ష్ణవ
స్వీకారార్ఘ్య విరూరి పట్టణపతిన్ వేదాద్రి మం....రున్.

సీ. అవతార మొందె నే యఖిలైక జనయిత్రి కలశ రత్నాకర గర్భసీమ
తోబుట్టు వయ్యె నే తులిత కాంచనవర్ణ వె....వెన్నెలగాయు వేల్పునకును
పాయక....డు....పరమ పావన....త్రి చక్రి బాహామధ్య....ధవీథి
యభిషేక మాడు నే యభివర్ణి తాచార దిగ్గజా....త మే తేటనీట

తే. నవ నిధానంబు లే దేవి....వణి సరకు లమ్మహాదేవి శ్రీదే ....
సరస శుభ దృష్టి రామానుజయ్య సుతుని నాదరించు విరూరి వేదాద్రి నాథు.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా కావింప బూనిన పౌండరీక మాహాత్మ్యంబునకు కథావిధానం బెట్టిదనన.

వ. తులితోక్ష ధ్వజసూతుడై వెలయు సూతుం గాంచి మున్ శౌనకా
దులు క్షేత్రంబును వేల్పు దీర్థము బుధ .... త్య ప్రభావంబులై
దశితై....మిరంబులై యిహపరార్థప్రాప్తి మూలంబులై
యిలపై .... క్కెడ గల్గెనే ననఘమూర్తీ తెల్పవే నావుడున్.

వ. మహాత్ములారా యి....రావృత్తంబు....రా....తంబుగా....త్తమ శ్లోకుండగు శ్రీకృష్ణ ద్వైపాయను వ....నము....రిందినదిగల దఖిలంబును మీ యంతరంగంబులకు వచ్చు నట్లుగా విన్నవిం....ండని సూతుం డిట్లనియె.

శా. శీతాహార్య సు....లనీ వికచ రాజీవం....శ్వర
....తిర్లింగ విశుద్ధరత్న ....ని మోక్షోపాయముక్తాబ్ధి వై
లాతీరావని దుండి....మన గజాలానంబు గంగామృత
స్రోతోనిస్స్వ....గోర య.... గాశి శ్రీరాశియై.

ముగింపు :

క. అని పౌనఃపున్యంబుగ వనజాసన సూతి మ్రొక్కి వలగొని హరి పీ
ఠ్మ్రొని పౌండరీకమునకుం జని భైమిం దీర్థ మాడి చక్రి భజంచెన్.

క. భజియించి త....సాద వ్యజనానిల శమితతాపుడై యిప్పుడు న
బ్జజసూతి దక్షిణ ద్వా రజగతి నున్నాడు సుస్థిర ప్రమదమునన్.

క. అని కథకుడు శౌనక ముఖ మునులకు హరి దివ్య చరితములు దురిత తమో
దినకర కిరణాయితములు వినుపించె గళాకులేశా వేదాద్రీశా

గద్య :

ఇది శ్రీమత్పరమపదనాథ నిరవధిక కృపా పరిపాక పరిచిత సరస కవినాథ ప్రణీతంబైన పాండురంగమాహాత్మ్యంబునందు పంచమాశ్వాసము సంపూర్ణము.

విశేషాంశములు :

రాజా శ్రీరాజారామ భూపాల రాయణివారు వ్రాయించిన ఈ పాండురంగ మహాత్మ్యం యొక్క ఈ ప్రతి కారయుక్తి నామ సంవత్సర మాఘ శుద్ధ ౧౪ నాడు పూర్తి చేయబడినది. దీనిని సురపురం బాకాని రమణయ్య వ్రాసిరి. ఈ కావ్యమును తెనాలి రామకృష్ణకవి విరూరి వేదాద్రి మంత్రికి అంకిత మిచ్చెను.

ఇందు పుండరీక చరిత్రముతోపాటు అనేక పరమ భాగవతుల ఉపాఖ్యానములు గలవు. ఈ ప్రతియందు ఐదు ఆశ్వాసములు సంపూర్ణముగ నున్నవి. కాని ప్రతి చాల భాగము క్రిమిదష్టమై గ్రంథము మిగుల శిథిలావస్థ యందున్నది. లిపి దోషములు కొలదిగా గలవు. ప్రతి యంతయు నలుపు దిరిగినది.

# పారిజాతాపహరణము

## నంది తిమ్మన

ఆక్సేషన్ నెం : 3971 కాల్‌నెం : బి 3-254

ప్రతి : తాళపత్రము; సమగ్రము. పత్రములు : 38

ప్రతిపరిమాణము : 37.5×3.5 సెం. మీ. పత్రపంక్తులు : 8 నుండి 9

ప్రారంభము :

శ్రీమదికిం బ్రియం బెసగ జేర్చిన యుయ్యేల లీల వైజయం
తీ మహితాచ్ఛ కౌస్తుభము నిచ్చపుకాంతి దనర్చి యాత్మ వ
క్షోమణి వేదిఁ బొల్పెసగ జూడ్కుల పండువు సేయు వేంకట
స్వామి గృతార్థు జేయు నరసక్షితినాథుని కృష్ణరాయనిన్ ॥

మ. వొలతు ల్కౌఁగిట గ్రుచ్చి యెత్తి తలఁబ్రాల్ బోయించు నవ్వేళ నౌ
దల గంగం తననీడ దాన కని మౌగ్ధ్యం బొప్ప వేరొక్క తొ
య్యలి యంచు న్మది నెంచు పార్వతి యసూయావ్యాప్తికిన్ నవ్వు క్రొ
న్నెల పూదాలుపు కృష్ణరాయనికి సంధించు న్మహైశ్వర్యముల్.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన పారిజాతాపహరణం బను
మహాప్రబంధంబునకు కథా క్రమం బెట్టిదనిన.

క. జనమేజయ జనవల్లభు డనుదినమును హరికథా సుధాస్వాదమునం
దనివి సనక వైశంపాయనముని కిట్లనియె గౌతుకాయత్తమతిన్.

సీ. హరివంశ కథ లెల్ల నానుపూర్విగ నిటు విని కృతార్థుడ నైతి మునివరేణ్య
యా దానవారాతి యమరుల ప్రోవంగబూని యా యదువంశమున జనించి
యతడు గ్రమ్మర వారి కాధార మగు పారిజాతంబు పుడమి కే రీతి దెచ్చె
ననుమతి నిచ్చిరో యా వేల్పు లొండేని బలిమి చేకొనియెనో పాడి దొరగి

తే. తెలియ నానతి యిమ్ము సందియము వీర ఎనగ వేడుక యయ్యె సవిస్తరముగ
ననిన నా వ్యాసముని శిష్యు డతనితోడ నధిప విను మని పలికె నత్యాదరమున.

చ. హరి నరకాసురుం గెలిచి యుద్ధనుజేంద్రుని యింట నున్న య
ప్సరల కొలంబువారి నెలజవ్వనముం బొలివోనివారి ద
న్వరునిగ గోరువారి లలనామణులం బదియారువేపురం
బరిణయ మయ్యె నారదుని పంపున సౌఖ్యర సైక లోలుడై.

తే॥ మరియు రుక్మిణి సత్య జాంబవతి మిత్ర వింద సుదంత భద్ర కాళింది లక్ష్మ
ణ యనగా మున్న కల రష్టనాథునకును మహిషు లెనమంద్రు సమతాభిమానవతులు.

ముగింపు :

సీ. భోజకన్యా సరిద్రాజహంసము సత్య భామా శుకీకేళి పంజరంబు
జాంబవతీ నిశాచంద్రోదయంబు కా ళిందీ సరోజినీం దిందిరంబు
భద్రా కలాపినీ ప్రావృడంబుదము సు దంతార సాల లతాపికంబు
మిత్రవిందావనీ చైత్రాగమము లక్ష ణామహోదయష్టికా నాయకంబు

తే. షోడశ సహస్ర కామినీ స్తోమధేను కా రిరంసామదోత్కట వారణేంద్ర
మనగ సౌఖ్యాంబు నిధి నోలలాడుచుండె కృష్ణు డఖిలావనైక వర్ధిష్ణు డగుచు.

సీ. కౌశిక గోత్ర విఖ్యాతు డాపస్తంబ సూత్రు డార్వేల పవిత్ర కులుడు
నంచి సింగామాత్యునకును దిమ్మాంబకు తనయుండు సకల విద్యా వివేకి
చతురుడు మలయమారుత కవీంద్రునకు మే నల్లుండు కృష్ణరాయ క్షితీశ
కరుణా సమాలబ్ధ ఘనచతురంత యా నమహాగ్రహార సన్మాన యుతుడు

తే. తిమ్మయార్యుండు శివపరాధీన మతి య ఘోరశివగురు శిష్యుండు పారిజాత
హరణ మను కావ్య మొనరించె నంధ్ర భాష నా దివాకర తారాసుధాకరముగ.

శా. ఏకచ్ఛత్రిత సర్వభూతల నృసింహేంద్ర క్షమాభృత్తపః
పాకద్యోతిత రూపమౌక్తిక తులాభార ప్రదానోన్నతా
శోకస్తన్య సమాస్రుసన్నిభ హరిత్కూలంకషోద్యద్యశః
శ్రీకర్ణాట మహేశవైరికరిరాట్సింహ ప్రతాపోదయా.

క. భువన విజయాఖ్య సంస న్నవరత్న విభాప్రభాత నలినాప్త రమా
ధవచరణ కమల సేవా ప్రవణమతీ! వీరరుద్ర పర్వతవజ్రీ.

మంగళమహాశ్రీవృత్తము :

చిత్తజభిదంఘ్రి యుగ చింతన కళాధిగత జిష్ణు సమవైభవ విశేషా
విత్త రమణామరగవీ తరణి భూ జలద విశ్రుత కరాంబురుహ గోష్ఠీ
నృత్త మణిరంగ తలనీతి మనురాజ నిభ నిర్భర దయారస పయోధీ
మత్తగజ యూధ మదమగ్న సుఖితాళి రవమాన్య గృహ మంగళమహాశ్రీ।

గద్య :

ఇది శ్రీమదుమామహేశ్వర వరప్రసాదలబ్ధ సారస్వతాభినంది నందిసింగయామాత్యపుత్ర కౌశికగోత్ర పవిత్ర సుజన విధేయ తిమ్మయ నామధేయ ప్రణీతంబైన పారిజాతాప హరణం బను మహాప్రబంధంబునందు సర్వంబు బంచమాశ్వాసము సంపూర్ణము.

విశేషాంశములు :

ప్రతి విలేఖనము: ధాత నామసంవత్సర ఆషాఢ బహుళ ౨ గురువారం దివమందు మూడుయామాల వరకు ప్రతిలో వున్న ప్రకారం వ్రాసినాను. పంతులు వెంకయ్య స్వహస్తం వ్రాలు.

ప్రతి చక్కనిది. వ్రాత స్పష్టము. ౬ ఆశ్వాసములు గలవు. కృతిపతి శ్రీకృష్ణదేవ రాయలు.

# పారిజాతాపహరణము

## నంది తిమ్మన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3652 | కాల్ నెం | : టి 3-234 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పుటలు | : 79 |
| ప్రతి పరిమాణము | : 29×3.5 సెం. మీ. | పుట పంక్తులు | : 6 నుండి 7 |

**విశేషాంశములు :**

ప్రతి విలేఖనము: దుర్ముఖి నామ సంవత్సర చైత్ర శుద్ధ ౧౪ గురువారం సరికి పారిజాతాపహరణం అయిదు ఆశ్వాసములున్ను ఆమిరెపు ఆచ్చి రాజు కుమారుడు అప్పరాజు దండెహరాజు వెంకట నర్సన్న గారి ప్రతినున్న క్రమాన వ్రాసు కొనెను.

గ్రంథము క్రిమిదష్టమై అచ్చటచ్చట శైథిల్య మందినది. వ్రాత బాగున్నది. వ్రాత తప్పులు గలవు.

# పారిజాతాపహరణము

## నంది తిమ్మన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3292 | కాల్ నెం | : టి 3-108 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 61 |
| ప్రతి పరిమాణము | : 41×3 సెం.మీ. | పత్రపంక్తులు | : 5 నుండి 6 |

**విశేషాంశములు :**

ప్రతి విలేఖనము: సాధారణ నామ సంవత్సర ఫాల్గుణ బహుళ సప్తమీ జయవారం పగలు ఝాము ప్రొద్దు అయేసరికి తెన్నేటి జగ్గన్నగారు వ్రాసుకొన్న ప్రతి నున్న ప్రమాణను ఆచంద్రార్కంగా చదువుకో గలందులకు శ్రీకృష్ణార్పణంగా పోతుల పొత్తి నాయుడు కుమార్డు పెదరాబినాయుడు వ్రాసు కొనెను.

ఈ ప్రతిలోని లిపి చక్కగా స్పష్టముగా నున్నది. ఇందు ౯ ఆశ్వాసములు పూర్తిగా నున్నవి. పత్రముల పైభాగములు కొలదిగా శిథిల మగుటచే కొన్నిట ఒక్కొక్క పంక్తి లుప్త మైనది. అటనట అక్షర దోషములు గలవు.

# పురుషోత్తమ మాహాత్మ్యము

## నరసింహదేశికు ననుజుడు

| | | | |
|---|---|---|---|
| అక్సేషన్ నెం | : 5841 | కాల్ నెం | : ఔ 3-223 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము, | పత్రములు | : 31 |
| ప్రతిపరిమాణము | : 43 × 5.4 సెం.మీ | పత్రపంక్తులు | : 6 |

ప్రారంభము :

శ్రీముఖచంద్ర చంద్రికలచే వికసించుట నీల నీరజ
స్తోమ మనన్ దనర్చు తనసుందర దృగ్గళ నిర్గళ త్కృపా
భూమ మధు ప్రవాహమున భూమి జనావళి బ్రోచు మామక
స్వామి నుదార శేషగిరి శౌరిని వారనిభక్తి గొల్చెదన్.

చ॥ ఉరమను రత్నపీఠమున నుంచి చలద్వన మాలికా సుధా
ఝరమున పాద్య మిచ్చి వరుసన్ దళనచ్ఛద భుక్తి బెట్టి భా
స్వరతర కౌస్తుభం బను నివాళి యొసంగి ప్రసాద కాంక్షియై
హరి బరదేవతం బలె యుపాసన సేయు సిరిన్ స్మరించెదన్.

వ॥ అభ్యుదయ పరంపరాభి వృద్ధిగా నా యొనర్పం బూనిన శ్రీపురుషోత్తమ మహాత్మ్యం బను మహాకావ్యంబునకు కథా క్రమం బెట్టి దనిన.

మ॥ మును దీర్ఘాయత నాదికీర్తనములం బుణ్యం.. నుత్కృష్ట పా
వన ముర్విం బురుషోత్తమాఖ్య మగు దివ్యక్షేత్ర మచ్చోట మో
క్ష నిదానం బగు దారుశౌరి యది బ్రస్తావింపగా వింటి మా
ఘన వృత్తాంతము దెల్పు మంచు ముని రేబల్ జైమినిన్ వేడినన్.

ముగింపు :

చ॥ హరిని రమింప తద్భవ భుజాంతర కాంతుల నిత్యవాత్రి యై
బరగు .... వరాంగన నివాసము నం దెపు డుండు కౌస్తుభ
స్ఫురిత శుభ్రప్రదీపమున బుట్టి యథాస్థిత మైన చాయ నా
పురుషవరేణ్య రోచు లటపొల్పు వహించు కృశోదరంబునన్.

చ॥ అల నిలయంబునం దుదర మందు వసించి యనంతరంబ యా
విలగతి నాభిరంధ్రమున వెల్వడి యచ్చటిదాత గాంచి శ్యం
బలమణి జాల రంభ మెసగంగ ప్రదక్షిణ యేగి చుక్క చా
లలమెనొ విష్ణుపాద మన ..ప్రపదీన సరంబుపా....

విశేషాంశములు :

ఈ పురుషోత్తమ మాహాత్మ్యమునకు జగన్నాథ మహాత్మ్యమను నామాంతరము కలదు. ఈ ప్రతియందు కవి నామము స్పష్టముగ తెలియలేదు. కాని యితడు చెప్పిన వంశ క్రమమున తాను నరసింహదేశికు ననుజుడ నని యున్నది. ఇందలి మూడవ పత్రము సగభాగము పోవుటచే కవినామ మందుండి యుండ వచ్చును. ఇందు 31 పత్రములు గలవు. గ్రంథాంతము లేదు. పురుషోత్తమ క్షేత్రమాహాత్మ్యము దారుశౌరి ప్రస్తావనము నిందలి కథాంశములు.

# ప్రబోధ చంద్రోదయము

## నంది మల్లయ - ఘంట సింగయ

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : | 804 | కాల్ నెం | : | టి 3-19 |
| ప్రతి | : | తాళపత్రము;సమగ్రము. | పుటలు | : | 36 |
| ప్రతిపరిమాణము | : | 45×4 సెం.మీ. | పత్రపంక్తులు | : | 8 |

ప్రారంభము:

శ్రీ నిత్యంబుగ నిచ్చు నీ హరి విరించి స్తంబ పర్యంత మీ
నానా జీవులలోన రత్నములలోనన్ సూత్రమున్ బోలె దా

లీనుండయ్యు జగత్కారుండన నిచోళీ భావముం
.... నంద్వైకమయుండు శంకరు డనంతామాత్యు గంగయ్యకున్.

శా. సాంగత్యంబున బొందు మూడు గుణముల్ వ్యక్త త్రివర్గేక్షణా
పాంగంబై జగదంబ గొంత నటియింపన్ జేయు మాత్రంబునన్
మాంగల్యైక నివాసమైన మహిమన్ వర్తించు నా శంభు వా
మాంగ స్థాయిని నిచ్చు వైభవ మనంతాధీశు గంగయ్యకున్॥.

సీ. ఛాయ పదము తుండ సంచిత భోగితా రకములు కరశీకర వ్రజంబు
వితత శబ్దంబు బృంహిత మాశ్రితా నిలం బాలోల కర్ణతాళానిలంబు
సాంధ్య రాగము శిరస్సాంద్ర సిందూరంబు జాహ్నవీ పూరంబు జన్నిదంబు
ఘనములు గండ భృంగము లర్కవిధు బింబ ములు పాణి ఫలపూర మోదకములు
గాగ ప్రత్యక్షమైన యాకాశ తత్వ మూర్తి విఘ్నేశ్వరుండు త్రిమూర్తి సుతుడు
కరుణ తోడ ననంతయ గంగమంత్రి శేఖరుని కోర్కె సఫలంబు సేయుగాత॥.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధి యగు నట్టుగా నా యొనర్పం బూనిన ప్రబోధ చంద్రో
దయం బను మహా కావ్యంబునకు కథా సూత్రం బెట్టి దనిన-

పరమేశ్వరుం డగు మహారాజునకు మాయాదేవివలన, మనస్సను కుమారుండు జని
యించుటయును, నతండు ప్రవృత్తి నివృత్తులను రాణి వాసంబుల వలన గ్రమంబున
మోహాదులను, వివేకాదులనుం గనుటయు, ప్రవృత్తి సంతతికి నగ్రగణ్యుండైన
మోహబుండు తానె జగంబు లేలెదనని దలంచి మిథ్యా దృష్టి దేవిగా, నధర్ముండు
మంత్రిగా, యోగోపసర్గంబులు సహచరులుగా, మనో జ్యేష్ఠ పుత్రుండైన యహంకారుండు
తనకు ప్రాణపదంబుగా, తనపుత్రుండు లోభుండును, తత్పత్ని తృష్ణయు, వారల
తమ్ముండు దంభుండు, అతని తనూజుండు దుష్టుండును, ననుచరులుగా రతిపతియైన
కాముండును, హింసానాయకుండైన క్రోధుండును, మద మాన మత్సరులు మన్నీలుగా,
మహాభైరవి సహకారిణిగా, కామసఖుండైన యధర్ముండును, కాపాలికులైన చార్వాకాది
పాషండులు దండగా, దుర్గుణాలు వేగులవారుగా, నడ్డకట్టుటం జూచి ....

క. ఇది గలిగె ననుచు నుబ్బక యిది లేదని సిగ్గు పడక యెప్పుడు సమతం
బొదలిన సౌఖ్యామృత సం పద లబ్బును విష్ణుభక్తి మహిమను కతనన్॥.

వ. అని యిట్లు పురుషుండు విద్యా ప్రబోధ చంద్రోదయంబున నైన బరమానందం బొందు నవసరంబున విష్ణుభక్తి మహాదేవి చనుదెంచి యింతగాలంబునకు నా మనోరథంబు సంపూర్ణం బయ్యె: మంచు సంహరించి ప్రతాపించు సంసారాశనింబోలె, మహామోహ సమాగత వ్యూహంబుల విదలించి విజృంభించు నిన్ను నవలోకించ గలిగె ననిన పురుషుండు, దేవీ భవత్ప్రసాదంబుగనగల వారికి నసాధ్యంబు గలదె యని పాదముల కెరగిన కరుణాకటాక్షంబుల నాదరించి, సుజ్ఞాన సింహాసనంబున నునిచి పరిపూర్ణ చంద్రమండల కలశ పరమామృతంబున నభిషేకించి పట్టంబు గట్టిన నతండు కృత కృత్యుండగు వివేకుండ మంత్రిగా నిరతిశయ సదానంద సామ్రాజ్యం బేలుచుండె. సకల వేదార్థ సాధనంబైన ప్రబోధ చంద్రోదయం బను మహాకావ్యంబు వినిన చదివిన వ్రాసిన నభిమతార్థంబులు సిద్ధించు. నీ కృతియున్న భూమి చిదానంద సౌభాగ్యకారిణి యగు. నిది పరిశీలించిన జనులకు నఖండ పూర్ణ జ్ఞానంబు సిద్ధించు.

మంగళమహాశ్రీ

శ్రీరమణ శీతకరశేఖర సరోజభవ సేవిత స్వరస్వర రహస్యో
దార వివిధోపనిషదర్థ మహిమైక నిలయ ప్రీతి నిర్మల చరిత్రో
దార శిబి కర్ణ విబుధ క్షితిజ ఖేచరవదాన్యగుణ జైత్ర ఘనదార
స్ఫార శిబికా ధవళచామర తురంగ కరి సంఘయుత మంగళ మహాశ్రీ.
... (తాళపత్ర ప్రతిలో ఇది 'ఉయ్యగాహి'గా పేర్కొనబడినది)

గద్య:
ఇది శ్రీమదుమా మహేశ్వర వరప్రసాదలబ్ధ సారసారస్వతాభినంది నంది సింగయామాత్యపుత్ర మల్లయ మనీషి తల్లజ మలయ మారుతాభిదాన ఘంటా నాగయ ప్రధాన తనయ సింగయ కవిపుంగవ ప్రణీతం బైన ప్రబోధ చంద్రోదయంబను మహాకావ్యంబు నందు సర్వంబును పంచమాశ్వాసము.

విశేషాంశములు:

ప్రతి విలేఖనము:

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ ప్రవర్థమాన శాలివాహనశక వర్షంబులు 1673 చాంద్రమానేన అగునేటి ప్రజోత్పత్తి నామ సంవత్సర జ్యేష్ఠ బ 10 లు శ్రీ మతు యిటికెపాటి కరణం వాబయ్యగారి ప్రతి జూచి పెదమత్తివిటి అగసాల తమ్మణ్ణ కొమారుడు అయ్యన్న తన స్వతాకు వ్రాసుకొన్న ప్రబోధ చంద్రోదయం సంపూర్ణం.

ఈ ప్రబోధ చంద్రోదయ మను వేదాంత గ్రంథము అనంతామాత్యుని కోరికపై నంది మల్లయ, ఘంట సింగయలచే తెనిగింప బడినది. ఇందు పరమేశ్వరుడు రాజుగను, మానవ గుణావగుణములనే పాత్రలుగను గావించి, విష్ణుభక్తి చివరకు వివేకవంతుడగు పురుషుని సుజ్ఞాన సింహాసనాధిష్ఠితుని గావించి నట్లున్న కథ గలదు. ఇది అయిదు ఆశ్వాసముల కావ్యము. దీనిని మంత్రికోరికపై అనంతామాత్యునికే కవులు అంకిత మిచ్చిరి.

ఈ ప్రతియందు గ్రంథము ఆద్యంతము గలదు. కాని ప్రతి యొక్క పై క్రింది పంక్తులు నలుపుదిరిగి కన్పించుట లేదు. ఈ ప్రతి కొద్దిగా క్రిమిదష్ట మైనవి. మొత్తముమీద ప్రతి బాగుగానున్నది. ప్రతివిలేఖనమున స్వల్పదోషములున్నవి. లిపి స్పష్టము కాదు.

## ప్రభులింగలీల

### కందుకూరి వీరేశ్వరామాత్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4647 | కాల్ నెం | : ఔ 3-58 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 80 |
| ప్రతి పరిమాణము | : 37.5×4 సెం. మీ | పత్ర పంక్తులు | : 8 |

**ప్రారంభము :**

క. శ్రీగు .... .... లు ఆగమ వేద్యుండు దురిత హారుడు విమలుం
డాగమ వరదుం డనిశము బాగుగ మమ్ముబ్రోచు సత్కృపామతితోడన్.

క. .... .... .... .... కగహరిహరుల వశమె బ్రహ్మకు నైన
న్దల పౌన గూడదు గావున నలినోద్భవ వినుత విఘ్ననాథుని దలతున్.

సీ. గంగాధరుని జూచు కన్నులు కన్నులు గౌరీశు నర్చించు కరము కరము
పార్వతీశు వెదకు పదములు పదములు ఫాలాక్షు దలచేటి భక్తి భక్తి
విజ్ఞాన మాశించు వీనులు వీనులు మదనాంతకు దలంచు మనసు మనసు
శీతాంశుధరు బాడు జిహ్వయు జిహ్వయు శివదేవునకు మ్రొక్కు శిరము శిరము

గురుని వర్ణించు చక్కని గుణము గుణము చంద్రశేఖరు ప్రకటించు చదువు చదువు
.... .... .... ... .... .... .... ....

**ముగింపు :**

వ. అనిన హస్తోదకంబులు వార్చిన బహువిధ సుగంధానులేపన పుష్పకర్పూ .... ....
స యబ్బసవేశ్వరాది భక్తులు పరివేష్టించి కొలువ, కొలువుండి యమ్మహాత్ముండు
యిట్లనియె.

క. బసవా నీ జంగమ వరు లసలారగ మన్నిమిత్త మాకలి గొన్నన్
నె .... .... .... తతోవచ్చి బసవరాయుడు వేడ్కన్

వ. అమ్మహాత్ములు బసవన్న కిట్లనిరి

చ. విను బసవయ్య నిర్మల పవిత్ర చరిత్ర మహాత్మ నీ గృహం
బునను సదానుసౌఖ్య పరిపూర్ణముగా .... ....
స్నను కడుతృప్తిగాంచితిమి .... గతిన్ దగ షడ్రసోక్తభో
జనమున దెన్ప వాసనల .... .... లయ్యె నదేమి చిత్రమో.

**విశేషాంశములు :**

ఈ ప్రభులింగలీల యను కావ్యము వీరమాహేశ్వర కరుణా కటాక్ష లబ్ధు డగు కందుకూరి వీరేశ్వరామాత్య ప్రణీతము. ఈ ప్రతియందు అయిదవ ఆశ్వాసము కొంతవరకు గలదు. గ్రంథాది యందును, మధ్య కూడ చాల పత్రములు నష్టమైనవి. గ్రంథాంతము ఇందు లేదు.

ఈ కవి యిష్టదేవతా ప్రార్థనానంతరము ప్రభులింగలీలను ద్విపదలో రచించిన పిడుపర్తి సోమనను కూడ కీర్తించెను. దీనిని మాహేశ్వరున కంకిత మిచ్చెను. కలలోని శివు నాజ్ఞచేతనే దీనిని రచించినట్లు చెప్పుకొనెను.

ఈ ప్రతి యందలి లిపి స్పష్టము. ప్రతి నలుపు దిరుగు చున్నది. కొన్ని పత్రములు శిథిలము లైనవి. ప్రతి క్రిమి దష్టమైనది. ప్రతి విలేఖనమున దోషము లున్నవి.

# ప్రభులింగలీల

## పర్వత వీరభద్రుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 5936 | కాల్ నెం | : జి 3-598 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 361 |
| ప్రతిపరిమాణము | : 4.5 × 3.6 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 లేక 7 |

**ప్రారంభము :**

శా. శ్రీ మద్వేద పురాణ శాస్త్ర వినుతాంఘ్రీ నామ రూప క్రియా
సీమోల్లంఘిత దేవదేవుని విరించి శ్రీశ సూర్యేందు సు
త్రామాద్యాఖిలదేవ సన్నుని గణారాధ్యు న్మహాదేవునిన్
వ్యోమాకారు గుహేశ్వరున్ శివు పరంజ్యోతిన్ ప్రశంసించెదన్.

సీ. తనచూడ్కి నఖిలవర్తనలెల్ల నడవంగ ననలార్కచంద్రులై యమరుచుండ
తనతనూరుచి యష్టతనువులకెల్లను నాదిమరూపమై తేజరిల్ల
తనదక్షిణాగల్పతరజన్ముడై బ్రహ్మ కలయ జగత్సృష్టికర్త గాక
తనశక్తి లేశమాత్రమున సంభూతుడై హరి విశ్వరక్షకుడై వెలుంగ

ఆ. వె. విశ్వమూర్తి యనగ విశ్వాధికుం డన విశ్వనాథు డనగ వెలయుచున్న
యట్టి దేవదేవు నగ్గుహేశ్వరు పర బ్రహ్మ నీశ్వరేశు భక్తి గొలుతు.
.... ... .... ....

చ. ఒనర మదీయవాక్యము లయోమయముల్ శివభక్తిపుంగవుల్
వినియెడు కర్ణముల్ పరుసవేదులు గావున నట్టి దివ్యభా
వనను సువర్ణవర్ణరుచి వర్ణన కెక్కుట నిశ్చయించి మిం
చిన ప్రభులింగలీల తగబెట్టి దొణంగితి వేడ్కపెంపునన్.

సీ. ఘనమదమత్సరగ్రస్తులై పోరాడి కలన జచ్చిన వారికథలు గావు
ప్రౌఢులు బోక యుబ్బున మత్తచిత్తులై కొదవెడు నుడికార గోష్ఠిగాదు
జననకారణ కర్మ ఘనతమఃపటలంబు సీమ గ్రుమ్మరువారి సేడు గాదు
మానిత విట వీటి మార్గసంగతులు పొం దికలు జెప్పు కవుల తెరగు గాదు

తే. గీ. యిది సదానంద నిర్వాణ హేతుభూత మగుట తెలియంగవలయు నత్యాదరమున
సత్పురాణులు శివతత్వ సారమతులు లింగసాహిత్యు లీ ప్రభులింగలీల.

చ. మనసున నుబ్బుచున్ జదరుమాటల పాటల నేర్పు వీనులన్
విని కడులెస్స లంచు నగి వేడ్కలబోయెడు లాగుగాదు ము
న్ను నియతిభక్తితో తనుమనోధనముల్ శివు గూర్పనోపు నా
ఘనులు మహానుభావు లెరుగంబడు నీ ప్రభులింగలీలయున్.

ముగింపు :

చ. అమిత మదంగమందు భవదంశము నందగ నుద్భవించి ధా
త్రి మెరయ వీరశైవమున దేవగణంబులు దేవకన్య ల
ల్లమకృప నామ రూప క్రియలం దెడవాసి విశుద్ధబుద్ధిమై
సమధిక సంతతైక సుఖ శాశ్వత సుస్థితులైరి పార్వతీ.

వ. అని యానతిచ్చిన నమ్మహాదేవి దేవా భక్తులకు నిట్టి విశేష పదంబు అల్లమప్రభుం డుపదే
శించెగదా యని సంతోషించి వెండియు నిట్లనియె.

చ. అనఘ చరిత్ర మున్ను దగ నానతి యిచ్చితి వట్లతప్ప దిం
దెనయగ నల్లమప్రభుని నిప్పు డెరింగితి నేను వాడు ముం
దనుపము డమ్మహామహిము డాతడె నీదు నిజస్వరూప మా
తని కిదియేమి చోద్యము సదాశివదేవ మదీయవల్లభా.

క. అని చతుర వచన రచనల పనిబడి యప్పార్వతియును పరమేశ్వరుడున్
గొనియాడి రల్లమప్రభు ఘనమహిమయు సరసగోష్ఠి కౌతుకలీలన్.

**గద్యః** :

ఇది సద్గురుశివదేవలింగ శ్రీపాదపద్మారాధక శివజ్ఞానప్రబోధక పర్వతవీరభద్ర ప్రణీతంబైన ప్రభులింగలీల యను మహాప్రబంధంబునందు శ్రీబసవేశ్వరుండు యోగ మాహాత్మ్యంబున శూన్యసింహాసనంబు నిర్మించుటయును........పార్వతీదేవికి వీరశైవ మాహాత్మ్యంబు కృపసేయుటయునుం జెప్పెననుట యది పంచమాశ్వాసము సంపూర్ణము.

**విశేషాంశములు** :

ఈ ప్రతి మంచిస్థితియం దున్నది. వ్రాత చక్కనిది. తప్పు లంతగా లేవు. ప్రతిలో వ్రాయసగాని పేరుగాని ప్రతి వ్రాసిన సంవత్సరముగాని వ్రాయబడలేదు.

# ప్రభులింగలీల

## పర్వత వీరభద్రుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : ౬౦౮ | కాల్ నెం | : టి ౩-౧౨౬ |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : ౪౯ |
| ప్రతిపరిమాణము | : ౩౨×౩.౬ సెం. మీ. | పత్రపంక్తులు | : ౬ |

**విశేషాంశములు** :

ఈ కవి మల్లికార్జున వరప్రసాదకవితా లబ్ధుడ నని చెప్పుకొనెను. పరమేశ్వరాను మతంబుననే తా నీ గ్రంథము వ్రాసినట్లు కావ్యాదిని తెలిపెను.

ఈ ప్రతియందు ఆదిలో రెండు పత్రములు లేవు. కావ్యాంతము గూడ లేదు. ఉన్నంత వరకు గ్రంథము క్రమముగ నున్నది. ప్రతిలోని కొన్ని పత్రములు మిక్కిలి నలుపు దిరుగుటచేతను కొంతభాగము శిథిల మగుటచేతను కొన్ని అక్షరములు కానవచ్చుటలేదు. భాషాదోషములు కలవు. లిపి అంత స్పష్టముగా లేదు.

# ప్రభులింగలీల

## పిడుపర్తి సోమన

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 3972 | కాల్ నెం | : టి 3-258 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 98 |
| ప్రతిపరిమాణము | : 41×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 నుండి 8 |

ప్రారంభము :

శ్రీ వీరశైవ ప్రసిద్ధసిద్ధాంత   కోవిద నుత పాలకురికి సోమేశ
బసవపురాణాది భవ్యకావ్యములు   నసమానభక్తమాహాత్మ్యంబు దెలిపి
ధారుణి శివభక్తి దగ నిల్పినట్టి   సారవీరాచార శరణార్థి మీకు
శ్రీ నిర్మలజ్ఞాన శివభక్తి యుక్తి   మానిత వేదాగమ పురాణవినుత
సకల భక్తానీక సన్నుతచరణ   నికళంక నిర్మల నిత్యస్వరూప
శ్రీమద్గుణస్తోమ శివపదప్రేమ   సామాదివేద సంస్తవనీయనామ
నామరూపక్రియా నటనాభిరామ   జీమూత మధ్యస్థ చిత్కళావ్యోమ

0 0 0 0

యంత్రవాహకుడైన యల్లమచేతి   జంత్రంబుగా దన్ను సమ్మతి దలచి
బడప నయ్యెను మహాప్రభులింగలీల   కడగితి చెప్ప నా ఘనగురు పేర
సిద్ధవీరేశ్వర శ్రీగురు స్వామి   యిద్ధక్రమంబుగతి యెట్టిదయనిన
వేద శాస్త్రంబులు వెదుకంగలేక   నాది మధ్యాంతంబు లరయంగలేక
నాదబిందువుల కందగ సందులేక   నేదియు ననలేక నింతయునైన
శ్రీమహాదేవుండు శివుడు చిన్మయుడు   నామరూపాది నిర్ణయ రహితుండు
నిర్గుణతత్త్వంబు నిర్మలమూర్తి   సర్గ సంసార సంసర్గ వర్జితుడు
ప్రమథగణంబుల బ్రహ్మాది సురల   యమరమునీంద్రుల యంతరంగముల
అజ్ఞాన మెడలింప ననుకంప బుట్టి   సుజ్ఞానముద్రయు సురుచిరాకృతియు
పుస్తకంబును సుధా పూర్ణకుంభంబు   మస్తకంబున చంద్రమాశ్మకలంబు

ముగింపు :

దండప్రణామంబు దగనాచరింపె ఖండేందుధరు డెత్తి కౌగిట జేర్చ
మాయ గెల్చిన నాటి మాత్సర్య ముడిగి మాయల్లమప్ర .... ....
.... .... .... .... యను గల్గెగా యని యుమయు
శూలియు నుంపిరి సుఖకేలి దేలి కైలాస శిఖరిని కడ నల్లమయును
బాలురు వృద్ధులు ప్రౌఢలు భూమి పాలుర బేదల బలయు ....
.... .... .... ఖులసల్య పొలురు గోపుల బ్రాహ్మణోత్తముల
నఖిల జంతువులను నతి కృపా దృష్టి సుఖమున నుండంగ జూచుచునుండె
యిరువదేనవగతి .... .... తమీశుడు గిరిజకు నానతిచ్చె
సదమల పదవేది చామరుసాది పదములు వెయినూటపదనకొండింట
ప్రభులింగలీల యిర్వదియేను గతుల నఖినవ .... .... .... తెనుంగునను
పిడుపర్తి సోమనాభిధుడ జెప్పితిని పుడమి భక్తుల కర్థములు తేటపడగ
నీకృతి జదివిన నీకృతి వినిన నీకృతి వ్రాసిన నిష్టార్థ సిద్ధు
లరలేక గృపనిచ్చు నల్ల .... ధరణిలో నా చంద్రతారార్కముగను
పంచభూత వికార పరిహారలోల పంచాక్షరీ మంత్ర పఠనైకశీల
పంచేంద్రియాతీత భావనా పాత్ర పంచముద్రాంచిత పురిపూ ....
శ్రీమద్గుణోత్సంగ చిన్మయాపాంగ రామలింగయ మనోరాజీవ భృంగ

గద్య :

ఇది పాలకురికి సోమేశప్రసాద విదితాష్టభాషా కవిత్వ ప్రవీణ భామిత్ర పిడుపర్తి బస వేశ పుత్ర సోమయ దేవాఖ్యసుకవీంద్రముఖ్య ప్రణీతమై భాసిల్లు ప్రభులింగలీల ననుపమంబుగ పంచమాశ్వాసమయ్యె.

విశేషాంశములు :

ప్రతి విలేఖనము :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౭౩౫ పదిహేడునూటయాభై అయిదు అస్మిన్ప్రవర్తమాన వ్యవహారిక చాంద్రమాన విజయవత్సర కార్తీక శుద్ధ సప్తమి సోమవారం వరకు శ్రీ ప్రభులింగలీల చందిప్పమఠం గురు బసవప్ప మఠం కంకల్లుగారు వ్రాసి మొగిలి గిద్దెలో ఆకుల నాగన్నకు .... .... సోమన్న పుత్ర పౌత్ర పారం పర్యంగా చదువుకొని శ్రీ ప్రభువుస్వామి కృపకు పాత్రులై అష్టైశ్వర్య సంవృద్ధి కల్గి వర్ధిల్లేకొరకు వ్రాసి యిచ్చిన ప్రభులింగలీల సంపూర్ణము.

ఈ ప్రతి యందు ౬ ఆశ్వాసములు పూర్తిగా గలవు. ఇందలి పత్రములు పాతబడి నలుపు దిరిగినవి. ఒక పార్శ్వ మంతయు ఈ ప్రతిలో శిథిలమై యున్నది. లిపి స్పష్టము. అక్షరదోషములు లేవు. విషయ నష్టము జరుగుటచే నిది అసమగ్ర ప్రతియే.

# ప్రభులింగలీల

## పిడుపర్తి సోమన

| ఆక్సెషన్ నెం | : 4059 | కాల్ నెం | : ౦౩-298 |
|---|---|---|---|
| ప్రతి | : కాగితము; అసమగ్రము. | పత్రములు | : 123 |
| ప్రతిపరిమాణము | : 21×18 సెం. మీ. | పత్రపంక్తులు | : 26 |

ప్రారంభము :

విశేషాంశములు :

ఈ కావ్య మైదాశ్వాసముల గ్రంథము. ఈ కవి తాను పాలకురికి సోమన ప్రసాద విదితాష్టభాషాకవిత్వప్రవీణుడ నని తెల్పుకొనెను. ఇందు ఇరువదియైదు గతులుగా శివభక్త చరిత్రములు గలవు.

ఈ ప్రతియందు ప్రారంభము లేదు. మధ్య పుటలు కొన్ని క్రిమిదష్టమై కొంత విషయము నష్టమైనది.

ఈ ప్రతియందలి లిపి కొంత స్పష్టముగనున్నది. కాని ప్రతివిలేఖనమున మాత్రము చాల దోషములు కలవు.

# బసవచరిత్ర

## పండితారాధ్య చరిత్రాంతర్గతము

## పాల్కురికి సోమనాథుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషను నెం | : 117 | కాల్ నెం | : బి 3-11 |
| ప్రతి | : కాగితము : అసమగ్రము. | పత్రములు : | 99 |
| ప్రతి పరిమాణము | : 33×20.5 సెం.మీ. | పత్రపంక్తులు : | 22 |

ప్రారంభము :

శ్రీగురుమూర్తి నూర్జిత పుణ్యకీర్తి నాగభూషణస్ఫూర్తి నానందపూర్తి
వృషభస్వరూపు నవిద్యాదురాపు విషమ ప్రలాపు నిర్విషయకలాపు
పరమ కల్యాణ సద్భక్త ధురీణు శరణగణప్రాణు సజ్జనత్రాణు
ప్రమథైక విశ్రాము భక్తలలాము రమణీయ గుణధాము గణసార్వభౌము
బసవలింగము కృతిపతి యచే కృతియు రసికత పండితారాధ్యచరిత్ర
మదె పాల్కురికి సోమనార్యుడు సుకవి శాంభవ దీక్షానుజాతానురక్తి
ఉత్తమోత్తముడు సంయుత శివభక్తి వృత్తచిత్తుడు చతుర్వేదార్థవేత్త
గహన సంస్కృత శిరఃఖండనహేతు మహిత పంచాక్షరీ మంత్రసిద్ధుండు

ముగింపు :

కలితాష్టదళ పద్మ కర్ణికామధ్య విలసనుం డగు ప్రాణవిభునంద యనగ
భావితయోగానుభవ భవ్య సుఖము నిపుడంగ శివయోగ నిద్ర బొందండు
బసవన్న యున్న సద్భావంబు జూచి యసలార నాచన్న బసవన్న ప్రమొక్కి
ముద్రితశివయోగ నిద్రాతిసుఖ స ముద్రుండు మద్గురుమూర్తియ కాక
నిద్రబోవగ జడనిద్రావశులకు నిద్రవోయిన యోగనిద్ర చొప్పుడు నె
ఉరుశివయోగ నిద్రాదితవేళ గురుమూర్తి యగును దా గుర్వగుమండ
కడ లుడిగినయట్టి జడనిధిపగిది వడి చలనములేని వాయువుభాతి
అలరంగ నిర్మేఘమై యున్న నభము కరణి నింద్రియముల గజిబిజి బాసి
నన్ను తావిచ్చిన్న సద్భావనమున మిన్నక శివలీల నున్నాడొ మరియు

.... .... .... .... ....

విశేషాంశములు :-

ఈ ప్రతియందు కావ్య ప్రారంభము గలదు గాని ముగింపు లేదు.

ఇందలి లిపి స్పష్టము. ప్రతియు బాగుగానున్నది. కాని అర్థభాగము కూడ లేదు. ప్రతి విలేఖనమున స్వల్ప దోషము లున్నవి.

# బసవవిజయము

## బిజ్జల నిరస

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 714 | కాల్ నెం | : టి 3-95 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము. | పత్రములు | : 121 |
| ప్రతిపరిమాణము | : 29×3.5 సెం. మీ. | పత్రపంక్తులు | : 7 |

ప్రారంభము :

శ్రీగురుమూర్తి ఆశ్రితపుణ్యమూర్తి నాగకుంభంకర్ణు నాగేంద్రవర్ణు
నాగసురహారణు నాగేంద్రభరణు వాగీశసుతచరణు వనజాప్తకిరణు
సన్మునిప్రియదేవు శ్రీశైలదేవు మృణ్మయపరిణతున్ మునిజనాభృత్యు
యోగనిర్మలదక్షు యుగ్రనిటలాక్షు భాగీరథిజూటు బ్రహ్మాండ పీఠు
కైలాస నిజవాసు కల్యాణవేషు శైలేంద్రచాపు సజ్జనదివ్యరూపు
రతిరాజహారణు లక్ష్మీశచరణు జితమదగనసంగు సిద్ధితభస్మాంగు
పారంగహస్తు విస్తారప్రశస్తు తారపటీర తత్తార గోక్షీర
శృంగార నిజవర్ణు సుధదయాపూర్ణు మంగళమూర్తి శ్రీ మల్లికార్జునుని
పాదపద్మములకు ప్రణమిల్లి నిలచి అద్భుతా పండితారాధ్యుల దలచి

ముగింపు :

అనుచు శివదేవుండు అప్రతాపునకు వినుపించె బసవని విఖ్యాత మహిమ
విని సంతసిల్లియు వీరప్రతాప జనవరేణ్యుడు దాను సయ్యన మంత్రి
శివదేవునకు మంచి సిరి మీరినట్టి వివిధాంబరంబులు వివిధవస్తువులు
రూపింప ప్రతాపరుద్రుండు యిచ్చె చేపట్టియుండెను శివదేవు డంత.

ఆశ్వాసాంతము :

ఇది శ్రీమన్మల్లికార్జునయం(ఘ్రి సరసముల దివ్య సౌరభచంచరీక
నార్య సూరంపల్లి నమఃశివాయచరణ ధార్య మనఃపద్మ తత్పదాచార్య
భక్త జంగమలింగ ప్రణీత ప్రసాద సిక్తర్కయన్వయ శీలవ్రతాది
నమిత నల్ల గండ్ల నాగనారాధ్య శ్రీమదాంబ వరలబ్ధ ప్రణుతప్రభావ
బిరుదు బసవవిజయ బిజ్జల నిరస విరచిత ప్రబంధ వేదసారంబు
తరలక చంద్రార్క తారక ధరణి స్థిరమైన కథ తృతీయాశ్వాసమయ్యె.

**విశేషాంశములు :**

ఇందు మూడు ఆశ్వాసములు గలవు. గ్రంథము కొలదిగా క్రిమిదష్టమై యున్నది. లిపి బాగుగా నున్నది. ప్రతివిలేఖన వివరము లిందు మృగ్యము. ద్విపదలో వ్రాయ బడినది. లేఖనదోషము లపరిమితములు. ఆశ్వాసాంతముల వలన కవికి గల "బిజ్జల నిరస" అను బిరుదనామమే తెలియుచున్నది. కవి తన పేరును ఎచ్చటను పేర్కొనక పోవుటచే బిరుద నామమునే గ్రహించుట జరిగినది.

# బసవ విజయము

## బిజ్జల నిరస

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్‌నెం. | : 55385 | కాట్ నెం. | : టి. 3—209 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 44 |
| ప్రతి పరిమాణము | : 30×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 నుండి 9 |

**విశేషాంశములు :**

ప్రతి అంతిగా క్రిమిదష్టమైనది. వ్రాత స్పష్టతలేదు. లేఖన దోషములు కలవు. 44వ నెంబరుగల పత్రముపై ఒకపంక్తియే వ్రాయబడి యున్నది. కర్త పేరు స్పష్టముగా తెలియుటలేదు. ప్రథమాశ్వాస గద్యలో మూడు పాదములు చ్యుతములైనవి. కావ్యాంతము లేదు.




# బసవ విజయము

## గోపతి లింగకవి

అక్సెషన్ నెం : 3816 | కాల్ నెం : టి 3-278

ప్రతి : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు : 57

ప్రతిపరిమాణము : 39 × 4 సెం. మీ. | పత్రపంక్తులు : 6 నుండి 7

ప్రారంభము :

మ. ... .... చున్నతి నిజేచ్ఛానంద సందోహమె
మ్మధికామ్యాభిమతార్థముల్ నొసగుచున్ మన్నింపుచున్ నిత్యసం
పదలన్ దెల్పుచు .... .... ....
.... .... బసవేశు దివ్యమహిమల్ కావ్యల్ ప్రశంసింపగాన్.

మ. నిగమార్థాగమవేద్యమై నిపుణమై నిత్యమ్మమై నిత్యమై
త్రిగుణాతీత నిరంజన ప్రభు మహా .... ....
.... .... త్తయజ రుద్రాబ్జాక్ష సంస్తుత్య నం
దిగణాధీశ మహామహాత్మ్య మును ప్రీతిన్ జెప్ప సంరంభియై.

మత్తకోకిల.

సంగతిన్ గుడిలోపలిన్ ప్రతిశబ్ద మిచ్చు .... ....
.... .... మహేశ్వరు లెప్పుడే
భంగి పల్కిన భంగి బల్కు ప్రబంధ మున్నిది యట్ల యా
సంగతుల్ మము బోటులున్ నిటు సన్నుతింపగ శక్తులే.

వ. అని భక్తి శ్రద్ధా నిబద్ధ పూర్వకంబుగా, ననేక నమస్కారంబు లొనర్చి మజ్జన్మ సాఫల్యంబుగా అభ్యుదయ .... .... దర్పం బూనిన బసవవిజయం బను మహాప్రబంధ ప్రారంభం బెట్టిదనిన.

ఉ. శ్రీకరమై ముని ప్రవర సేవితమై విమలప్రభావ శో
భాకరమై యనం .... .... ప్రభా
నీకమయ ప్రకాశ రమణీయతరోన్నతమై గణాలయం
బై కమనీయమై .... .... చలేంద్రమున్.

వ. నట్టి రౌప్యగిరీంద్రం బెట్టిదనిన.

క. ఇన శత .... .... ...
... ... ట్ల యోజన నిడుపున్
గన నంతియె విస్తారము
ననయము నమితాభిరమ్యమై వెలుగొందున్.

ముగింపు :

వ. బసవేశ్వరుం డరుగుదెంచి తేజోమయ రత్న కాంచన సింహాసనాసీనుండై, యిష్టత్రైల్యౌ
రాచకార్యంబులును, ధర్మప్రసంగంబులును, ధర్మవసం ... బును,
నటి కవి పండిత గాయక బహు వాద్య విద్యావలోకనంబును, నానావిధపదిశీలనంబులును
జేసి, నంతరంగంబున జంగమ లింగార్చనానురక్తిని .... గించి తేచుటయుం
గని, నరేంద్రుం డిట్లనియె.

క. లేచితిరా యన బసవం డా చరలింగార్చనార్థ మరిగెద మనినన్
జూచి యహా బసవేశ్వర యీచందము పక్ష .... జనంగన్.

క. అచ్చటి జంగమసఖ్యము లిచ్చ సుఖోత్సవము లెనసి నిందునయుందున్
నిచ్చటి జంగమసఖ్యము కొచ్చము నర్కాణలోనకుం ....

క. ... గాక శంభుభక్తులు సదయులు రుద్రాక్ష లింగ శాసనధరులన్
మదనారిగాగ జూతురు విదితంబె జంగమముల లెరుగ ...

విశేషాంశములు :

ఈ కవి తాను శ్రీగిరిమల్లికార్జునదేవర వరప్రసాదలబ్ధ కవిత్వము కలవాడ నని తెలుపు
కొనెను. కావ్యముయొక్క ఆద్యంతములు అలభ్యములు. ఇందు ఇష్టదేవతాస్తుతి, శివ
కవీశ్వరస్తుతి, కవియొక్క గురుపరంపర, అతని సంప్రదాయ వర్ణనము, ఈశ్వరుడు

కొలువుదీరుట, ముకుందాదులు శివుని గొల్చుట, నారదాగమనము, బసవజననము ఓరుగంటి వర్ణన మున్నగునవి ప్రథమాశ్వాసమున గలవు. ద్వితీయాశ్వాసమున ప్రతాపరుద్రునకు ధరామరసంఘంబు పాల్కురికి సోమేశ్వరు ప్రసంగంబు దెలుపుట, తర్కమునకు పిలుచుట, విప్రులు రాజుకున కోడుట, శివదేవుడు రాజునకు బసవేశ్వరు లీలామాహాత్మ్యం బెరింగింప నుద్యోగించుట అను సంగతులు గలవు. తృతీయాశ్వాసమున బసవేశ్వర జనన కారణంబును, ధూర్జటివలన తారకాసుర బాధ తొలగుట, పార్వతీపరమేశ్వరుల వివాహము, కుమారుం డెచ్చుట, షడాననుడు దైత్యసంహారము చేయుట మున్నగునవి యున్నవి.

ఈ ప్రతి చతుర్థాశ్వాస ప్రారంభము వరకే గలదు. కావ్యారంభమున పది పత్రములు లేవు. ఇందలి పత్రములు పార్శ్వములందు శిథిలములై సగభాగములే కొన్ని యున్నవి. ఇందలి భాష దోషములతో కూడియున్నది.

# బసవ విజయము

## తుమ్మలపల్లి నాగభూషణకవి

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 3917 | కాల్ నెం | : టి 3-279 |
| ప్రతి | : తాళపత్రము : అసమగ్రము. | పత్రములు | : 80 |
| ప్రతిపరిమాణము | : 39.5×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 6 |

ప్రారంభము :-

ఉ. శ్రీ గురుమూర్తి పాదములు చిత్తములోన దలంచి భక్తితో
నాగమవేద తత్త్వవిధు నగ్రవరేణ్యుడు నివ్వటూరి శ్రీ
భోగ విశేషధీరగుణపూర్ణుడు, నాశ్రిత భక్తవత్సలుం
డీ, గురుమల్లు సంభజన యేనును సంభ్రమలీల చేయుదున్.

క. రజితాద్రివాస శైలేంద్రజ పార్వతి రమణ భుజగరాజా భరణున్
గజచర్మధారి శంకరు భజియింతును సంతతంబు ప్రాభవ మొప్పన్.

క. చరలింగమూర్తి వంతుల చరణాబ్జములకును దీర్ఘ సాష్టాంగముగా
శరణు సమర్పణ జేసియు మురియుచు నుతియింతు వారు మోదము జెందన్.

గీ. బసవవిజయము రచియింతు పద్యకావ్య మగను కవివరుల్ మెచ్చియు మోదమంద
పిన్న పెద్దలు వినియును ప్రీతిసేయ భువిని ప్రఖ్యాత మౌనట్టి పొందు పరచి.

వ. మేరువగిరి దక్షిణంబున శ్రీశైలంబునకు నుత్తరంబును,కృష్ణాగోదావరీ మధ్యదేశంబున దైవ నిర్మితంబై సిరు లుల్లసిల్లు యేకశిలా నగరం బన నొప్పు దానికి యేడు కోటలును యేడగడ్తలును, యేడు పరిఘలును, జోడు కొత్తడంబులును సోరని కొమ్మలును, నాకాశంబునకు పొడవైన గోపురంబులును అంబరంబు నందుచు నాలవట్టంబులును, నీడ దిరుగని యట్టి సువర్ణమేడ లసంఖ్యంబులును, మేటి చావళ్లును, నవరత్న స్థాపితంబైన కలశంబుల శివాలయంబులును, మున్నూటపరవై సౌమసూర్యవీథులును, బైటి కోటకు పదియారు గవండ్లును, ముప్పదిరెండు దిడ్డులును, వీథివీథుల భావులును, కొలువుకూటంబులును, బంగారుగోడలును స్ఫటికస్తంభములును, రంగైనబోదెలును, గోవేదికంబుల కొమరుమిగుల దూలంబులును. పవడంపు పట్టెలును పచ్చల వాచూర్లును పద్మరాగంబులకు హెచ్చైన వజ్రంపు కప్పులును నీలంపు శిలల సోపానంబులును, కురువింద మౌక్తిక కుడ్య వేదివ్యమానం బగు స్వర్ణకలశంబులును, ఎన్నంగలిగిన పచ్చపట్టు మేల్కట్లును, కస్తూరి జవాజినిం దీర్చి చిత్తరువు గోడలును గలిగియున్నట్టి కొలువుకూటంబులు పదివేలును భద్రదంతావళంబులు కట్టుమట్టును ...రునవదివేల యెన్నూట యేబదియును, వీడ్వడియున్న యేనుంగులసంఖ్యలును, యేబది లక్షల హయంబులును, నరువదికోట్ల కాల్బలంబులును, ద్వాదశ యోజన విస్తీర్ణంబుగల పట్టణంబున. .... .... ....

ముగింపు :

వ. మరియు నతని కరంబునం బట్టుకొని నారదుండు నీవువేంచేయు మార్గంబు....డుపడం జెప్పు మనిన, ముఖంబు చూచి మాటలాడక మౌనస్థుండై ....య్యను గనుగొని తన దివ్యజ్ఞానంబునం గ్రహించి, యితండు గురుపాదంబులకు ....దెచ్చిన దవనంబు పూజసేయక మౌనంబు విడువం డని నిశ్చయించి నతని విడిచి వచ్చి .... వరంబునం బరమేశ్వరునకు నెరుకచేతు నని సంబరంబునం జని కైలాసంబున . . .

క. .... .... .... ....
చాలా సన్నుతి జేయుచు వాలాయము నారదుండు వడివడి నేగెన్.

వ. అప్పుడు పరమేశ్వరుండు కొలువు చాలించి శీఘ్రంబున లేచి ప్రమథగణాదులం జూచి మీరు శీఘ్రంబున వృషభరూపంబులు గైకొని నవరత్నంబులు పెటికలం భరియిం....షభంబు వెంబడిం గదలిరమ్మనుచు దనచిహ్నంబులు మారువడ జేయవలెనని

నూహించి వ్యాఘ్రచర్మంబును, కపాలమాలికయును కమల...., నాగాభరణంబును హరి ణంబును నద్రికన్యకయును, వహ్నినేత్రంబును, త్రిశూలంబును దన నీల కంధరంబును, శిరంబునం ధరియించిన గంగను . . . .ను. యివి యన్నియును గానరాకుండ మరుగుపడం జేసి, వి . . . లుందానును, . . . షంబు దాల్చి వృషభవాహనం బెక్కి యరుణాచలంబునకుం జని చో .... బునం బ్రవేశించి యుండెనంత.

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు మొదటి రెండు ఆశ్వాసములును మూడవ ఆశ్వాసము కొంత వరకు మాత్రమే కలదు.

ఇందు పాల్కురికి సోమన ఓరుగంటి పట్టణమునకు వచ్చుటయు, అతనితో బ్రాహ్మ ణుల వివాదము, రజకుడు వారితో సంభాషించుట, నందికేశ్వర జన్మము అనిమిషుని చరిత్ర, బసవన్న జన్మము, తామ్రలిఖిత వ్యాఖ్యానము బిజ్జలునకు బసవన్న తేటపరు చుట, మన్మథదహనము, కుమారస్వామి జననము, చెన్నబసవన్న జననము అనునవి ప్రథమాశ్వాసమున గలవు. ద్వితీయాశ్వాసమున చిత్రరు బొమ్మల కథ ప్రహరి సోమన్న మాహాత్మ్యము, నీళ్లకడవలు పరదలై పాడిన కథ, మిండజంగమంబు కధిముక్క వ్యాధుల కథయు కలవు. తృతీయాశ్వాసమున బసవన్న మంగరానకు మ్రొక్కుట చక్కలము కథ, మున్నగునవి గలవు.

ఈ ప్రతి క్రిమిదష్టమైనది. పార్శ్వములు కూడ కొంత నశించియున్నవి. లిపి అస్పష్టము. లేఖన దోషములు, పాదచ్యుతులు గలవు.

# బాల భాగవతము
## (వాల్యూమ్ 1)
## దోనూరి కోనేరు నాథకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 5593 | కాల్ నెం | : బి 3-1 |
| ప్రతి | : కాగితపుప్రతి; సమగ్రము. | పత్రములు | : 288 |
| ప్రతిపరిమాణము | : 27×24 సెం.మీ. | పత్రపంక్తులు | : 20 |

ప్రారంభము :

సీ. .... ... ... కృత శ్రీమదోంకార యా స్థానీకృతోపనిష ద్రహస్య
శుభమండలీకృత శ్రుతి సూతికాగేహ శేఖరీకృత బాల శిశిరకిరణ
ముకుటీ కృతానేక సుకవి శుద్ధస్వాంత సహచరీకృత వాక్య చతురకీర
హస్త భూషీకృత పుస్తకోజ్వలవీణ యాతపత్రీకృత శ్వేతపద్మ

తే. గీ. హార నీహార ఫణిరాజహార హీర హార భూధర ఘనసార చారువర్ణ
భారతీదేవి మన్మనః పద్మ సద్మ వసతియై సత్కవిత్వంబు నొసగుగాత.

వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధియు నభిమత సిద్ధియుంగా నా యొనర్పం బూనిన
యిమ్మహాప్రబంధంబునకుం బ్రారంభంబు-

సీ॥ బ్రహ్మాదికంబులై పరగు పురాణంబు లెన్నంగ బదియును నెనిమిదియును
సరవి సర్గ ప్రతిసర్గముల్ వంశ మ న్వంతరంబులును వంశానుచరిత
ములు నను లక్షణంబుల పంచకంబుచేఁ జెన్ను మీరుచు నుండు నన్నిటికిని
ఘనుడు వేదవ్యాసముని కర్త యసఁబడు నదియు కథా కథనార్థ నటన
సహితము మాన్పియుసు హితం బందజేయు జ్ఞాన విజ్ఞాన సాధన తా నుతంబు
లగుట వేదంబులకు సాటి యనగవచ్చు నుపపురాణంబులును నట్టి యుపమ నెసఁగు,

వ॥ ఇవ్విధంబున బ్రహ్మ, పద్మ, వైష్ణవ, శైవ, భాగవత, నారదీయ, మార్కండేయ
యాగ్నేయ, భవిష్య, ద్బ్రహ్మకైవర్త, లైంగ, వామన, వరాహ మత్స్య, కూర్మ,
గారుడ, స్కాంద, బ్రహ్మాండ నామంబులం బరగు పదునెనిమిది పురాణంబుల
యందును వైష్ణవ, నారదీయ, భాగవత, గారుడ, పద్మ వరాహంబులు సాత్విక
పురాణంబులు బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మకైవర్త, మార్కండేయ, భవిష్య,
ద్వామనంబులు రాజస పురాణంబులు మత్స్య, కూర్మ, లైంగ, శైవ, స్కాం,
దాగ్నేయంబులు తామస పురాణంబులు ఇందు సాత్వికపురాణంబులు భగవ . . . .
మోక్షదాయకంబులు అట్టి సాత్విక పురాణంబులయందున ఋతువులయందు వసంత
ఋతువునుం బోలె అష్టాదశ సహస్ర గ్రంథ సంఖ్యాతం బగు శ్రీ మహాభాగవతంబు
విరాజిల్లుచుండు.

ముగింపు :

వ॥ అంత దక్షుం డా యసిక్నియందు పుత్రికల నరువదింటిం బుట్టించి, యందు ధర్మునకు
బందపింద్రభూతునకు నిద్దర, నంగిరసున కిద్దర, గృశాసున కిద్దర తక్షకునకు నలువుర,

జంద్రునకు నిరువది యేడ్గురు గశ్యపునకు బదుమువ్వుర బుత్రికలను త్రికరణ పూర్వకంబుగా నొసంగె. ...........

ఇది ధర్ముని సంతతి ప్రకారంబు మరియు భూతునకు సురూపయం దేకాదశ రుద్రులును, బహురూపయందు భూతప్రేతాదులు సంభవించిరి. అంగిరసునకు స్వధ యందు పితృగణంబులును

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు బాలభాగవతము మొదటినుండి తృతీయాశ్వాసము సగమువరకు గలదు. కవి దీనిని రచించి తిమ్మభూపాలున కంకిత మిచ్చెను. భాగవతవిషయము సంక్షేపరూపమున నిం దున్నది. లిపి స్పష్టము. లేఖనదోషములు గలవు. ప్రతి పాతబడి శిథిలావస్థకు చేరుచున్నది. మధ్య మధ్య కొంత విషయము వ్రాయబడక వదిలి వేయబడి యున్నది.

# బాల భాగవతము

## దోనూరి కోనేరు నాథకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5594 | కాల్ నెం | : టి 3—2 |
| ప్రతి | : కాగితము; సమగ్రము. | పత్రములు | : 300 |
| ప్రతి పరిమాణము | : 27×24 సెం. మీ. | పత్రపంక్తులు | : 20 |

**ప్రారంభము :**

సతియందు పుత్రత్వంబున నధర్వవేదులను నుదయించిరి. కృశాశ్వునకు నర్చిష్కర యందు ధూమకేశియు ధీషణయందు వేదశిరుండును గలిగిరి తర్క్ష్యునకు వినతయందును గరుత్మంతులును కద్రువయందు భుజంగంబులును, పతంగియందు పక్షులును, యామిని యందు శలభంబులును బుట్టించె. చంద్రుండు కృత్తికాది సప్తవింశతి తారకలయందు ననపత్యుం డయ్యె నని చెప్పి శుకుండు పరీక్షిత్తున కిట్లనియె.

ముగింపు :

శా॥ పద్మాధీశుడె నిత్యసత్వగుణసంపన్నుండు ఖండేందు భృత్
పద్మ ప్రోద్భవ సేవ్యు డెల్లగురుతుల బ్రహ్మణ్యు డద్దేవుల్ నా
పద్మారాధకులన్ గభీరులు మహాభాగు ల్పావిమహిరమా
సద్మంబుల్ త్రిదశేంద్రవంద్యులు మహాసంకల్పు లుర్వీశ్వరా.

వ. అని యివ్విధంబున నాయభిమన్యుపుత్రునకు వైయాసి చెప్పినవిధంబు సూతుండు వినిపించిన శౌనకాది మహామునులు మహాత్మా తదనంతర కథావిశేషంబు లానతీయవే యని యడుగుటయును.

మత్తకోకిల

రంగ దంఘ్రి నఖాంశు రంజిత రాజమస్తక చోళ గౌ
ళాంగ వంగ కళింగ లాట శకాది భూవర సంస దు
త్సంగకీర్తిత సంగరాంగణ చర్య కంపిలిరాయ స
ప్తాంగ గండర గూళి సద్విరుదాది సంగ్రహణోజ్వలా.

గద్య :

ఇది శ్రీ మదష్టభాషాకవిమిత్ర నాగయ మంత్రిపుత్ర సాహిత్యమార్గ నిశ్శంక దోనూరి పదాంక వినయ లక్ష్మీసనాథ కోనేరునాథ ప్రణీతంబయిన బాలభాగవతం బను మహాప్రబంధంబునందు దేవకీవివాహంబును కంసోద్రేకంబును బలదేవావతారంబును, కృష్ణావతారంబును ఘోషప్రవేశంబును పూతనాసంహారంబును .... ....

.... .... .... ....

దేవకీ పుత్రార్పణంబును సుభద్రాపరిణయంబును మిథిలాగమనంబును, మృతవిప్రపుత్ర దానంబును శ్రుతిగీతలును వృకోపాఖ్యానంబును, త్రిమూర్తి పరీక్షోపాఖ్యానంబును నను దశమస్కంధ కథావిశేషంబులు గల పంచమాశ్వాసము సంపూర్ణము.

విశేషాంశములు :

ఇది బాలభాగవతముయొక్క రెండవభాగము. ఈ ప్రతియందు తృతీయాశ్వాసము మధ్య నుండి ఐదవ ఆశ్వాసాంతము వరకు గలదు. లిపి స్పష్టము లేఖనదోషములు కలవు. ప్రతిలోని పుటలు శిథిలావస్థకు చేరుచున్నవి. అట నట విషయలుప్తభాగములును కలవు.

# బాల రామాయణము

## గర్నెపూడి వేంకట సుబ్రహ్మణ్య కవి

ఆక్సెషన్ నెం : ౫౮౦4 కాల్ నెం : టి 3-368

ప్రతి : తాళపత్రము; సమగ్రము. పత్రములు : 15

ప్రతిపరిమాణము : 41 × 3 సెం మీ. పత్రపంక్తులు : 5

ప్రారంభము :

తమిళ పద్యము.

.... .... ....

క॥ తెలివలువయు గలువలదొర నలువున నలరారు వన్నె నాలుగుసేతుల్
గల సుప్రసన్నవదనుని నల వెన్నుని నఖిల విఘ్నహరముగ దలతున్.

తమిళ పద్యము.

.... .... .... ...

సీ॥ కొందరు వేదాంత గురుతరాభిప్రాయ పరిచయాత్మలు పరబ్రహ్మ మనియు
కొందరు మరియు త్రైగుణ్య సముద్భవ స్థానమై యొప్పు ప్రధాన మనియు
గొందరు శాస్త్రార్థకోవిదుల్ క్షేత్రజ్ఞ వరసంజ్ఞ పెంపొందు పురుషు డనియు
గొందరు జగములకును సమవర్తన హేతుభూతుం డగు నీశ డనియు
తే.గీ. దలచి యే పరమాత్మ నిత్యము ప్రశంస సేయుచుందురు విఘ్నవినాయ కాభి
ధానుడైన యద్దేవున కే నొనర్తు వాంఛితార్థ సంసిద్ధికై వందనములు.

.... .... .... .... ....

తత్కథాప్రారంభం బెట్టి దనిన

తమిళ పద్యము.

.... ... ... ....

సీ॥ అనఘాత్మ యీలోక మం దెవ్వ డిపుడు గు ణాఢ్యు డత్యంతవీర్యాన్వితుండు
ధర్మశీలుండు కృతం బెరిగెడు వాడు సత్యవాదియు దృఢసద్వ్రతుండు

ముగింపు :

సీ॥ బహుసువర్ణములచే బరిపూర్ణములు గాక నశ్వమేధశతంబు లాచరించి
గోవుల పదివేలకోట్ల దానముజేసి యగణితధనము బ్రాహ్మణుల కొసగి
నూరు మణుంగులై నుతికెక్కు రాజవం శముల బ్రతిష్ఠించు రమణతోడ
నయమొప్ప నాల్గువర్ణముల నిజ్జగమున దమతమ ధర్మపద్ధతుల నడుపు

తే.గీ. బదులు వేయును మరియును బదులు నూరు సంఖ్యగను వత్సరములు రాజ్యంబు జేసె
బ్రహ్మలోకంబునకు జను బ్రాకటముగ సాంద్రతరకీర్తి శ్రీరామచంద్రమూర్తి.

మాలిని

జలదనిభశరీరా జానకీచిత్తచోరా
కలికలుషవిదూరా ఖండితారాతివీరా
జలరుహదళనేత్రా చారుసౌందర్యగాత్రా
సలలితశుభమూర్తి శాశ్వతానందమూర్తీ.

గద్య :

ఇది శ్రీరామచంద్ర సాంద్రదయాకలిత సరసకవితావిచిత్ర నరసయామాత్యపుత్ర విబుధజనవిధేయ వేంకటసుబ్రహ్మణ్యాభిధేయ ప్రణీతంబైన యాంధ్రభాషాపద్యరచన యందు నారదవాక్యంబును వాల్మీకఋషిప్రోక్తంబును నాదికావ్యంబును నై యొప్పు శ్రీమద్రామాయణంబు సంక్షేపరూపంబైన ప్రథమస్సర్గము సంపూర్ణము.

వాల్మీకిరామాయణము నందలి ప్రథమసర్గలోని సంక్షేప రామాయణమునకు తమిళ, తెలుగు అనువాదములు వ్రాతప్రతి యందు గలవు. తమిళము తమిళలిపిలో వ్రాయబడినది. కవి గర్నెపూడి వేంకటసుబ్రహ్మణ్య మంత్రి. ఇది శతకసంఖ్యను బోలి 107 పద్యములుగ నున్నది. అక్షరాభ్యాసానంతరము బాలురకు అక్షరపాటవము గలుగుటకు దీనిని చదివించవలెను గాన దీనికి బాలరామాయణ మనుపేరు గలిగిన దని కవి గ్రంథాంతమున నుడివెను.

తెలుగులిపి స్పష్టము. లేఖన దోషములు స్వల్పముగ గలవు. ప్రతి బాగున్నది.

# బిల్హణోపాఖ్యానము

## పెద్దికృష్ణ స్వామి

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3997 | | కాల్ నెం | : | టి 265 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | | పత్రములు | : | 25 |
| ప్రతిపరిమాణము | : 40.5×4 సెం.మీ. | | పంక్తులు | : | 10 |

ప్రారంభము :

క. భవ సరసిజసంభవ ముఖ భువనస్థ సమస్తదేవ ముఖ్యుల కెలమిన్
ప్రవిమల మతి మ్రొక్కెద మత్కవితకు సంతతము సత్ప్రకాశము గలుగన్.

క. ధర దోషోదకముల నిడి గరిమన్ సుగుణామృతంబు గాంచును కీర్త్యా
కర వర మానస జలసంచర సత్కవి హంసములను సన్నుతి జేతున్.

గీ. నిర్మలావయవమ్ముల నెమ్మి విడిచి వ్రణములకు బారు మక్షికాప్రతతిభంగి
నొప్పులు గ్రహింప కెప్పుడు తప్పు లరయు కాకవుల లోకముల నే నిరాకరింతు.

వ. అని యివ్విధంబున యిష్టదేవతా నమస్కారణంబును, సత్కవి పురస్కారణంబును, కుకవి తిరస్కారణంబును, గావించి యే నొకనా డెక్కువయగు మక్కువన్ సొక్కి హృద్యవిద్యానవద్యులగు విద్వదార్యులు గొలువ కొలువుకూటంబున నధివసించి సమంచితగతుల వైఖరి దీపించు నవసరంబున.

వ. అంకితంబుగా నా యొనర్పం బూనిన బిల్హణ నాటకం బను మహాప్రబంధంబునకు కథాప్రారంభం బెట్టిదనిన.

గీ. వసుమతికి నాభిభూతమై వరలునట్టి ధర్మశిఖరికి నుత్తర భాగమందు
ద్రుపదలలితంబు సుజన సందోహ చరిత దివ్యదేశంబు పాంచాల దేశ మమరు.

శా. శ్రీ రామామణి కాటపట్టు హరికిన్ శృంగారవాసంబు చె
ల్వొ రత్నంబుల కెల్ల నాకరము సమ్యగ్వాహినీపాళికా
ధామం బన్యదురాసదంబు విబుధ త్రాణంబు రాజాప్తిచే
శ్రీరమ్యంబయి సింధురీతి పురి లక్ష్మీమందిరాఖ్యన్ దగున్.

క. ఆ పురము జయశ్రీలకు కాపురము సమంబు ద్వారకాపురమునకున్
భూపురములలో జెల్వగు గోపురముఖమంబితైక గోపుర మగుచున్.

క. అతతశిఖరిస్థలి సద దితిసుత తటినీతుషార దీపాజ్ఞములై
నుతికెక్కు సౌధరాజము లతులిత శివమూర్తు లనగ నప్పురిలోనన్.

గీ. కనకగోపురాగ్రఘటిత గారుత్మత రత్నరుచులు కుముదరాజులేడి
తొడరి మెసవ జూచు దూర్వాంకురములని చను మృగేంద్రముఖము లునికి నులికి.

ముగింపు :

గీ. పుడమివేల్పులు పుణ్యాహపూర్వకముగ దేవతాహ్వాన మొనరించి తివిరి వారి
కరములను కంకణములు వేడ్కను ఘటించి చదివి రెంతయు మంగళాష్టకము లపుడు.

మ. పొలుపొందం ద్విజరాజశేఖరునకున్ భూభృద్వతంసంబు ని
శ్చలభావోన్నతి కన్య నిచ్చె దగ సాక్షాన్నాగ ముఖ్యంబుగా
పొలుపొందం ద్విజరాజశేఖరునకున్ భూభృద్వతంసంబు ని
శ్చలభావోన్నతి కన్య నిచ్చె సుమనస్సంతానముల్ మెచ్చగన్.

వ. ఇట్లన్యోన్యాతిశయంబున తదుత్సవంబు గావించి విధ్యుక్త ప్రకారంబుగా ప్రధాన హోమంబు లాదిగా గలవి యాచరించి, బంధుసహితంబుగా భోజనాది కృత్యంబులు సలిపి భూసురులకు మ్రొక్కి తదాశీర్వచనంబులు గైకొని బిల్హణుండును యామినీ పూర్ణతిలకయు యథేచ్ఛ భోగంబు లనుభవించునెడ.

విశేషాంశములు :

బిల్హణకవి యామినీపూర్ణతిలకల వివాహము ఇందలి ప్రధాన కథ. ఇది శృంగారరస ప్రబంధము.

ఈ ప్రతియందు 3 ఆశ్వాసములు పూర్తిగా కలవు. చివరి పత్రము మాత్రము లేదు. లిపి స్పష్టము. ప్రతి బాగుగా నున్నది. అక్షర దోషములు బహుస్వల్పముగ నున్నవి. కొన్ని చోట్ల పద్యపాదములు వదలివేయ బడినవి.




# భగవద్గీత

## దత్తోజీ పండితుడు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | . | 624 | కాల్ నెం | : | బి 3-15 |
| ప్రతి | : | తాళపత్రము;సమగ్రము. | పత్రములు | : | 84 |
| ప్రతిపరిమాణము | : | 43 × 3 సెం.మీ. | పత్రపంక్తులు | : | 7 |

ప్రారంభము :

శ్రీకర యనసూయాత్మజ లోకాధిప వాసుదేవ లోకస్తుత్యా
నాకేశార్చిత శ్రుతిచయ సాకేత ప్రసిద్ధగేయ సాత్యవతేయా.

సీ. సంజయ వినవయ్య సర్వసౌఖ్యములచే భూమికి నాభియై పుణ్య మంది
విలసిల్లుచున్న యావిపుల కురుక్షేత్ర మునను మదీయులు ననములైన
పాండవేయుల గూడి బద్ధ విద్వేషులై సమరంబునకు వారు సమత బొంది
యెద్ది చేసిరి యుద్ధ మెట్లెట్ల సెల్లెనా యుత్సహించిన వారి యురుబలంబు

తే.గీ. లెట్ల వర్తిల్లె దాని నీ వేర్పరించి తెలియ బలుకుము నాతోడ ధీవరేణ్య
వినగ వేడుక యయ్యె నవిస్తరముగ ప్రవిమలంబుగ బుద్ధిచే ప్రబల మొంది.

వ. అనిన విని సంజయుం డిట్లనియె.

ముగింపు :

గీ. పాండవేయుల మూకలు పార జూచి నీ కుమారాగ్రజుడు రాజ నీరజాప్త
డదరి యాచార్యు గనుగొని యధిగమించి పలికె నొకమాట యతనితో భక్తిమీర.

వ. సంజయుండు ధృతరాష్ట్రున కిట్లనియె.

ఆ.వె. పరమ పురుషుడైన పరవాసుదేవుండు నర్జుననకు నిట్టు లాన తిచ్చు
వేళ నద్భుతముగ వింటి నీసంవాద మనఘ యేను రోమహర్షణముగ.

గీ. జిష్ణు యోగీశ్వరుండైన కృష్ణదేవు డిట్లు వా నర్జునున కానతిచ్చు వేళ
వింటిని రహస్యమగు యోగవిద్య నేను వ్యాసుల ప్రసాదముననను నో పార్థివేంద్ర.

గీ. ఓ మహారాజ యే నద్భుతామృతంబు కేశవార్జున సంవాద కీర్తితంబు
నగు రహస్యంబు బలుమారు నాత్మ దలచి తలచి యానందమున బొంది దనరియుందు.

గీ. ఓ మహారాజ యద్భుతం బా మహాను భావు డగు హరి దివ్యరూపంబు నెపుడు
దలచి పలుమారు సంతోషకలిత మాన సుండనై విస్మయము నొంది సొక్కి యుందు.

ఆ.వె. ఎచట యోగములకు నీశ్వరుం డగు హరి ఎట ధనుర్ధరుం డయిన కిరీటి
యుండు నచట లక్ష్మి సంపద జయములు నీతియును చెలంగి నిల్చి యుండు.

మాలిని:

సరసిజదళనేత్రా శంఖరాజన్యమిత్రా స్ఫురదరి దరహస్తా సూరిబృంద ప్రశస్తా
వరగుణ గణ ధామా వైరి సంపద్విరామా స్థిరతర దరహాసా శేషశైలాధివాసా.

గద్య :

ఇది సకల సుకవిజన సేవాపరాయణ శ్రీ మద్వాసుదేవ ద్వాదశాక్షరి మంత్రరాజ ప్రసాద సిద్ధయోగ విద్యా విశారద శ్రీ నారదాది గురు పరంపరావాప్త శ్రీ విష్ణుస్వామి సంప్రదాయ ప్రతిష్ఠాపనాచార్య గురుకులతిలక యోగీంద్రచూడామణి శ్రీ నరసింహదేవ గురువరేణ్య శ్రీ పాదపద్మారాధక వేముగంటి పుర నివాస ఆపస్తంబసూత్ర హరితస గోత్రి గాయమాంబా గర్భ సంజాత నాగోజీ పండితపుత్ర దత్తోజి పండిత ప్రణీతంబైన శ్రీ భగవద్గీతా శాస్త్రంబునందు అష్టాదశోధ్యాయము సంపూర్ణము.

విశేషాంశములు:

ప్రతి విలేఖనము:

విక్రమ నామ సంవత్సర చైత్ర బ॥ సప్తమికి రాజశ్రీ జాహరాపురం ఖాసాని నారాయ ణప్ప కొమారుడు నాగిరెడ్డిగారికి దీప్నగండ్ల కరుణం గన్నమరాజు భగవానుల కుమా రుడు గురువరాజు వ్రాసి యిచ్చిన తెనుగు భగవద్గీతల పుస్తకం.

దైవప్రార్థనా నంతరమే గ్రంథారంభము జరిగినది. అందుచే కృతికర్త, కృతిభర్తల వివరములు తెలియరాలేదు. అధ్యాయాంత గద్యయందు మాత్రము కవి యొక్క తల్లిదండ్రుల వివరములు, అతని గురు వివరములు తెలియుచున్నవి. కవి విష్ణుభక్తుడు. తెలుగున నీ భగవద్గీత 13 అధ్యాయములుగ సులభశైలిలో నున్నది. ఈ కవి కొద్ది వచనముతో గీత పద్యముల నెక్కువ ఉపయోగించుకొనెను.

ఈ ప్రతియందు పూర్తిగా 18 అధ్యాయములు ఉన్నవి. లిపి స్పష్టము. కాని స్వల్పముగ అక్షర దోషములు గలవు. ప్రతి యొక్క పార్శ్వభాగము కొంతవరకు శిథిలమై కొన్ని పత్రములలో కొద్ది భాగము నష్టమైనది. స్వల్పముగా క్రిమిదష్టమైనది.

# భగవద్గీత

## దత్తోజీ పండితుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 749 | కాల్ నెం | : జి 8-13 |
| ప్రతి | : తాళపత్రము;సమగ్రము. | పత్రములు | : 65 |
| ప్రతి పరిమాణము | : 41×4 సెం.మీ. | పత్ర పంక్తులు | : 7 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు 18 అధ్యాయములు పూర్తిగా నున్నవి. చాల క్రిమిదష్టమై ప్రథమ పత్రము కొంతవరకు నష్టమై శిథిలావస్థలో నున్నది. కొన్ని పత్రములు తునుకలుగ నున్నవి. ఈ ప్రతి మిక్కిలి శిథిలావస్థలో నున్నది. లిపి కూడ సుస్పష్టము కాదు. ఇందు కొన్ని పాఠ భేదము లున్నవి. భాషాదోషములును గలవు.

ఈ ప్రతి పరాభవ నామసంవత్సర మాఘ శుద్ధ 14 భృగువాసరం నాటికి మోశె తిమ్మారెడ్డి కుమారుడు వేంకటరామిరెడ్డిచే వ్రాయబడి స్వగ్రామకరణం సింగన్నగారికి పారాయణమునకై ఇవ్వబడినది.

# భగవద్గీత

## దత్తోజీ పండితుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 2325 | కాల్ నెం | : టి 3-14 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 49 |
| ప్రతిపరిమాణము | : 46×3.5 సెం. మీ. | పత్రపంక్తులు | : 6 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు 18 వ అధ్యాయములోని చివరి రెండు పత్రములు నష్టమైనవి. మిగిలిన గ్రంథమంతయు నున్నది. లిపి స్పష్టము. స్వల్పముగ క్రిమిదష్టమై పార్శ్వభాగము స్వల్పముగ శిథిలమైనది. పై క్రింది పంక్తులు, పత్రములు నలుపు విరుగుటచే కనిపించుట లేదు.

# భగవద్గీత

## దత్తోజీ పండితుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 5201 | కాల్ నెం | : టి 3-12 |
| ప్రతి | : కాగితము; అసమగ్రము. | పత్రములు | : 76 |
| ప్రతి పరిమాణము | : 12.5×24.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 18 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు కొంత క్రిమిదష్టమై విషయ నష్టము జరిగినది. ఇందలి లిపి కొంత స్పష్టము. ప్రతి విలేఖన దోషము లున్నవి.

# భద్రాపరిణయోల్లాసము

## ముకుంద విలాసము

## కాణాదము పెద్దన

ఆక్సెషన్ నెం : 3824 కాల్ నెం : టి 3-273

ప్రతి : తాళపత్రము; సమగ్రము. పత్రములు : 54

ప్రతిపరిమాణము : 36×4 సెం.మీ. పత్రపంక్తులు : 8 నుండి 9

ప్రారంభము :-

శ్రీ మేల్గూర్పు భరింపు మీ సకల ధాత్రీరాజ్యము స్నీవ యం
చామోదాప్తి నొసంగు లీల వలనొ హస్తంబునం దెల్పు నా
శ్రీ మత్కేశవశౌరి సాంద్ర కరుణాశ్రీ రంజిలన్ సద్గుణ
స్తోమున్ నిర్మలరాయ సోమనృపతిన్ సుశ్రీయుతుం జేయుతన్.

ఉ. శ్రీ లలనాంశ జన్మ పరిశీలను నీలను నందగోపక
స్త్యాలసుతం వరించుతరి సంగతమంగళఘోషచాతురీ
లీల ఘటించు లీల మురళీశ్రుతి వర్తిలు కృష్ణమూర్తి గో
పాలుడు భక్తపాలుడు కృపాలుడు సోమనృపాలు నేలుతన్.

శా. శ్రీ మాంగల్యవతీ నివాసత నురఃశ్రీ దెల్ప శేషాచల
గ్రామగ్రామణినా నెసంగి త్రిజగత్కల్యాణ సంధాతయౌ
శ్రీమద్వేంకటనేత బ్రోచు శుభదృష్టిన్ ముష్టిపల్వాన్వయున్
సోమున్ రాజలలాము నూర్జిత కళాస్తోముం జయస్థేమునిన్.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా సమర్పిపం బూనిన భద్రా పరిణయోల్లాసం బను ముకుందవిలాస (ం బను) మహాప్రబంధమునకు కథాక్రమం బెట్టిదనిన.

చ. అనఘ విదేహ దేశ వసుధాధిపుడై మిథిలాపురంబునన్
మను జనకక్షమాధవుని మాధవునిన్ భజియింపుచుం గనుం
గొని నిగమాగమాగమ శుకుండు శుకుం డరుదేర వేడె పూ
జనమొనరించి మౌని మహిజాని మురారి వివాహ సత్కథల్.

వ. ఇట్లమ్మహీభుజుండు శుభ సంప్రశ్నం బొనరించిన.

క. ఒకపరి రుక్మిణి మొదలగు సకియల కార్గురికి పెండ్లిసవరణ విన బొం
దికపరిచి యవలిసతి కథ శుకముని యాజనక నృపతి సోముని కనియెన్.

ఉ. శ్రీ రమణీయమై సరస శీతకరోపల సౌధ వీథికా
వారచరద్వధూ మధుర వాక్కలనా కలనాద సంకుల
స్వైరకుల స్వరభ్రమదళా విపళత్రిదశద్రుకీరమై
ద్వారవతీ పురంబు దనరారు ధరారుచిరావతంసమై.

మ. తనలో నుండు ముకుందు డందు నిలువం దా నంటునందోన ని
ల్చిన చండద్యుతిమండలంబొ యన నక్షీణప్రతాపోగ్రముం
జనదృక్చిత్రకరం బనంతమణియుం జంచత్ప్రభాపూర్ణమై
యనువందం బురి రత్న హేమవరణ బభ్రంకష ప్రౌఢిమన్.

ముగింపు :-

వ. ఇట్లు నిరంతరానంత కల్యాణగుణవిలాస విభవానుభావుం డగు నవ్వాసుదేవుండు.

సీ. పరిజనమ్ముల లీల బలసి దేవతలైన పనిబూని తనదైన పంపు సేయ
ధర్మంబు నాల్గుపాదములందు వర్తిల్ల ప్రజలెల్ల చల్లగా బ్రతుకుచుండ
సాత్యకి మొదలైన సకల యాదవకోటి యఖిలంబునను తనయాజ్ఞ నడుప
శిష్టుల రక్షింప దుష్టుల శిక్షింప విహరింప భూదేవి వేడ్క నంద

తే.గీ. నలరి భద్రాకృతి నెసంగు నాదిలక్ష్మి రుక్మిణీ ముఖ్యుల విధాన రూఢి గొలువ
నలువ గన్నయ్య ద్వారకా నగరినుండి లీల జగముల నెల్ల బాలింపు చుండె.

క. ఈ చక్రపాణి పరిణయ గోచరశుభకంద మగు ముకుంద విలాసం
బాచక్రవాళ మహియం దాచంద్రార్కంబుగాగ నభివృద్ధి యగున్.

క. అని శుకముని పలికిన విని వనజాక్షుని భక్తి పారవశ్యము వలనన్
జనక నృపాలుం డలరెం మనమున నానంద వికవమగ్నత మెరయన్.

మంగళ మహాశ్రీయను వృత్తము

శ్రీధవ సదా విబుధసేవధి సుధాధవళశీలవిధిశోభితయశశ్శ్రీ
సాధువన మాధవ సుసాధన గదాది ధరసాధిత నిరంతర జయశ్రీ
భూధవసుధీలోక బోధకర సాధుతర భూషిత వినిర్మల గుణశ్రీ
మాధవ దయానవధి మందర గిరీంద్రధరమంజుతరమంగళ మహాశ్రీ.

క. వర కేశవ దేవాంకిత సరణిం గద్వాలసోమ జనపతి భద్రా
పరిణయకృతి జేయించెను స్థిర పెద్దన సుకవిచేత శ్రీ శ్రీ జేయున్.

గద్య :-

ఇది శ్రీమదుభయ కవితా నిస్సహాయ సాహితీ విహార కణాదాన్వయ తిమ్మనార్య కుమార వినయగుణధుర్య పెద్దనార్య ప్రణీతంబైన భద్రాపరిణయోల్లాసం బను ముకుందవిలాసం బను మహాప్రబంధంబునందు సర్వంబును తృతీయాశ్వాసము సమాప్తము.

విశేషాంశములు :-

ఈ ప్రతి విక్రమసం ॥మాఘ॥ శు॥ 2వరకు ప్రతిక్రమాన చూచి వ్రాయబడినది.

ఈ భద్రాపరిణయోల్లాసమునకే ముకుంద విలాసమను నామాంతరము గలదు. గద్వాల సోమ భూపాలుని ప్రేరణచే పెద్దన దీనిని రచించి కేశవాంకితము గావించెను. ఈ కవి ఉభయ కవితా నిస్సహాయ సాహితీ విహారుడ నని ఆశ్వాసాంత గద్యయందు తెల్పు కొనెను. కవి చిత్రకవిత్వము, వివిధ చ్ఛందఃకవిత్వము లనిన నెక్కుడు ప్రీతి చూపుచు ఈ కావ్యమున వాని నెక్కుడుగా ప్రదర్శించెను. శ్రీకృష్ణుడు సప్తమమహిషి యగు భద్రను వివాహమాడుట ఇందలి కథావస్తువు. ఇది శృంగారరస ప్రధాన కావ్యము. కవి యిందొక సందర్భమున శృంగార నాయికలను గూడ వివరముగ వెలయించెను. ఇది మూడాశ్వాసముల గ్రంథము.

ఈ ప్రతికొంత నలువుదిరిగినది. లిపి సుస్పష్టము గాదు. అక్షరదోషములు, వ్రాత తప్పులు స్వల్పముగ గలవు.

# భద్రాపరిణయోల్లాసము

## ముకుంద విలాసము

## కాణాదము పెద్దన

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 739 | కాల్ నెం | : టి 3-215 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 44 |
| ప్రతిపరిమాణము | : 44×4.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 8 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు మూడు ఆశ్వాసములు పూర్తిగా నున్నవి. ప్రతి యంచులు నలువు దిరిగి కొన్నిపత్రములం దొక్కొక్క పంక్తి దృగ్గోచర మగుటలేదు. పార్శ్వములందును అధోభాగమునను కొంత శిథిలమై యున్నది. లిపి స్పష్టమే కాని భాషాదోషములు చాల కలవు. ప్రతివిలేఖరి అర్థవివేచన దృష్టిలేకుండ వ్రాసియుండును. ఈ ప్రతి కొంత క్రిమిదష్టమై యున్నది.

# భద్రాపరిణయోల్లాసము

## ముకుంద విలాసము

## కాణాదము పెద్దన

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 6120 | కాల్ నెం | : టి 3-618 |
| ప్రతి | : తాళపత్రము ; సమగ్రము. | పత్రములు | : 63 |
| ప్రతి పరిమాణము | : 37.5×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 నుండి 9 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు మూడాశ్వాసములు సమగ్రముగా నున్నవి. వ్రాత చక్కనిది. ప్రతి మంచిస్థితి యందున్నది. వ్రాతదోషము లంతగా లేవు. ఈ ప్రతి దుర్మతినామ సంవత్సర భాద్రపద బహుళ దశమి వరకు వ్రాయబడినట్లుగా ప్రతి చివర వ్రాయబడినది. లేఖకుని పేరు మాత్రము వ్రాయబడలేదు.

# భద్రాపరిణయోల్లాసము

## ముకుంద విలాసము

### కాణాదము పెద్దన

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 3369 | కాల్ నెం | : టి 3-255 |
| ప్రతి | : తాళ పత్రము: సమగ్రము. | పత్రములు | : 50 |
| ప్రతిపరిమాణము | : 37×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 10 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు మూడాశ్వాసములు పూర్తిగా కలవు. ప్రతి యలతిగా క్రిమిదష్టమై పత్రములపై నల్లని చుక్కలేర్పడుటవలన కొన్నియక్షరములు తెలియుటలేదు. ఒండు రెండు పత్రములు విరిగి యున్నవి. లిపి స్పష్టము. ఛందోదోషాదులు కలవు.

# భద్రాపరిణయోల్లాసము

## ముకుంద విలాసము

### కాణాదము పెద్దన

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషను నెం | : 447 | కాల్ నెం | : టి 3-193 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 86 |
| ప్రతిపరిమాణము | : 34×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 7 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు మొదట మూడు పత్రములు, చివర ఒక పత్రము, మధ్యలో నేడు పత్రములు నష్టమైనవి. ఉన్న ప్రతి గూడ మిక్కిలిగ క్రిమిదష్టమై శిథిలావస్థలో నున్నది.

# భల్లాణరాయని చరిత్ర

## చిత్తరువు గంగాధరుడు

| | | | | |
|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 2483 | కాల్ నెం. | : | టి. 3-184 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : | 23 |
| ప్రతి పరిమాణము | : 34×3.6 సెం.మీ. | పత్రపంక్తులు | : | 5 |

ప్రారంభము:

శ్రీ గురులింగ సంచిత నిర్మలాంగ భోగేంద్రకేయూర పుణ్య సంచార
పరమ కృపాలబ్ధ భక్త విలోల కరిరాజ మదభంగ కామ భస్మాంగ
నారాయణ స్తోత్ర నగజ కళత్ర వీరభద్రవతార విధిగర్వదూర
నాకేశ నుతపాద నాద వినోద ఆ కాశి నివాస మగు విశ్వనాథ
అని యిట్లు విశ్వేశు నభినుతి చేసి తనరంగ గురుపద ధ్యానంబుతోను
కరమర్థి బసవన్న కనుగొని మ్రొక్కి కరిముఖు నర్చించి కడు రమ్యముననను
అన్నపూర్ణను మరి యాత్మలో నుంచి పన్నుగా వర వీరభద్రుని గొలిచి
.... .... .... .... ....
ఆసింధు కటకంబు నతి సంభ్రమమున వాసిగా నేలెడు వర బలాధిపుడు
పరమోపకారుండు బహుదానపరుడు కరి కరిరిపు గజకంఠీరవుండు
సంగర విజయుండు సాహసోన్నతుడు జననాథు డగు హరిశ్చంద్ర వంశజుడు
పృథివికి నాశ్రిత బుధజనపాలు రథికుండు శివదేవరాయ నందనుడు
భసితత్రిపుండ్రుండు భక్తవత్సలుడు ఈశుండు బల్లాణ రాజశేఖరుడు

ముగింపు:

అనిన నంబికమాట హరు డియ్యకొనియె వనజభవాదులు వర్ణన చేయ
జగజంపు గొడుగులు జననాథునకును తెగువతో బట్టించి దివిజులు బొగడ
పదివేల యరుణపు భావంబుతోడు ఉదయించు భానుడు ఉదయాద్రిపైని
కలువలు వికసించె కమలముల్ విరిసె కలపక్షి రవములు గగనంబు ముట్టె

దేవదుందుభులును దివినుండి మ్రోసె భూవలయమున (?) గురిసె పువ్వుల వాన
ఎల్లదేవతలు తలయెత్తి చూడంగ భల్లాణరాయని పణతు లిద్దరిని
పసిడి విమానంబుపై నెక్కించి .... ....
యాలోకమున నుండి యీశ్వరమూర్తి కైలాసమున కేగె ఘనరాజసమున
అంతనా శంభుండు ఆనందముననును సంతోషచిత్తుడై శర్వాణి దాను
బల్లాణరాయని ప్రమథులలోన బల్లిదుగా జేసి పట్టంబు గట్టి
మంగళప్రదములు మగువలు పాడ చంగలింపుచు దమ శంఖులు మ్రోయ
బ్రహ్మయు యిరువంక ప్రస్తుతి చేయ బ్రహ్మంబు తానైన పార్వతీశ్వరుడు
పరిజనంబై పెక్కు ప్రమథులు గొలువ అరిమురి సింహాసనాసీను డగుచు
అని యిట్లు సూతుండు ఆశౌనకాది మునులకు వినుపించు ముదమున నేను

ఆశ్వాసాంతము:

ఈ పుణ్యచారిత్ర మెవ్వరు విన్న ఏవుతో చదివిన యిష్టమై వినిన
వ్రాసిన చదివిన వారల కెల్ల యీశ్వరు సాక్షిగా యిహమును బరము
శ్రీయును శిశువులు సిరియును మణులు కరి తురగభట శంఖంబులు గలిగి
ధరణీశు లగుచును తరుణులు దాను అరిమురి సింహాసనాసీను లగుచు
ధారుణి మెన్నాళ్లు ధర్మ మెన్నాళ్లు మేరువు యెన్నాళ్లు మిన్ను యెన్నాళ్లు
అభవుడు యెన్నాళ్లు అబ్ధి యెన్నాళ్లు సఫలమై యేప్రొద్దు సద్భక్తు లింద్ల
భూచక్రమునను యీ పుణ్య చారిత్ర మా చంద్రతారార్కమై యొప్పుగాత.

విశేషాంశములు:

ఇది ఒక పరమ శివభక్తుని చరిత్రము. భల్లాణ రాయ భూపాలుడు అడిగినది లేదనక దానము చేయు వ్రతనిష్ఠుడు. శివు డాతని పరీక్షించుటకై వచ్చి ఒక వేశ్యను గోరుట, ఆ జంగమేశ్వరుడు అతడు కోరినట్టి వేశ్యను ఈయలేక తనభార్యనే ఒసగుట, శివుడు ఆమె చేతిలో బాలు డగుట, పరమేశ్వరుడు పార్వతీ సహితుడై ప్రత్యక్షమై సతులతోగూడ ఆ రాజునకు శివలోకప్రాప్తిని, ప్రమథత్వము గలిగించుట యిందలి యితివృత్తము.

ఈ ప్రతి యందు కావ్యము పూర్తిగా నున్నది. ఈ ప్రతి స్వల్పముగ క్రిమిదష్టమై యున్నది. లిపి స్పష్టమే. భాషాదోషములు కలవు.

# భిల్లాణరాయని చరిత్ర

## చిత్తరువు గంగాధరుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5288 | కాల్ నెం | : టి 8-10 |
| ప్రతి | : కాగితము; సమగ్రము. | పత్రములు | : 21 |
| ప్రతిపరిమాణము | : 23×16 సెం.మీ. | పత్రపంక్తులు | : 20 |

**విశేషాంశములు :**

వ్రాత స్పష్టత కొంత కొరవడినది. వ్రాత దోషములు, ఛందో దోషములు కలవు. ప్రతివిలేఖన కాలము పేర్కొనబడలేదు. ప్రతి బాగున్నది.

# భిల్లాణరాయని చరిత్ర

## చిత్తరువు గంగాధరుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 726 | కాల్ నెం | : టి 8-183 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పుటలు | : 24 |
| ప్రతి పరిమాణము | : 45.5×4 సెం.మీ. | పుట పంక్తులు | : 7 |

విశేషాంశములు :

పరాభవనామ సం॥ర భాద్రపద శు ౧౩ లు మ॥ ద్యావనబండలో వుండే వేంకటాపురం సాతాని వేంకటరమణయ్య పుత్రుడైన రంగయ్యకు మ॥ ద్యావనబండలో నుండే గండ్లూరు కుమ్మర సంజీవప్ప కొమారుడు వ్రాసి యుచితార్థం యిచ్చిన భిళ్ళాణ రాయని చరిత్ర.

ఈ ప్రతియందు ఆద్యంతములు ఉన్నను మధ్య కొన్ని పత్రములు నష్టములైనవి. పై భాగములు నలుపు దిరిగి ఒక్కొక్క పంక్తి సరిగా దృగ్గోచర మగుటలేదు. ప్రతి కొలదిగా క్రిమిదష్టమైనది. అక్షరదోషములు కొలదిగా కలవు.

# భల్లాణరాయని చరిత్ర

## చిత్తరువు గంగాధరుడు

ఆక్సెషన్ నెం : 1748 కాల్ నెం : టి 3-220
ప్రతి : తాళపత్రము; అసమగ్రము. పత్రములు : 29
ప్రతి పరిమాణము : 33×4 సెం.మీ. పత్రపఙ్క్తులు : 7

**విశేషాంశము :**

ఈ గ్రంథాంత మందలి 8, 10 పంక్తులు మాత్రము లోపించి యుండవచ్చును. 43వ పత్రము నష్టమైనది. కొన్ని పత్రములు శిథిలములై తునుక లగుచున్నవి. ప్రతి నలుపు దిరుగుచున్నది. ప్రతివిలేఖన దోషములు స్వల్పముగ నున్నవి.

# భల్లాణ చరిత్ర

## రాజలింగకవి

ఆక్సెషన్ నెం : 5534 కాల్ నెం : టి 3-179
ప్రతి : తాళపత్రము; సమగ్రము. పత్రములు : 24
ప్రతి పరిమాణము : 30×3.5 సెం.మీ. పత్రపంక్తులు : 8

**ప్రారంభము :**

శా. శ్రీమచ్ఛైలసుతా సమాశ్రితుడు నీరేజాక్ష చిత్తాబ్జసం
క్రామద్దివ్యశిలీముఖుండు భువనాకారుండు బృందారక
స్తోమత్రాణపరాయణుండు జితదైత్యోద్రేకు డు
ద్దామాటోపగుణుండు శంకరుడు నిత్యం బర్థి మమ్మేలుతన్.

వ॥ మహిత మాతులుంగ లవంగ లుంగ మందార చందన తిందుక కుంద కందరాళ పిప్పల బాలరసాల కృత కృత్సం(?)తమాల తాల హింతాల వకుళ .... పాటలి పాటల నింబ జంబూజంబీర ఖర్జూ రార్జున భల్లాతకీ హైమవతీ కేతకీ నాగ పున్నాగ తిలకామలక వకుల మరుతక కదలీ బదరీ మదనద్రిక్ష(?)ద్రాక్షా ఫలాద్యక్ష రుద్రాక్ష గోలవ మయూర బంధూల మధుక శాక మంజులమంజుకుంభినీరుహా గుంభితంబు లును శరభ శకుంతల చక్రవాక చకోర చరణాయుధ కాశ్మీ(ర) కలకంఠ కాలకంఠ కళింగ కరభ కకుభ కర .... కా .... దాన కాన కపోత శ్వేత గరుడ పారావత పరభృత ప్రతిక భరద్వాజ శుక శారికా సంచయ సంచారంబును.

**ముగింపు :**

క. సౌందర్యరూప మృదు వా గ్బృంద శ్రితబంధు హేష పృథులస్వాంతః
కందళిత సత్కృపీం ద్రా నంద మహోద్దామ సంగనారాధ్యవరా.

మానిని॥ సరసగుణవిశాలా సచ్చిదానందలోలా చిరతరశుభజాలా సేవ్యధర్మానుకూలా
నిరుపమగ .... .... నవ్యార్థశీలా॥

**గద్య :**

ఇతి రాజేశ్వర వరప్రసాదలబ్ధ వాగ్విలాస నిధాన సుకవిజన జేగీయమాన అశ్వలా యనసూత్ర వసిష్ఠగోత్ర పవిత్ర సర్వేశ్వరపుత్ర సకల విద్య ప్రసంగానుషంగ శ్రీ రాజలింగకవి ప్రణీతంబైన భల్లాణ చరిత్రం బను పుణ్యకథయందు ప్రథమాశ్వాసము.

**విశేషాంశములు :**

నందన నామ సంవత్సర శ్రావణ శుద్ధ విదియ గురువారంనాడు గోశెట్టి బసవన్న ప్రతిలో వున్న క్రమాన భల్లాణాచారి సంపూర్ణముగా పాలవరపు మల్లయ్యవ్రాసినాడు॥. ప్రతి బాగున్నది. వ్రాత స్పష్టత లేదు. వ్రాతదోషములు కలవు. ఏకాశ్వాసము కలదు. గ్రంథాద్యంతములలో పద్యములు కలవు. తక్కినభాగ మంతయు వచనములో వ్రాయబడినది.

# భానుమతీపరిణయము

## రెంటూరి రంగరాజు



ప్రారంభము :

సీ. కమియు నుద్ధత వారణము ద్రిప్పు నే సదా చార ధౌరేయు హుంకార రవము
లసదనుష్ఠాన వేళల నుదగ్ర వ్యాఘ్ర మే మహాత్ముని సేవ కెదురుకొనును
ఫణి చుంబిత గంభీర పాదాగ్రణికి సుధా పాన మే యాచార్య భక్తరజము
సకల జీవోద్ధారక కళా దురంధరం బేధన్యు కరుణార్ద్ర వీక్షణంబు
నట్టి దేశికమణి భావనార్య తనయ రత్నమై దేజరిల్లు శ్రీరంగధామ
హైమ యజ్ఞోపవీత లీలావతార ధరుని కందాళ శ్రీరంగ గురు దలంతు.

సీ. బహు దేశికులు చూడ బ్రహ్మరాక్షసి బాపు రంజిత శ్రీపాద రజమువాడు
పుట్టు మూగను తమ్మి పుట్టుగా గైచేశి బరగు ప్రసాద వైభవమువాడు
సకల దిగంత విశ్రాంతంబులగు నిరం తర తదీయారాధనములవాడు
పరమ దయాదృష్టి భక్త లోకములకు నుభయ వేదాంతంబు లొసగువాడు
అన్నయాచార్యవర్య ప్రియాత్మజుండు వసుధ నన్నేలు కందాళ వంశజలని
ధాన శుభద సుధాధామ దాశధన్యు సురుచిర యశుండు శ్రీరంగ గురువిభుండు.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన భానుమతీ పరిణయం బను శృంగార మహా ప్రబంధంబునకుం గథాక్రమం బెట్టిదనిన.

క. జనమేజయ నృపచంద్రుడు వనజాక్ష కథా ప్రసంగ వైభవలీలన్
విని యుబ్బుచు వైశంపా యనముని కిట్లనియె సవినయాలాపమునన్.

మ. అనఘా ద్వారవతీ పురీవరమునం దంభోజ గర్భాది లే
ఖనికాయంబులు మెచ్చునట్లు యదులోకస్వామి యా భానుజా
ఘనవేణిన్ సహదేవరాయమణికిన్ గల్యాణమున్ జేసెనో
యనినన్ మౌనివరుండు దిట్టనియె ధవ్యప్రేమ నా రాజుతోన్.

సీ. మదము నేనుగలేం పూవంతుల దనప్పు తమ్మి వైఖరి పెక్కు దళముల దగి
కనకాద్రి కరణి కాంచన కూటముల మించి మహిజంబు మాడ్కి కొమ్మల బెనంగి
కమలాకరము రీతి కల్హారంబుల మీరి దివి తేవ విబుధాళి దేజరిల్లి
పలుకు కప్రపుఛాయ జెలువు తావుల మించి ననుచు దొల్కరి మాడ్కి ఘనుల నలరి
గాంగ గాంగేయ జలజాత భృంగభావ జీవమణి సౌధపాళి కేళివిలోల
లోల మృగశాబలోచనా లోచన ప్ర భాళి యగు ద్వారకాపుర మౌళి మెరయు.

గీ. కాంచనాంబర యోగ ప్రకాశమునను వనజనాభుని లీల నావరణ మలరు
భుజగ భూషణ యోగ విస్ఫురితమునను హరు విధంబున బరిఘ తత్పురిని మెరయు.

ముగింపు :

సీ. నుదురు క్రొన్నెలపైని జెదరు కస్తురిరేఖ లలరార బట్టిన మలయజములు
పెడమరలుగ జిక్కువడిన హారంబులు వంతుగా జారు చామంతిసరులు
కటుల మార్పడిన చెంగావి పావడలును నొండొండ జేర్చిన గండపాళి
తమ్మిమొగ్గల చాయ తగు ముద్దుచన్నుల పొదివిపట్టిన కరాంభోరుహములు

వేడుకలుమీర సురతాంతవేళలందు సొరపుగా పువ్వుపాన్పుపై నొత్తిగిల్లి
నిద్రజెందిరి మలయాద్రినిలయ పవన గతుల సూర్పులు విలసిల్లు సతియు బతియు.

క. అంతట మేల్కని కాతయు కాంతుడు విహితోపభోగ గరిమము మెరయన్
కాంతురు సతతము లక్ష్మీ కాంతా కల్యాణభటుల కైవడి మెరయన్.

క. అని వైశంపాయనముని ఘనతరమగు భానుకన్య కల్యాణంబున్
వినుపింపగ విని యుబ్బుచు జనమేజయు డలరుచుండె సంతోషమునన్.

శా. ఆశారూఢతరప్రతాప నృపరాజ స్థాపనాచార్య పూ
ర్వాశాధీశ్వర భోగ మాధవ తదీయారాధనాకల్పిత
ధ్గోశంఖ ధ్వనకీర్తి .... .... .... ....
.... .... .... .... .... ....

ఇది శ్రీ రామచంద్ర సాంద్ర కృపారస పరిపాక లబ్ధ కవితా మాధురీ ధురీణ శ్రీవత్స గోత్ర పవిత్ర రెంటూరి చిన్నరంగనామాత్యపుత్ర సౌజన్యభాగధేయ రంగరాజ నామధేయ ప్రణీతంబైన భానుమతీపరిణయం బను మహాప్రబంధంబు నందు సర్వంబును చతుర్థాశ్వాసము.

విశేషాంశములు :

పరియదాభి సం॥ వైశాఖ శు. ౧౦ స్థిరవారం ఉదయం వరకు పూర్వప్రతినున్న క్రమాన ఆచంద్రార్కంగా చదువుకో గలందులకు పోతుల పాత్రినాయుడు కుమారుడు పెదరాజినాయుడు శ్రీహనుమత్సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న సమేత శ్రీరామచంద్రార్పణంగా వ్రాసుకొనెను.

కవి తన కావ్యమును రాయభూపాలుని కోరికపై రచించి అతనికే అంకితము గావించెను. ఇది శృంగార రసప్రధానమైన నాలుగు ఆశ్వాసముల కావ్యము. ఇందు భానుమతీ సహదేవులపరిణయము వర్ణితము.

ఈ ప్రతి యందు నాలుగు ఆశ్వాసములు పూర్తిగా కలవు. ప్రతి మంచి స్థితిలోనే యున్నది. ఇందు కొన్ని పదములు, కొన్ని పాదములును చ్యుతములైనవి. కావ్యాంతమున ప్రతివిలేఖరి చివరి పద్యపాదములు రెండు లభింపక వదిలివేసెను. లిపి చక్కగ నున్నది. అక్షరదోషములు కొలదిగా గలవు.

# భానుమతీపరిణయము

రెంటూరి రంగరాజు

| | | | | |
|---|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 2410 | | కాల్ నెం | : బి 3-206 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | | పత్రములు | : 40 |
| ప్రతిపరిమాణము | : 34×3 సెం.మీ. | | పత్రపంక్తులు | : 5 |

**విశేషాంశములు :**

ప్రతిలోని కొంత భాగము క్రిమిదష్టమైనది. లిపియు అంత స్పష్టముగ లేదు. ప్రతి నలుపు దిరుగుచున్నది. లేఖన దోషములు గలవు.
ఈ ప్రతి యందు ప్రథమ, ద్వితీయాశ్వాసములు మాత్రమే కలవు.

# భాస్కర రామాయణము

## భాస్కరుడు, మల్లికార్జునుడు, అయ్యలార్యుడు

| | | | | |
|---|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 3976 | | కాల్ నెం | : బి 3-380 |
| ప్రతి | : తాళపత్రము;సమగ్రము. | | పత్రములు | : 308 |
| ప్రతిపరిమాణము | : 41.5×3 సెం.మీ. | | పత్రపంక్తులు | : 3 నుండి 9 |

**ప్రారంభము :**

శ్రీకంఠ చాప ఖండన పాకారి ప్రముఖ వినుత భండన విలస
త్కాకుత్స్థ వంశమండన రాకేందు యశోవిశాల రామనృపాలా.

క. రాముని శుభ చరితము దగ రామాయణముగ రచించి ప్రాచేతసుకుం
ప్రేమ నెరింగించి తగ నిజ ధామమునకు నారదుం డుదారత జనియెన్.

క. వాల్మీకి భరద్వాజ యుతు తుల్యానుగ గంగ కనతిదూరమున లతా
గుల్మాంచిత తీరయు ని ష్కల్మష జలయునగు తమసకడ కేగి తగన్.

వ. తన శిష్యుండగు భరద్వాజుని చేతివల్కలంబులు పుచ్చుకొని ధరించి వాహిని నవగాహ నంబుచేసి వెడలి నిలువంబడు నెడను.

కం. అంచితముగ దత్తటమున గ్రౌంచంబులు రెండు ఏల గ్రాలుచు నుండన్
పొంచియొక శబరు డందొక క్రౌంచము బడజేసె రక్తకణములు దొరుగన్.

కం. శిరమున రక్తము దొరుగగ బొరలెడు తన విభుని జూచి పొడమిన వగతో
బరుషధ్వని వాపోవుచు గరము విషాదించె క్రౌంచి గనుగొని కరుణన్.

వ. కటకటం బడుచు వాల్మీకి యధిక రోష సంఘటిత కుటిల భ్రుకుటితాస్యుండగుచు నిషాదుం గనుగొని.

ఉ. ఓరి మహోగ్రపాతకుడ యోరి నిషాదుడ క్రౌంచయుగ్మ మిం
పారగ గామకేళిమెయి నాడగ నందొకపక్షి నల్గి ని
ష్కారణ మేల చంపి.................... వేగచావు వో
రోరి దురాత్మ యంచు గడు నుగ్రత నమ్ముని పల్కె పల్కనన్.

కం. ఆకరుణానిధియగు వా ల్మీకుల శాపాక్షరములు మితసమవర్ణ
శ్రీకర పాద చతుష్క శ్లోకంబై జగతిబరగె సుశ్లోకంబై.

వ. అంత నమ్ముని వెరగందుచు తన శిష్యుండగు భరద్వాజుం జూచి, తపోధనా! యి ట్లే నరిగి నిషాదుని శపియించిన రోషాక్షరంబులు సమవర్ణ చతుష్పాదశ్లోకం బయ్యె నని పలుకుచు నభిషేకంబుచేసి వెదలి యుచితానుష్ఠానంబులు నాహ్నిక విధులు నాచరించి

క. తనవెనుక భరద్వాజుడు చనరగ జలపూర్ణకలశధరుడై యేతే
ర నిజాశ్రమమున కమ్మెయి జని తగగూర్చుండి యోగసమ్మతబుద్ధిన్.

ముగింపు :

క. కరదీకృత భయకంపిత ధరణీపతి వివిధ సదుపదామణి రాజి
స్ఫుర దురుకనకాగార మద కరి తురగాదుల బురోపకంఠము దనరన్.

వ. శాసింపుచు ననస్య సాహసాన్యానుభావుండై హిమవన్నగంబునుంబోలె పుణ్యజనేశ్వర ప్రియసఖుండై మహేశ్వరుండు బోలె శివాలంకృతాంగుండై కుమారుండునుంబోలె నఖండశక్తిసంపన్నుడై మహేశ్వరుండబోలె సుమనస్సేవ్యమానుండై దహనుండునుం బోలె జగత్ప్రాణసఖుండై దండధరుడునుంబోలె సమవర్తియై, నిరుతిబోలెదాన విశ్రు తుండై వరణుండుబోలె ప్రచేతసుండై సమీరుండుబోలె జగత్ప్రాణుండై కుబేరుండుబోలె

రాజరాజై భాస్కరుండుబోలె నరాపాయరుద్ధమహీభృత్సముదాయుండై, నిశాకరుండు బోలె కువలయోల్లాసకారియై, సముద్రుండుబోలె కనకవాహినీసమాశ్రయుండై, మరి య నీతియయ్యును నీతిగోరుమండె యనంతాభిముఖుండునుంబోలె యనంతాభిముఖ్యుండును, నద్విజిహ్వ దురవసదుండై సార్వభౌముండయ్యు నతియుత్తరాశాపరిగతుండై జిష్ణుం డయ్యు, గోత్రపక్ష నభేదియై ధనంజయుడయ్యు, సనహాశ్రయుడుండై.

గీ. వాజిమేధములును వాజపేయంబులు నాదియైన వివిధయాగతతులు,
నర్థితో యజించె నమరులు విప్రులు దృప్తిపొంది సంతసింపుచుండ.

సీ. దుర్భిక్షడాంబర దురితదోషంబులు వాతాగ్నిరోగ పరీతవృత్తియు,
కాలదోషాసత్యమున శోకనిహతులు ధర్మరాగ ద్వేషదాంబికత్వ
మదమోహ పైశునమచ్చరంబులు రోష లోభ తృష్ణవియోగ లోలతతులు
హేయకర్మణ్య యహింసాపరాధన కరణంబులును బాలమరణములును

ఆ. ప్రజలెరుంగకుండ ప్రథితాశుశాసన పాకశాసనుండు లోకగురుడు
తండ్రివోలె మిగుల దయతోడగాచుచు బరగ రామవిభుడు ధరణి యేలె.

క. సారాచారోదారుడు వీరేంద్రుడు పదునొకొండు వేలేండ్లు నిజా
జ్ఞారంభమొదవ నిత్య సైమరయశః స్ఫూర్తి నేలె మేదిని యెల్లన్.

క. శ్రీరామాయణ సంహిత సారమతిన్ వినిన వ్రాయ చదివిన దురితా
పారజలరాశి గడతురు ధీయులు ధర్మార్థకామదీపితవృత్తిన్.

గీ. ఎవ్వడేది గోరి యీ కథవిను నాత డదియు బడయు సందియంబు లేదు
ఇష్టమగు ఫలంబు లెవ్వియు గోరిన గలుగు నొక్కమాత్ర జెలగి చదువ.

చ. అమర హుళక్కి భాస్కర మహాకవి జెప్పగ నున్న యుద్ధకాం
డ మమరిపూర్తిజెప్పె వికటప్రతిభాషణు డప్పలార్యు ను
త్తమసుతు డయ్యలార్యుడు గృతస్థితి నార్యులు మెచ్చునట్లు
హిమకరతార భాస్కర మహేవలయస్థితలక్ష్మి జేకురన్.

ఉ. ఆగమతత్వవేద్య దివిజాధిప మానసహృద్య నిత్యసం
శ్రీగగుణాభిరామ పరుషీభవదాసురభీమ నిస్సర
ద్రాగయతీంద్రసాంద్ర వినయత్రిదశాఖిలసాధ్య సుస్థిరా
భోగ మహానుభావ బహుభూతిద నిర్మలభావ భావనా.

క. ప్రణమ న్మరుదీశ శిరో మణి ఘృణివిమలాంబుధౌత మానితచరణా
గణనాతీతగుణ శరణ గణ శోకకృతాధికరణ కరుణాభరణా.

మాలిని :

కనకధర చాపా కల్యకల్యాణరూపా వనజ నిలయవంద్యా వారిజాతాభినంద్యా,
జనన విలయదూరా సర్వనిష్పన్నహారా మనసిజ హరనేత్రా మంగళాద్యా చరిత్రా.

గద్య :

ఇది సాకల్యమల్లక వీరబాహు నృసింహార్య వరజ అప్పలార్య వరనందన వుభయ భాషా కవితా విశారద శారదా కమల చరణాలంకరణ మానసాయ్యలార్య విరచితంబైన శ్రీమద్రామాయణంబు నందు యుద్ధకాండ సర్వంబును సంపూర్ణము.

**విశేషాంశములు :**

ప్రతివిలేఖనము :

శ్లోకం. విజయాబ్దే మాఘమాసే సప్తమీ శుక్లపక్షగే
సౌమ్యవారే త్రియామే చ లిఖ్యతే తేష పుస్తకమ్.

స్వస్తి శ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౭౩౫ అగునట్టిగాను ఏవం ప్రవర్తమాన వ్యావహారిక చాంద్రమాన విజయనామసం॥ భాద్రపద బ॥౭ అరభ్య మాఘశు ౭ వరకు పం॥ వెంకయ్య మొ॥ విజయాంబాద తమబాసాకు ప్రతిలో వున్న క్రమాన వ్రాసుకున్న భాస్కరరామాయణం.

ప్రతి చక్కనిది. వ్రాత బాగున్నది. గ్రంథశైథిల్య, పాతములు లేవు. వ్రాతదోషము లచ్చటచ్చట గలవు. ఇందు పీఠికా భాగము లేదు. మొత్తము 6 కాండలు గలవు. ఈ ప్రతియందు అయోధ్యకాండ, అరణ్యకాండలు భాస్కరుడు రచించినట్లుగాను, బాల, కిష్కింధ, సుందరకాండలు, మల్లికార్జునభట్టు రచించినట్లుగను, యుద్ధకాండను అయ్యలార్యుడు రచించినట్లుగను గలదు.

అయోధ్యకాండ కుమారరుద్రదేవుడు రచించినట్లుగ నేటి ముద్రిత ప్రతులందు గలదు. గ్రంథము సాహిణి మారున కంకితము.

# భాస్కర రామాయణము

## భాస్కరుడు, మల్లికార్జునుడు, అయ్యలార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | 315 | కాల్ నెం | : టి 3-325 |
| ప్రతి | తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 353 |
| ప్రతి పరిమాణము | 44×4 సెం.మీ. | పత్ర పంక్తులు | : 5 నుండి 7 |

**విశేషాంశములు :**

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు 1764 ఏవం ప్రవర్తమాన వ్యవహారిక చాంద్రమాన శుభకృతు నామసంవత్సర శ్రావణ బహుళ ౧౦ బుధవారం వరకు మహారాజశ్రీ జనంపల్లి సర్వాయిరాయ త్రైసంమ్మ్రదళాయి గారికి ముంగర నర్సన్న వ్రాసియిచ్చిన భాస్కర రామాయణం షట్కాండలు ఆచంద్రార్కస్థాయిగాను శ్రీరాములకు సంతోషంగాను చదువుకునేటందుకు వ్రాయించినది.

గ్రంథము సంపూర్ణముగా నున్నది. వ్రాత బాగుగా నున్నది. చక్కని ప్రతి. అచ్చటచ్చట స్వల్పముగా క్రిమిదష్టమై యున్నది.

# భాస్కర రామాయణము

## భాస్కరాదులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | 1791 | కాల్ నెం | : టి 3-588 |
| ప్రతి | కాగితము; అసమగ్రము; | పత్రములు | : 64 |
| ప్రతి పరిమాణము | 50×5.2 సెం.మీ. | పత్ర పంక్తులు | : 20 నుండి 25 వరకు |

**విశేషాంశములు :**

ఈ ప్రతి యందు బాలకాండ మొదలు యుద్ధకాండ వరకును గల ఆరుకాండలు కలవు. కాని ప్రతి పత్రము క్రిదష్టమై శిథిలమగుచున్నది. కొన్ని పత్రములు విరిగి పోయినవి. లిపి బహుసూక్ష్మముగ కష్టసాధ్యముగ నున్నది. ఇది విక్రమనామ సం॥ పుష్య బహుళాష్టమి నాటికి వ్రాయబడినది.

# భాస్కర రామాయణము

## భాస్కరాదులు

ఆక్సేషన్ నెం 6150 కాల్ నెం : టి 3—624

ప్రతి కాగితము; అసమగ్రము. పత్రములు : 321

పరిమాణము 43×3.5 సెం. మీ. పంక్తులు 7 నుండి 8 వరకు

**విశేషాంశములు**

ప్రతి నలుపుదిరుటచే అక్షరములు స్పష్టముగా కనిపించడం లేదు. గ్రంథమున కాద్యంతములు లేవు. అటనట కొన్ని పత్రములు విరిగి పోయినవి. లిపి స్పష్టము. వ్రాతదోషములధికము.

# భాస్కర రామాయణము

(బాల - అయోధ్య కాండలు)

## భాస్కరాదులు

ఆక్సేషన్ నెం 3635; కాల్ నెం : టి 3-372

ప్రతి తాళపత్రము; అసమగ్రము. పత్రములు : 112

ప్రతిపరిమాణము 47.5×3.5 సెం.మీ. పంక్తులు : 6 నుండి 7

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు బాలకాండ పూర్తిగా కలదు కాని అయోధ్య కాండలో నట నట కొన్ని పత్రములు లేవు. ప్రతి క్రిమిదష్టము. లిపి స్పష్టము. వ్రాత దోషములు కలవు.

# భాస్కర రామాయణము

(బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ కాండలు)

## భాస్కరాదులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | 461 ఎ: | కాల్ నెం | : టి 3-313 |
| ప్రతి | తాళపత్రము; సమగ్రము | పత్రములు | : 70 |
| ప్రతిపరిమాణం | 40×4.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 8 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు కిష్కింధ కాండ సగభాగము వరకు మాత్రమే కలదు. ప్రతి క్రిమిదష్టమై అట నట కొన్ని పత్రములు విరిగి పోయినవి. లిపి స్పష్టము. వ్రాత దోషములు కలవు.

# భాస్కర రామాయణము

(బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధకాండలు)

## భాస్కరాదులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | 705 | కాల్నెం | : టి 3-321 |
| ప్రతి | తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 225 |
| ప్రతిపరిమాణము | 36.5×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 నుండి 8 |

**విశేషాంశములు**

ఈ ప్రతి యందు బాల, అయోధ్య అరణ్య, కిష్కింధ కాండలు గలవు కిష్కింధ కాండ అసమగ్రము.

మరియు గ్రంథమంతయు భాస్కరుడే రచించినట్లు గలదు.

# భాస్కర రామాయణము

(బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందరకాండలు)

## భాస్కరాదులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 4817 | కాల్ నెం | : టి 3-316 |
| ప్రతి | : తాళపత్రము ; సమగ్రము. | పత్రములు | : 159 |
| ప్రతి పరిమాణము | : 48×4 సెం.మీ. | పత్ర పంక్తులు | : 7 నుండి 8 |

విశేషాంశములు :

ఈ ప్రతి యందు ఆదినుండి సుందర కాండలో రావణుడు సీతను దూషించి వెడలుట వరకు మాత్రమే కలదు

ప్రతి యందలి కొన్ని పత్రములు శిథిలములై కొంత భాగములే మిగిలి యున్నవి. ప్రతి నాలా వరకు క్రిమి దష్టమైనది. నలుపు విరుగు చున్నది. లిపి స్పష్టముగ నున్నది. కాని ప్రతి విలేఖనమున కొన్ని కొన్ని పద్యములు వ్రాయబడకుండ చ్యుతము లైనవి. అక్షర దోషములను గలవు.

# భాస్కర రామాయణము

(బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర కాండలు)

## భాస్కరాదులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 703 | కాల్ నెం | : టి 3-319 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము. | పత్రములు | : 80 |
| ప్రతిపరిమాణము | : 36.5×4 సెం.మీ. | పత్ర పంక్తులు | : 8 నుండి 9 |

విశేషాంశములు :

గ్రంథము క్రిమిదష్టమై యున్నది. ప్రతివిలేఖన కాలము లేదు. వ్రాత బాగుగాలేదు. అక్షర దోషములు గలవు.

# భాస్కర రామాయణము

(బాల, అయోధ్యా, అరణ్య, కిష్కింధ, సుందరకాండలు)

## భాస్కరాదులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3628 | కాల్ నెం | : టి 3–367 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 288 |
| ప్రతిపరిమాణము | : 42×4.5 సెం. మీ. | పత్రపంక్తులు | : 7 |

విశేషాంశములు :

ప్రతి విలేఖనము :

రాక్షస సంవత్సర చైత్ర........రాజు శ్రీరామచంద్రార్పితము సెట్టి వీరన్న కుమార్డు వెంకటశెట్టికి శ్రీమద్రామయణం మంత్రిరావు.........యిచ్చెను.

గ్రంథము క్రిమిదష్టమైనది. కొన్ని చోట్ల పత్రములు శిథిలమై యుండి, పత్రార్ధ భాగములే కలవు. కొన్ని పత్రములు లోపించినవి. వ్రాత నిర్దుష్టము. చక్కనిది.

# భాస్కర రామాయణము

(బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర కాండలు)

## భాస్కరాదులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3630 | కాల్ నెం | : టి 3-369 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 280 |
| ప్రతిపరిమాణము | : 44.5×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 |

విశేషాంశములు :

ఈ ప్రతి యందలి ప్రతిపత్రము క్రిమిదష్టమై యున్నది. గ్రంథమందు యుద్ధకాండ లేదు. మిగిలిన కాండలన్నియు సంపూర్ణముగా గలవు.

ఈ ప్రతియందు కొన్ని కాండలు ఏ కాలమందు వ్రాయబడినదో ఆ కాండాంతమందే వ్రాయబడి యున్నది.

ఈ ప్రతి యందు సుందరకాండ భాస్కరుడే వ్రాసినట్లు యున్నది.

# భాస్కర రామాయణము

(బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందరకాండలు)

భాస్కరాదులు

ఆక్సెషన్ నెం : 449 కాల్ నెం : టి 3-322

ప్రతి : తాళపత్రము ; అసమగ్రము. పత్రములు : 202

ప్రతిపరిమాణము : 27×4 సెం.మీ. పత్రపంక్తులు : 6 నుండి8

**విశేషాంశములు :**

ఈ ప్రతి యందు సుందరకాండలో హనుమంతుడు తన వృత్తాంతమును, రాముని ప్రభావమును రావణునితో జెప్పుట వరకే గలదు. మధ్య మధ్య కొన్ని పత్రములు లోపించినవి.

ప్రతి చాల వరకు క్రిమి దష్టమై, మిక్కిలి శిథిలావస్థలో నున్నది. పత్రముల కొలది భాగములు మాత్రమే మిగిలి యున్నవి.

ఇందలి లిపి స్పష్టము కాదు. ప్రతి విలేఖనమునను దోషములు గలవు. కొన్నియెడల పాఠాంతరము లున్నవి. ప్రతి నలుపు దిరుగు చున్నది.

# భాస్కర రామాయణము

(బాల, అయోధ్య, అరణ్య, సుందర కాండలు)

భాస్కరాదులు

ఆక్సెషన్ నెం : 3831 కాల్ నెం : టి 3-370

ప్రతి : తాళపత్రము;అసమగ్రము పత్రములు : 221

ప్రతి పరిమాణం : 48.5×3.5 సెం.మీ. పత్రపంక్తులు : 7

**విశేషాంశములు :**

గ్రంథము క్రిమి దష్టమై యున్నది. అచ్చటచ్చట పత్రములు విరిగి యున్నవి. వ్రాత బాగున్నది.

ఈ ప్రతియందు బాల, సుందరకాండలు మల్లికార్జున భట్టు, అయోధ్య అరణ్య కాండలు భాస్కరుడు వ్రాసినట్లు గలదు.

అరణ్యకాండ తరువాత కిష్కింధకాండ యుండవలెను. కాని యీ ప్రతి యందు కిష్కింధకాండ లేదు. అరణ్యకాండ తరువాత సుందరకాండ గలదు.

2 వ నెంబరు గల పత్రము లోపించినది.

# భాస్కర రామాయణము

(బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర కాండలు)

## భాస్కరాదులు

ఆక్సెషన్ నెం : 4614 కాల్ నెం : టి 3-324
ప్రతి : తాళపత్రము; అసమగ్రము. పత్రములు : 267
ప్రతి పరిమాణము : 43×4 సెం మీ పత్రపంక్తులు : 5 నుండి 6

విశేషాంశములు :

ప్రతి విలేఖనము :

వర్తమాన వ్యవహారిక చాంద్రమాన విక్రమ నామసంవత్సర చైత్ర శుద్ధ ౧౧ గురువారం నాడు శ్రీ భాస్కర రామాయణం ఆరంభింపబడి స్వభాను నామ సంవత్సర అధిక జ్యేష్ఠ బహుళ ౧ శుక్రవారం వరకు వ్రాయుట జరిగెను.

మిక్కిలి క్రిమిదష్టము. గ్రంథము శిథిలావస్థలో నున్నది. అంతిగా గ్రంథ పాతము కలదు. కొన్ని పత్రములు అనగా, (93, 178, 179) పునరుక్తి గావింపబడినవి. 133, 156, 213 నెంబర్ల పత్రములు లోపించినవి సుమారు 5 పత్రములకు నెంబర్లువేసి లేవు. వ్రాయసకాని పేరు లేదు. వ్రాత దోషములు, ఛందోదోషములు, ప్రాస దోషములు మొ॥ అధికముగా గలవు.

ఇందు బాల, కిష్కింధ కాండలు మల్లికార్జున భట్టు విరచితములుగాను, అయోధ్య, అరణ్య సుందర కాండలు భాస్కరునిచే విరచితముగాను పేర్కొనబడినవి. బాలకాండ నుండి సుందరకాండ వరకు మాత్రమే కలదు.

# భాస్కర రామాయణము

(బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందరకాండలు)

## భాస్కరాదులు

ఆక్సెషన్ నెం : 3627 కాల్ నెం : టి 3-366
ప్రతి : తాళపత్రము ; అసమగ్రము. పత్రములు : 177
ప్రతిపరిమాణము : 38×3.5 సెం. మీ. పత్రపంక్తులు : 7

విశేషాంశములు :

ప్రతి విలేఖనము : విక్రమ నామ సంవత్సర ఆషాఢ శుద్ధ ౧౧ ఆదిత్యవాసరం సర్కి-
శ్రీ రామాయణం బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధా సుందరకాండలు పిండిప్రోలు
కామరాజు ఆవత్స వేంకట రామదాసు వ్రాసిన ప్రతి క్రమానను వ్రాసెను

గ్రంథము అచ్చటచ్చట క్రిమిదష్టమైయున్నది. గ్రంథపాతములు కలవు. ఇందు
29, 81, 98, 99. 115, 116, 174, 175, 176 మరియు 178 అను సంఖ్య
గల పత్రములులేవు. వ్రాత బాగుగానున్నది.

# భాస్కర రామాయణము

(బాల, అయోధ్య, అరణ్య కిష్కింధ, సుందరకాండలు.)

## భాస్కరాదులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3629 | కాల్ నెం | : టి 3-368 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 242 |
| ప్రతిపరిమాణము | : 46.5 × 3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 |

విశేషాంశములు :

గ్రంథము క్రిమిదష్టమై చాల శిథిలావస్థలో నున్నది. గ్రంథపాతములు కలవు. కొన్ని
పత్రములు విరిగియున్నవి. గ్రంథాది లేదు. ప్రతియందు మధ్య మధ్య పత్రములు
లోపించినవి. బాలకాండాది లేదు.

# భాస్కర రామాయణము

(అయోధ్య, అరణ్యకాండ పత్రములు.)

## భాస్కరాదులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3633 | కాల్ నెం | : టి 3-371 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 68 |
| ప్రతి పరిమాణము | : 38×3.5 సెం. మీ | పత్ర పంక్తులు | : 6 |

విశేషాంశములు :

ఇందు భాస్కర రామాయణమునకు సంబంధించిన అయోధ్య, అరణ్యకాండ పత్రములు గలవు. ఈ ప్రతి యందు సుమారు 68 పత్రములు గలవు. ఇందు 15,25,32 నుంచి 39, 45 నుంచి 50 మరియు 79 సంఖ్యగల పత్రములు లేవు. పత్రములు క్రిమి దష్టములై యున్నవి.

అయోధ్యకాండ ప్రారంభము కలదు. గాని ముగింపులేదు. అరణ్యకాండ ప్రథమాశ్వాస ప్రారంభములేదు. ముగింపు కలదు. అరణ్యకాండ ద్వితీయాశ్వాస ప్రారంభము కలదు కాని ముగింపు లేదు.

మొత్తంమీద ఈ తాళ పత్రములను భాస్కర రామాయణ గ్రంథముగా పరిగణించుట కంటె, అయోధ్య, అరణ్యకాండలకు సంబంధించిన పత్రములుగా పేర్కొనుట యే యుచితము.

# భాస్కర రామాయణము

(అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందరకాండలు)

## భాస్కరాదులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4019 | కాల్ నెం | : టి 8-385 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 184 |
| ప్రతిపరిమాణము | : 44×4 సెం. మీ. | పత్రపంక్తులు | : 8 నుండి 9 |

విశేషాంశములు

ప్రతివిలేఖనము : శక 1762న యాప్రవర్తమాన వ్యవహారిక చాంద్రమాన శార్వరి నామ సంవత్సర జ్యేష్ఠశుద్ధ ౧౦ యిందువారం వరకు అక్కి వెంకట నర్సు ప్రతిలో వున్న క్రమాన స్వార్థ పరార్థంగాను వ్రాసినాడు రామాయణం పుస్తకం అయిదుకాండలు సంపూర్ణం ॥

ప్రతి అలతిగా క్రిమిదష్ట. శైథిల్యములను పొందియున్నది. వ్రాత దోషములు తక్కువగా గలవు. వ్రాత స్పష్టత గలదు. గ్రంథాంతమందు అయిదు కాండలు సంపూర్ణ మని కలదు. కాని యీ ప్రతియందు నాలుగు కాండలు మాత్రమే కలవు. అవి యివి.

(1) అయోధ్య (2) అరణ్య (3) కిష్కింధ (4) సుందర కాండలు. ఈ గ్రంథము 52వ సంఖ్యగల పత్రముతో ప్రారంభమై యుండుటనుబట్టి మొదటి 51 పత్రము లందు బాలకాండయుండి యుండవచ్చును. అయోధ్య - కిష్కింధ - సుందరకాండ లను మల్లికార్జునభట్టు రచించినట్లుగను — అరణ్యకాండను భాస్కరుడు రచించినట్లు గను — ఆశ్వాసాంత గద్యలవలన తెలియుచున్నది. - అయోధ్య - కిష్కింధకాండలు సంపూర్ణముగాను - అరణ్య - సుందరకాండలు అసమగ్రములుగాను ఉన్నవి.

## భాస్కర రామాయణము

(అరణ్య, కిష్కింధ, సుందర కాండము)

### భాస్కరాదులు

అక్సెషన్ నెం : 3632 కాల్ నెం : టి 3-373

ప్రతి : తాళపత్రము; అసమగ్రము. పత్రములు : 169

ప్రతిపరిమాణము : 41 × 3.5 సెం. మీ. పత్రపంక్తులు : 7

**విశేషాంశములు :**

గ్రంథము నందలి ప్రతి పత్రము క్రిమిదష్టమై యున్నది. కొన్ని పత్రములు శిథిలా వస్థలో నున్నవి. ఇందు పెక్కు పత్రములు లోపించినవి.
ఇందు అరణ్య, కిష్కింధ సుందరకాండలు గలవు. అరణ్యకాండయందు పెక్కు పత్రములు లోపించినవి.

## భాస్కర రామాయణము

(సుందరకాండ)

### మల్లికార్జునభట్టు

అక్సెషన్‌నెం. : 4618 కాల్ నెం. : టి. 3—314

ప్రతి : తాళపత్రము; అసమగ్రము. పత్రములు : 71

ప్రతి పరిమాణము : 39×3.5 సెం.మీ. పత్రపంక్తులు : 5

విశేషాంశములు :

ప్రతి విలేఖనము : భావ నామ సంవత్సర ఆషాఢ ౮ ౧౦ జయవారాన గెంటె కూర్మనాయకులు వ్రాసిన సుందర కాండ॥

ఈ ప్రతి కొంత భాగము శిథిలమైనది. లిపి స్పష్టముగ నున్నది. కాని ప్రతి విలేఖనమున దోషములున్నవి.

# భాస్కర రామాయణము

(సుందర, యుద్ధ కాండములు)

## భాస్కరాదులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3295 | కాల్ నెం. | : టి 3-312 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 214 |
| ప్రతిపరిమాణము | : 40×3.5 సెం. మీ. | పత్రపంక్తులు | : 5 నుండి 10 |

విశేషాంశములు :

ప్రతి విలేఖనము : "శాలివాహనశక గతవర్షంబులు ౧౭౭౧ కాగాను అగునేటి వర్తమాన వ్యవహారిక చాంద్రమాన సౌమ్య నామ సంవత్సర వైశాఖ బహుళ ౩ గురువారము సరికి పూర్వప్రతినున్న క్రమాన పోతుల ప్రాతినాయుడు కుమాళ్ళు పెదరాజినాయుడు ఆత్మార్థం ఆచంద్రార్కంగా చదువుకోగలందులకు శ్రీ భాస్కరరామాయణం యుద్ధకాండ సంపూర్ణంగా వ్రాసుకొనెను.

ఈ రెండాశ్వాసములయందు శైథిల్యములు లేవు. వ్రాత తిన్ననిది. సుందరకాండ మల్లికార్జునభట్టు యుద్ధకాండ అయ్యలార్యుడు వ్రాసినట్లుగా ఈ గ్రంథాంత గద్యలలో పేర్కొనబడియున్నది.

# భాస్కర రామాయణము

(సుందర - యుద్ధ కాండలు)

## భాస్కరాదులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 4616 | కాల్ నెం | : టి 3-318 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము, | పత్రములు | : 221 |
| ప్రతిపరిమాణము | : 43.5×3.5 సెం.మీ | పత్రపంక్తులు | : 6 నుండి 7 |

విశేషాంశములు :

ప్రతి స్వల్పముగా క్రిమి దష్టమైనది. అటనట కొన్ని పత్రములు విరిగిపోయినవి. మరికొన్ని పత్రములు లోపించినవి. లిపి స్పష్టము. ఇందలి రెండు కాండలును అసమగ్రమె.

# భాస్కర రామాయణము

(యుద్ధకాండ)

## అయ్యలార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 3636 | కాల్ నెం | : టి 3-374 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 179 |
| ప్రతిపరిమాణము | : 51×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 |

విశేషాంశములు :

ప్రతి విలేఖనము : పార్థివ నామసంవత్సర కార్తీక శుద్ధ ౧౧ భానువాసరం వర్కు-శ్రీ పెండ్రపోలు లక్ష్మీపతిగారి కుమార్డు కామరాజు ప్రతులనున్న ప్రకారముగా యుద్ధ కాండ సంపూర్ణముగా వ్రాసెను.

గ్రంథము అచ్చటచ్చట క్రిమిదష్టమైయున్నది. వ్రాత బాగుగా నున్నది.

# భాస్కర రామాయణము

(యుద్ధకాండ)

## అయ్యలార్యుడు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : | 3637 | కాల్ నెం | : | టి 3-375 |
| ప్రతి | : | తాళపత్రము ; అసమగ్రము. | పత్రములు | : | 282 |
| ప్రతి పరిమాణము | : | 47×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : | 6 |

**విశేషాంశములు :**

గ్రంథ విలేఖనము : "వికారి నామ సంవత్సర శ్రావణ బహుళ ౧౧ జయవారం....... సర్కి మట్టువల్లి చలమయ్యగారి యుద్ధకాండ ప్రకారము రాగ్ర శల్కరయ్య శ్రీరామా ర్పితముగా వ్రాసెను.

గ్రంథము క్రిమిదష్టమైయున్నది. కొన్ని పత్రముల ఎడమ భాగములు, మధ్యభాగము కూడ లోపించినవి. కొన్ని పత్రములు సగ భాగమేకలవు. గ్రంథముయొక్క ఆద్యం తములు కలవు కాని కొన్ని పత్రముల ఆద్యంతములులేవు. అందుచే క్రమనిర్మాణము కష్టము.

# భాస్కర రామాయణము

(యుద్ధకాండ)

## అయ్యలార్యుడు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : | 4020 | కాల్ నెం | : | టి 3-386 |
| ప్రతి | : | తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : | 228 |
| ప్రతిపరిమాణము | : | 49×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : | 7 |

**విశేషాంశములు :**

గ్రంథాంతములేదు. గ్రంథాది క్రిమిదష్టమగుటయేగాక శిథిలము కూడనైనది. మధ్య కొన్ని పత్రములుకూడ లోపించినవి. వ్రాత దోషములు కలవు.

# భాస్కర రామాయణము

(యుద్ధకాండ)

## అయ్యలార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 743 | కాల్ నెం | : టి 3-323 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 286 |
| ప్రతిపరిమాణము | : 41×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 6నుండి 7 |

విశేషాంశములు :

ఈ ప్రతి యందు యుద్ధకాండలోని ఆద్యంతములు లేవు. గ్రంథ మటనట క్రిమిదష్టము. కొన్ని పత్రములు మిక్కిలి శిథిలములు. కొన్ని పత్రములు లోపించినవి. వ్రాత దోషములు కలవు. ఆశ్వాసాంతగద్య పత్రము లోపించినది.

# భాస్కర రామాయణము

(యుద్ధకాండ)

## అయ్యలార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 698 | కాల్ నెం. | : టి. 3-315 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 87 |
| ప్రతి పరిమాణము | : 40.5×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 10నుండి 13 |

విశేషాంశములు :

ఈ ప్రతి యందు యుద్ధకాండలోని ఆద్యంతములు లేవు. ప్రతి క్రిమిదష్టమై శిథిలావస్థలో నున్నది. ప్రతి నలుపురంగునకు దిరిగినది. అటనట కొన్ని పత్రములు లోపించినవి. ఆశ్వాసాంతగద్య పత్రముకూడలేదు. లిపి యస్పష్టము. వ్రాతదోషములు కలవు.

# భాస్కర రామాయణము

(యుద్ధకాండ)

## అయ్యలార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 5642 | కాల్ నెం. | : టి. 3-320 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 94 |
| ప్రతిపరిమాణము | : 44×4 సెం. మీ. | పత్రపంక్తులు | : 4 నుండి 6 |

విశేషాంశములు :

ఈ ప్రతియందు యుద్ధకాండ ప్రారంభముకాని, ముగింపుకాని లేదు. మధ్య మధ్య కొన్ని పత్రములు లోపించినవి. ప్రతి యటనట క్రిమిదష్టమైనది. వ్రాతదోషములు కలవు. ఆశ్వాసాంత గద్య పత్రము లోపించినది.

# భాస్కర రామాయణము

## భాస్కరాదులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం. | : 420 | కాల్ నెం. | : టి3-317 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 187 |
| ప్రతిపరిమాణము | : 45.5×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 |

విశేషాంశములు :

ప్రతివిలేఖనము — పార్థివనామ సంవత్సర ఆశాఢ బహుళ దశమి.

ఈ గ్రంథ మందలి పత్రము లన్నియు ఎడమ భాగమున శిథిలమై యుండుటచే సంఖ్యా క్రమము లోపించినది. గ్రంథము నందలి యధికభాగము లుప్తము. ఈ ప్రతి ఆరు కాండలకు సంబంధించిన పత్రములతో కూడుకొని యున్నది.

# భువన మోహినీ విలాసము

## పెనగల్లూరి వేంకటాద్రి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 6149 | కాల్ నెం | : టి 3—623 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము. | పత్రములు | : 33 |
| పరిమాణము | : 23×3 సెం.మీ | పత్ర పంక్తులు | : 6 నుండి 7 వరకు |

ప్రారంభము :

శ్రీరమణీకు సంచిత కృపావేశు ధారాధరశ్యాము దైత్యహృద్భీము
....ర్చిత కమనీయ పాదు గంగాపురాధాము కమనీయనాము

చెన్నరాయ ... ... ... ... పన్నగాభరణు సద్భక్తి భావించి
సారసభవు నెంచి ... ... ... గారాముసతి రమాకాంత సేవించి
శాంకరి వినుతించి శార ... ... ... ... ...

... .. ... ... కేలియై వేంకటగిరి నాయకునకు
అనఘ శీలునకు సమర్పితంబుగను ఎనయంగ భువనమోహిని విలాసాఖ్య
బరగు శృంగార ప్రబంధ ర ... కరమర్థి జేతు తత్కథ యెట్టిదనిన
శ్రీకర కాంచనాంచిత గోపురముల పాకభిద్రత్న కుంభగవాక్షముల
సలలిత శశికాంత చంద్రశా ... లను అలఘు రత్నాశ్మ సమ్యక్కవాటముల
తులలేని పచ్చరా తోరణంబులను తెలిపైన క్రొత్తముత్యంపు ముగ్గులను
వరవజ్ర నిర్మిత వప్రభాగముల సరిలేని పచ్చరాట్దీప? వేదికల
వివిధ వస్తువు లొప్పు విపణి మార్గముల తవణించు .... నటన్న రతులను

ముగింపు :

మానిత మంజీర మండనకోటి మానిమాని రవంబు మండితయై? చెలగ
లజ్జ వీడ్వడరాదు లలనకు విభుని నుజ్జగించగరాదు నుచిత వర్తనల
నారీజనంబు లిల్లిల్లనల్లనను? కేళికా సదనంబు కేరుచు నోర్చి
చెలులు మిక్కిలి బల్మిచేసి పిల్చినను నెలత శయ్యకు రాక నెరిసిగ్గుదోప
తలుపు చాటుగ గొంచు తరు ... ... ... ... ...

విశేషాంశములు :

ఇది ద్విపద కావ్యము. గ్రంథాదియున్నను గ్రంథాంతము, మధ్యకొన్ని పత్రములు లోపించినవి. కొన్ని తునకలై యున్నవి. ప్రతి ఎరుపు దిరిగినది. శిథిలావస్థకు చేరుచున్నది. లిపి స్పష్టమే కాని లేఖన దోషములు కలవు.

## భోజరాజీయము

### అనంతామాత్యుడు

| | | | |
|---|---|---|---|
| అక్సేషన్ నెం | : 479 | కాల్ నెం | : టి 3-117 |
| ప్రతి | : కాగితము ; అసమగ్రము. | పుటలు | : 122 |
| ప్రతిపరిమాణము | : 50×4 సెం.మీ. | పత్ర పంక్తులు | : 5 నుండి |

ప్రారంభము :

ఉ. శ్రీరమణీ పయోధర పరిస్ఫుట కుంకుమ ఫాలభాగ క
స్తూరి గరిష్ఠకేళి గతి శోభితభంగి నురంబు నందు బ్ర
స్ఫారిత రత్నలాంఛన విభాయుగళంబు దలిర్ప నొప్పు ల
క్ష్మీ రమణుం డహోబలనృసింహుడు మాకు బ్ర ... ...

చ. ... ... లుద్భవించిన విశుద్ధ గృహంబు లసంగజాతి వా
క్ప్రతికి నివాస భూములనగా దగి యెవ్వని మోముదమ్ము లం
చిత గతి నొప్పునట్టి సరసీరుహసంభవు డిచ్చుగాత మ
త్కృతికి జిరాయువున్ వినుత కీర్తియు సజ్జన రంజకత్వమున్.

చ॥ ఒకదెస మాతృభావమును నొక్కదెసం బితృభావమున్ సమాం
శకముగ దాల్చి యోగిజన సంతతి గన్గొను నంతరంగదృ
ష్టికి గురియై తపస్సులకు చేరువచుట్ట మనంగ భక్తరా
శికి నరచేతి సొమ్మగు శశిస్ఫుట మౌళి దలంతు శంకరున్.

వ. తదనంతరంబ భోజననిమిత్తంబున భోజసర్వజ్ఞులకు నిరువురకు నైన సంవాద వశం
బున వివిధపుణ్యకథా ప్రసంగంబులు పుట్టుటయు నను వృత్తాంతంబులుం గలిగి యుక్కా
వ్యంబు సర్వజనాకర్ణనీయంబై భోజరాజీయం బను పేరం బరగు తత్ప్రారంభం బెట్టి
దనిన.

క. మహిత సముజ్వల తేజుడు విహితాచారైక రతుడు వీరవినోద
స్పృహుడు బహుకార్యదక్షుడు మహుడను కాంభోజరాజు మహి గడునొప్పెన్.

ముగింపు :

క. నెట్టన భోజుని కడుపున బుట్టిన పుత్రుకట యవ్విభుని చారిత్రం
బిట్టి దననేల పులికిం బుట్టిన కూన యటు వెండి పులు ... ... ...

చ. అవనికి జందనంపు ... ... పయోధికి ఫేన చిహ్న వృ
క్షవితతికిన్ బ్రసూనతతి శైలచయంబులకున్ సితాభ్రగౌ
రవ ముడువీథికి న్సురతరంగిణివెల్లి యనంగనొప్పు భూ
భువనబిడౌజుడైన నవభోజునికీర్తి మనోజ్ఞమూర్తియై.

ఉ. ఆతడ గాంచె బుత్రుల ననం ...ఘ్యుల దత్తనూజులన్
జాతిగ గాంచి రాత్మజుల జాతయశస్కుల వారలం దనూ
జాతుల గాంచి రున్నత యశస్కుల నీక్రియ భోజవంశ మ
త్యాయతకీర్తి నొప్పె భరతాన్వయ సన్నిభమై జగంబునన్.

క. ఈ భోజరాజచరిత ... ..భువన ... స్పదమై
శోభిల్లు నధికతేజో లాభంబుల నిచ్చు శ్రోతలకు పక్తలకున్.

వ. అని భోజరాజీయంబు నెయ్యంబున నాద్యంతంబు నత్యంత హృద్యంబుగా నుపన్యసించి.

సీ. అత్రి పుత్రుండు పవిత్ర చరి ... ... ... ...
దజ్ఞానదూరు దతిజ్ఞానసారు దంతర్వేది విదళనాఖర్వబలుడు
చిరతరాయుష్మంతు డురుతరస్వాంతు డ ష్టాంగయోగ ప్రియాసంగతుండు
లక్ష్మీనివాసుండు లక్ష్మీ నివాసుండు నిఖిలా ... ...

**విశేషాంశములు :**

ఇదేడాశ్వాసముల గ్రంథము. ఇందు భోజచరిత్ర సూత్రకథ పుష్పగంధికథ గోవ్యాఘ్రములకథ మదనరేఖ కథ, పావకలోచనికథ, అన్నదాన విప్రుని కథ, వ్యాధునికథ, మావిగవానికథ మున్నగునవి ఉప కథలు.

ఈ ప్రతియం దేడాశ్వాసములు కలవు. కాని అచటచట కొన్ని పత్రములు నష్టమైనవి. షష్ఠాశ్వాసాంతమున 8 పత్రములు సప్తమాశ్వాసాంతమున 7 పత్రములు మొత్తము 15 పత్రముల వరకు నష్టమై యుండవచ్చును.

ప్రతివిలేఖనమున చాలదోషములు గలవు. అచటచట ప్రతివిలేఖరి కొన్ని కొన్ని పద్యములు లభించక కొన్ని పాదములు లభించక ఖాళీస్థలములు వదలిపెట్టెను. లిపి స్పష్టము ప్రతి క్రిమిదష్టమై శిథిలావస్థలో నున్నది.

## మదనసాయక విలాసము

### సోమలింగకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషను నెం | : 5588 | కాల్ నెం | : టి 3-169 |
| ప్రతి | : కాగితము, అసమగ్రము. | పత్రములు | : 144 |
| ప్రతి పరిమాణము | : 27×25 సెం.మీ. | పత్రపంక్తులు | : 20 |

ప్రారంభము :

క॥ శ్రీ గిరిజా సత్కుచలిప్తాగురు కాశ్మీర చందనాంకిత వక్షో
భాగ ప్రాగల్భ్యుం డగు శ్రీగిరిమల్లేశు నాత్మ జింతింతు నొగిన్.

సీ॥ అలరు మున్నీటిలోపల దాగు బిగ్గట్టు తం(డియే తం(డియై దగిన దాన
వంపు మోపరిమేలిగలుగు తూటువరేని పడగలె గొడుగులై బరగు వెలది
తిగసిరి దొరలు ప్రోల్కొగనేలు వేలుపు తమ్ముడే తమ్ముడై దనరు మిన్న
నట్టువపక్కి పేరుట్టె బల్కొదుషా కన్నులే కన్నులు గల్గు గుమ్మ

గీ॥ జముని గుజ్జుపురేమసత్డ్డిపోతు(?) నే పణంగించి జగములనెల్ల బ్రోచు
జమిలి ముక్కాలి పేర్గల చామ నెదను సదలని ముదంబుతోడ నెప్పుడు దలంతు.

ఆ. వె. అర్పణం బొనర్చె యధికసంతోష సం భరిత చిత్త పద్మభాసి నగుచు
జేయబూను మదన సాయక సువిలాస మన్న కథ తెరంగు విన్నవింతు.

తే॥గీ॥ కైకవరమున దశరథ కాశ్యపీ శు వచనమున రాము డవనిజ వామనేత్రి
లక్ష్మణుడు గొల్వ దండకారణ్యమునకు జనియె జడదారు లగుచు నశంకతోడ.

ముగింపు :

సీ॥ త్రిదివరాజ్యాధిపతి నికాయ సాన్నిధ్య శుభపారిజాత ప్రసూన మనగ
ప్రాచీమదేభకుంభాభ్యంతరాళకుం భత్పృణిభాంకిత వజ్రపట్ట మనగ
తారాపదాంబుజాత దృగంచలా కర సంభృత సితసారసం బనంగ
వారిదస్వాస్థానమంటపాంతరవజ్ర పంజరస్థిత సితపక్షి మనఁగ
తిమిరఫల భుక్కళేబర స్థిరతభూత హరణ కృత్కాల కమలాక్ష కరవిభాస
చక్ర మనదగి తోచె నిర్వక్రు డగుచు సుందరకరుండు నొ నిండు చందురుండు.

విశేషాంశములు :

ఈ ప్రతియందు మొదటి మూడాశ్వాసములు పూర్తిగను, నాల్గవ ఆశ్వాసము కొంత వరకు (4. పేజీలు)మాత్రమే కలదు. కవి యీ కావ్యమును మల్లికార్జునున కంకిత మొసంగెను.

ప్రతి బాగున్నది. లిపి స్పష్టము. దోషములు స్వల్పముగ గలవు.

# మధురమంగా పుంశ్చలీ లీలావిలాసము

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 5539 | కాల్ నెం | : టి 3-20 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 218 |
| ప్రతిపరిమాణము | : 28.5×23.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 20 |

ప్రారంభము :

...... నిజస్వామి మంగమ తదీయస్వామియైన రాచులసేపుని చరితలనె సంతత కాలక్షేపంబు చేయంబడుచున్నదను. ......... బను ఇటు వలికి తని కాలక్షేపం బవుచున్నదని వినెడు వారికిని యవునె. ఉచితమగునే యని అచ్చుమెచ్చునుం గావున నీవును ఇతం...... వంబుగా రచించమించిన పంచాశద్ద్విగుణ కథా విధానంబున నొప్పు వచనకావ్యంబు దివ్యంబు తత్సంగ్రహంబు హృదయ పుస్తకంబు గావించి ప్రత్యూహమును వినుపించు మన్న యన్నా యన్నా చేయరా, ఇట్టి కవితలను రచించే మంచివాడ వవుదువె అని నా యున్నతావుకు వచ్చి నన్ను కౌగిటగుచ్చి మంచి మచ్చికమాటలు బుజ్జగించి నాచేత కొన్ని దినంబు లెంతో వాచో విధేయంబుగా అనెగొంది చినవెంగమరాయ చారిత్రోపదంశయుక్త మధురమంగాపుంశ్చలి లీలావిలాస సం... శ్రోత్ర దధ్యన్న పాథేయం బను కథాకావ్యంబు పాఠంబు చేసి తత్సభ ఒన మొక కథగా వినుపించి మెప్పించె. తత్ప్రకారం బెట్టిదనిన. మాళవప్రభు పూజిత ....దినంబున పెద్దకొలువున మాళవరాయల .....బ బలాదేవి సుఖమై చేతులుమొగిడ్చి చెప్పే ప్రకారం బెటువలె॥

మొదటికథ.

కున్నమళవ లక్ష్మణ మళవరంగేంద్రు నిలువేల్పు టుప్పిలాదేవి పరాకు చిత్తావధానంబున విన నవధరించవలె మజా. లోనొక గొంద్లో నున్న అనె గొందిలోనున్న తమపెద్దలు పెద్దకాలంబు వెనకటికి నడచిన నడవడి, ఏమి తాము ఈ తెరంగున శతంబిష్మ అని పదిలో పదకుండు అని అప్రసిద్ధంబుగా నుండేదేమి. అదిగాదు "నసాహస మనారుహ్య నరో భద్రాణి పశ్యతి" అనితొల్లి విక్రమార్కుండు సాహసంబుజేసి అందుచేతనే అనేక కార్యాలెల్ల సాధించినాడు, ఇప్పుడున్న తాను ఊరక యుండేది అప్రయోజకము. సాహసం చేతనే అధిక లాభములను బడయవలెను. అందుచేతను జయమాయెనా ఇచ్చించినట్టి కార్యములెల్ల చేగూడుచున్నది. లేదా "యత్నేకృతే యది నసిద్ధ్యతి కోఽత్ర దోషః" అందునుంచి హాని వచ్చెనా సాహసం

మీద ఇట్లావచ్చె నని పద్దయినా నిలిచియుండునే "ఏనకే నాప్యుపాయేన ప్రసిద్ధః పురుషో భవేత్ ఘటంభింద్యాత్ పటంభింద్యాత్ కుర్యాద్వా గార్దభస్వనమ్" అన్నా దనిన్ని సాహసములో ఏవగలోను సాహసం చేతామని యోచించు తరిని. లోకంలో శృంగారం అనేది మహాసొగసు, ముందుగా శృంగారరసంలో సాహసం చేసిచూతాం యిదిలేస్నా దక్కి ఎంచినట్లెల్లా సాధ్యమౌచూ వచ్చి అపాయాలున్ను లేక కొనసాగి జితమాయెనా ఆమీద మరొక మెట్టుకు ఎక్కుదాం మరొక పగసాహసాన్ని నిల్చి ఆరంభాన్నె కఠిన ప్రయాసల పడేందుకంటె కడవెడు అన్నం వండియుండు పాక విమర్శకు ఒకమెదుకు పట్టి చూచినట్టు....

ముగింపు :

వాడితోనే రహస్యకార్య ప్రవర్తనకూ అదే క్రమంగా రాజుకునూ మరియితరులను కూడా నెరమాన్య కార్యాంతరంగాల మెలగించ సాగగా వక టరతేప చెప్పచూచినా నీకు యింతకు పనేమి దయచేసి... కూర్చుకుంటే నీచేత అయ్యేట్టు నీవు చేతసాగిన మాత్ర అంతరంగకార్యాల్ను మెలగుచుండు వారివారి త్రాణ ప్రాణలు మాకు తెలియ నివా మాకు లేని తీట నీకు వచ్చిందా! మాతెప్పలు మాఅక్కరలు మాకేతెలుసును కాగా యోగ్యమైన వారిగా యింకనూ రారు గురినైనా చేర్చిన తలంచుకునేను అని అదరవేయగా అంతట మాకేలనని తాను "సమానానా ముత్తమ శ్లోకో" అస్తు అని మెలగేదే మాకుచాలును మాకు యీ దురభిమానమే అని తన్ను పిలిచి యోచించి నడపించవలెనన్న గుహ్య కార్యంబులలో తనశక్తి ఉత్సాహయుక్తులకు తగినట్లెల్లా పుట్టిగా నిర్వంచనగా భారం వహించి తన భారం వారిపై బెట్టు పొరచూపులేక నడచు కొంచూ ఉండెనే అందరూ ఆఆ రీతులనే మెలగసాగిరి గనక కనకవట్టివారు అందర్ని ...... సుబుద్ధిని బాహ్యాంతరంగమున దేహము మానాభిమానములనే వారితో ఉన్నట్టు చేసి వారికిసౌఖ్యం కల్గచేసి...నూ ఆనందమందు తెప్పతేలుచూ కోరినట్లెల్లా భోగ భాగ్యముల ననుభవింపుచూ సుఖాన ఉన్నవాడు అనివ్రాసి అంపిన దినచరి రాయల దేవుడు విని......... రాజ్యభారం చేసి...... సంతసమంది నారు గనుక ముందర..... అపునని వ్రాసినందుకు......

విశేషాంశములు :

కాగితపు ప్రతి. సమగ్రముగా నున్నట్లు తోచుచున్నది. వ్రాత స్పష్టత కలదు. వ్రాత దోషములు అధికముగా గలవు. తంజావూరు నాయకరాజుల కాలము నాడు వెలసిన గ్రంథముగా తలంచుట కవకాశముకలదు. నీచ శృంగారం వర్ణింపబడినది. అశ్లీలపదముల కిందుస్థానము లభించినది.

గ్రంథానంతరము :-

"సుమారు 34 పేజీలలో మధురమంగా పుంశ్చలీ-లీలావిలాస గద్యకావ్యామే గేయ రూపకంగా వ్రాయబడింది. ఈ గేయరూపకంలో కూడ పెక్కు అశ్లీల పదముల ప్రయోగ మెక్కువగా కనబడుచున్నది.

# మనుచరిత్ర

## అల్లసాని పెద్దన

| | | | | |
|---|---|---|---|---|
| అక్సెషన్ నెం | : | 549 | కాల్ నెం | : టి 3-114 |
| ప్రతి | : | తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 150 |
| ప్రతిపరిమాణము | : | 30.5×3 సెం. మీ. | పత్రపంక్తులు | : 4నుండి 5 |

ప్రారంభము :

శ్రీవక్షోజ కురంగనాభ మెదపై చెన్నొందు విశ్వంభరా
దేవిం దత్కమలా సమీపమున బ్రీతిన్నిల్పినాడో యనం
గా వందారు సనందనాది నిజభక్తశ్రేణికిన్ బొల్చు రా
జీవాంశుండు కృతార్థు జేయు శుభదృష్టిం కృష్ణరాయాధిపున్!

ఉ. ఉల్లమునందు నక్కటిక మూనుట మీ కులమందు గంటి మం
చల్లన మేలమాడు నచలాత్మజ మాటకు లెంత నవ్వు సం
ధిల్ల కిరీటి పాశుపత దివ్య శరాఢ్యునిజేయు శాంబరీ
భిల్లుడు కృష్ణరాయ నీ కభీష్టశుభప్రతిపాది గావుతన్!

వ. అభ్యుదయ పరంపరాభి వృద్ధిగా నా యొనర్పం బూనిన స్వారోచిష మనుచరిత్రంబునకు కథాక్రమం బెట్టిదనిన జైమిని ముని స్వాయంభువ కథాశ్రవణా నంతరంబున మీద నెవ్వండు మనువయ్యె నెరిగించు మనవుడు పక్షులు మార్కండేయుండు క్రోష్టికి చెప్పిన ప్రకారంబున నిట్లని చెప్పదొడంగె.

మ. వరుణాద్వీపవతీ తటాంచలమునన్ వప్రస్థలీ చుంబితాం
బరమై సౌధసుధా ప్రభాధవళితప్రాలేయ రుగ్మండలీ

హరిణంబై యరుణాస్పదమనంగ నార్యావర్త దేశంబునన్
పురమొప్పున్ మహి కంఠహార తరళస్ఫూర్తిన్ విడంబింపుచున్

సీ. అచటి విప్రులు మెచ్చరఖిల విద్యాప్రౌఢి ముదిమది దప్పిన మొదలివేల్పు
నచటి రాజులు బంటు నంపి భార్గవునైన బింకాన బిలుపింతు రంకమునకు
నచటి మేటికిరాటుల లకాధిపతినైన ననుసరించి మొదలిచ్చి మనుపదక్షు
లచటి నాలువజాతి హలముఖాత్త విభూతి నాదిభిక్షువు భైక్షమైన మాన్పు
తే.గీ. నచటి వెలయాండ్రు రంభాదులైన నొరయ కాశకొంగున వారించి కడ్వగలరు
వాట్యరేఖా కళాధురంధర నిరూఢి నచట బుట్టిన చిగురు కొమ్మైనజేవ.
ఉ. ఆ పురి బాయకుండు మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి భా
షాపర శేషభోగి వివిధాధ్వర నిర్మల ధర్మ కర్మదీ
క్షా పరతంత్రు డంబురుహ గర్భకులాభరణం బనారతా
ధ్యాపన తత్పరుండు ప్రవరాఖ్యు డలేఖ్య తనూవిలాసుడై.

ముగింపు :

శా. వ్యాయామ స్థిర సంధి బంధ కటకాద్యత్యాను గశ్రోణిభృ
త్కా యగ్రావభిదావిధాభి దురదోఃఖడాగ్ర యుగ్రావల
జ్జాయ త్కీర్తిభర ప్రపంచ వరపంచారామ రామామణీ
గేయా మేయ జయాంక పంకజ దృగంగీకార ధీరాకృతీ

క. కాంతా లతాంత శరజన కాంతిక భక్తి ప్రతోషితాంభోధి సుతా
కాంతా ప్రతాప ర వి కాంతాయిత విమత నృపతి కాంతా హృదయా

వనమయూరవృత్తం :

రాజపరమేశ ఫణిరాజ బలపుల్లాం భో ముఖ భోజముఖ భూ ప విపులాంసో
త్తే జిత ధరా భరణ దీక్షిత భుజా ని ర్వ్యాజ భయ జి జివిజి తారినృప రాజీ!

గద్య :

ఇది శ్రీ మదాంధ్ర కవితాపితామహ ముఖాంక పంకజాక్ష పాదాంబుజాధీన మాన
సేందిందిర నందవర పురవంశోత్తంస.. శఠకోపతాపస ప్రసాదిత కవితామతల్లి
అల్లసాని చొక్కయామాత్య పుత్ర పెద్దనార్య ప్రణీతంబైన స్వారోచిష మనుచరిత్రం
బను మహాప్రబంధంబునందు షష్ఠమాశ్వాసము.

విశేషాంశములు :

ప్రతివిలేఖనము :

హేవళంబినామ సంవత్సర వైశాఖ బహుళనయన జయతిధి యందు తిమ్మనార్యుడు వ్రాసెను.
క్రిమిదష్టము గ్రంథశైధిల్యము కలదు. వ్రాత బాగుగానున్నది. 6 ఆశ్వాసములు గలవు. శ్రీకృష్ణదేవరాయల కంకితము.

# మనుచరిత్ర

## అల్లసాని పెద్దన

| | | | | |
|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4638 | కాల్ నెం | : | టి 3-49 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : | 46 |
| ప్రతిపరిమాణము | : 47.5×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : | 7 |

విశేషాంశములు :

ప్రతి మిక్కిలి క్రిమిదష్టమైనది. శిథిలావస్థలో నున్నది. పెక్కుపత్రములు శిథిలములైనవి. ప్రతిని బాగుగా పరిశీలించుటకు వీలుగాలేని స్థితిలో నున్నది.

# మనుచరిత్ర

(టీకాసహితము)

## అల్లసాని పెద్దన

| | | | | |
|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4055 | కాల్ నెం | : | టి 3-297 |
| ప్రతి | : కాగితము, అసమగ్రము. | పత్రములు | : | 76 |
| ప్రతిపరిమాణము | : 13.5×21.5 సెం. మీ. | పత్రపంక్తులు | : | 25 |

ప్రారంభము :

చిన్ని జాబిల్లిచే = బాలచంద్రునిచేత, సింధూర తిలకంబు = సింధూరమను రంజక ద్రవ్యపు చుక్కబొట్టు, చెమ్మగిల్లన్ = ద్రవించుచుండగ, అవతంస కుసుమంబు నందున్న = చెవిని విలాసార్థముగా ధరించిన పుష్పమందున్న, ఎలదేటి = కొదమ తుమ్మెద, రుతి = నాదము, కించిత్ = కొంచెముగ, అంచితి = ఒప్పుచుండెడు, శ్రుతులన్ = శ్రుతులను, ఈనన్ = కల్పించుచుండగ, ఘనమైన = అధికమైన, రారాపు = జరయికగల, చనుదోయి = కుచద్వయముయొక్క, రాయిడిన్ = రాపోటు చేత, తుంబీఫలంబు = వీణ కమర్చిన తుంబకాయ (సొరకాయ) తుండుకు జెందన్ = తొట్రుపడుచుండగ, తరుణాంగుళిచ్ఛాయన్ = కోమలములై యొప్పుని వేళ్ళ యొక్క కాంతిచేత, దండపుసరకట్టులు, ఇంగిలీకపు = హింగుళీయను రంజన ద్రవ్యముయొక్క. వింతరంగులు = చోద్యమైన ఎఱ్ఱని వన్నెలు, ఈన = కను చుండగ, ఉపనిషత్తులు = నిగమాంతములు, బోటులై = చెలికత్తియలై, ఓల గింపన్ = పరివేష్టింపగ, పుండరీకాసనమునన్ = తెల్లి దామర గద్దియ మీద, కూర్చుండి = ఉపవిష్టయై, మదికిన్ = మనస్సునకు, నించువేడుకన్ = నిండింపు చున్న యుల్లాసముచేత, వీణన్ = వల్లకిని, వాయించు చెలువ = వాయించుచుండు సౌందర్యవతియైన, నలువరాణి = బ్రహ్మకు భార్యయైన సరస్వతి, మదాత్మలోన్:- మత్ = నాయొక్క, ఆత్మలోన్ = మనస్సునందు, వెలయుంగాక = నిలిచి యుండునుగాక.

ముగింపు :

వ. అది యట్లుండె వినుము గృహస్థరత్నంబ లంబమాన రవిరథ తురంగ శృంగారచారు చామరచ్ఛటా ప్రేక్షణ క్షణోద్గ్రీవ చమర సముదయం బగు నుదయంబునంగల విశే షంబులు శేషఫణికినైన లెక్కింప శక్యంబె యంధకరిపు గంధరావాస వాసుకి వియోగ భవ దుర్వ్యథా భోగ భోగినీ భోగభాగ పరివేష్టిత పటీర విటపి వాటికావేల్ల దేలాలతా మయంబగు మలయంబునంగల చలువకు విలువ యెయ్యది.

* * *

అస్తంబునంగల = అస్తాద్రియందు గలిగిన, మణిప్రస్తరంబుల = రత్నరూపములైన పాషాణంబులయందలి, విశ్రాంతి = విశ్రమించి, చింతించినన్ = తలంచుకొనగ, మేనన్ = శరీరమందు, పులకలు = రోమాంచములు, ఇపుడున్ బొడమెడున్ = ఇపుడుగూడ బొడమరించు చున్నవి, స్వస్వప్రవర్షిత = తమ తమ చేత వృద్ధిబొం దింపబడినవై, వర్షిష్ఠ = పెరుగుచున్నట్టి, ధరణీరుహ సందోహ = వృక్ష సమూహ ముల యొక్క,

విశేషాంశములు :

వ్రాత చక్కనిది. వ్రాతదోషము లంతగాలేవు. ఇందు ప్రథమాశ్వాసములోని కొన్ని గద్య పద్యములు టీకా సహితముగా (౯ వ పద్యము నుండి 72 వ వచనము వరకు) కలవు. ప్రతికి ఆద్యంతములు లేక పోవడం వల్ల టీకాకారుని పేరుగాని, ప్రతివిలేఖన కాలము గాని, వ్రాయసకాని పేరు గాని తెలియడము లేదు.

# మహేంద్రి యాత్రి

## ఉరిటి రామమూర్తి

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : ౩౬౮౨ | కాల్ నెం | : బి ౩-౨౬౩ |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 79 |
| ప్రతిపరిమాణము | : 20×౩౯ సెం.మీ. | పత్రపంక్తులు | : ౩2 |

ప్రారంభము :-

ఉ. శ్రీరఘురామ చారుసరసీరుహ సన్నిభ పాద యుగ్మమున్
గోరి భజించి లోకములకు న్శుభ మెప్పుడు గూర్చుతల్లి సీ
తారమణీలలామ పదతామరసమ్ముల గొల్తు సత్కృపా
సారము నాపయి న్జిలికి సంతతము న్నను బ్రోచు చింతచేన్.

కం. నా కార్యంబుల విఘ్నము చేకూఱని భంగి నన్నుఁ జేకొని కావన్
శ్రీకంఠసుతుని గణపతి వాకొనెదన్ విపులభక్తి వారణముఖునిన్.

కం. తొలివేల్పురాణి విద్దెల వలతి దయాపూర్ణమతి ధవళనేత్రి మదిన్
దలతును నాదగువాక్కున నిలిచి మృదులభంగిఁ బలుక నేర్పు మటంచున్.

గీ. శ్రీ కరావ్యక్త మాధుర్య సేచకమగు పాట గోకిలాంబ వసంతబాలు బ్రీతి
నిదుర సేయించ జతనంబు నెరపుచుండె గ్రీష్మ ఢంఢంఢ బొంచిరా గెలసమూనె.

గీ. అమ్మహేంద్ర నగంబు గ్రీష్మాగమమున బధ్యమగుటను సతితోడ బయన మయ్యె
నచటి విఖ్యాత శృంగార రచిత ప్రకృతి చిత్రముల జూడ వేసంగి చెయిదమార్చ
విలియ "మాస్వాల్డు న్యూకాము" విశదమతిని.

కం. ఇమ్మగ గ్రీస్తుశకపు బం దొమ్మిది వందల యిరువది నూల్గొను "మే" మా
సమ్మున నారవదగు దిన సమ్మందు బ్రయాణ మతడు సాగించె నొగిన్.

**ముగింపు :**

కం. మేనెల పదునారవ తే దీని శ్రీకాకుళము జేరితిమి పార్వతిపూర్
కై నెరపె బ్రయాణ విధుల నా నెరకాడు ప్రజలెంతో యలమట నొందన్.

వ. ఇటు లా మహేంద్రయాత్ర సమాప్తి జెందినను నామనంబు శఖరసోదరుని గుణజాలం
బులం దవిలి యుంట నాతని నీ గతి నెమ్మది నెంచితిని.

తే.గీ. కడు బవిత్రపుగొనముల విడతి జ్ఞాన మార్జనము సేసి సుఖమున మలయ పలయు
చేష్ట గావించి యున్నతి జెంగ నయ్యె సర్వశక్తుండు దైవంబు సాకు నిన్ను
సంతతారోగ్యమైశ్వర్య సంపదలను యున్న తాదర్శముల నిడి యుర్వి నెలమి.

గద్య :

ఇది సకల సుకవిజన విధేయ గుణపవిత్ర శ్రీలక్ష్మీ నారసింహచరణారవింద సేవా సమాసాదిత కవితా విచిత్ర ఆంగీరస గోత్ర పవిత్ర శ్రీమచ్ఛిష్ట కరణకుల పవిత్ర సింహాద్రి పాతనాయక పౌత్ర ఆదినారాయణ పుత్ర శ్రీరాయవరపు కొండలరాయ సద్గురు పాదారవింద నిరంతర ధ్యానానువర్తి ఉరిటి రామమూర్తి ప్రణీతంబైన శ్రీ మహేంద్రగిరియాత్ర నామక ప్రబంధమ్మునందు సర్వంబు నేకాశ్వాసంబు సమాప్తము.

**విశేషాంశములు :**

ఈ యేకాశ్వాస కావ్యమునందు "విలియ మాస్వాల్డు న్యూశాము" అనునతడు మహేంద్ర గిరికి పోయి యచటి ప్రకృతి సౌందర్యమును తిలకించుట వర్ణింపబడినది. రామమూర్తి గ్రంథావళి యందలి అవతారిక దీని మొదట వ్రాయబడినది. ఈ అవతారిక గ్రంథావళి యందలినాలుగు గ్రంథములకు కలిపియే యున్నది. ఇందు కృతిపతి వర్ణనము గలదు. ఇవి విక్రమ దేవుడనుజయపుర భూవిభునకంకిత మీయబడెను. ఈ అవతారిక 40 పుటలు, మహేంద్రయాత్ర 39 పుటలు వున్నది.

ఈ ప్రతి యందలి లిపి స్పష్టముగ నున్నది. ఇది తప్పులు దిద్దబడి, స్వల్పముగ మార్పులు చేయబడియున్నది. ప్రతి బాగుగా నున్నది. కాని అవతారిక ప్రతియంచులు నలిగిపోయి యున్నవి. ఇందు వ్యావహారిక భాష వాడబడినది.

# మానికొండ రామాయణము - బాలకాండ

(వాల్మీకి రామాయణ సహితము)

## మానికొండ సత్యనారాయణ శాస్త్రి

| | | | | |
|---|---|---|---|---|
| ఆక్సేషన్ నెం. | : 6020 | | కాల్ నెం. | : టి 3-601 |
| ప్రతి | : కాగితము ; సమగ్రము. | | పత్రములు | : 762 |
| పరిమాణము | : 20 సెం.మీ×31 సెం.మీ. | | పత్రపంక్తులు | : 26నుండి30 |

మొదటి సర్గ

సంక్షేపరామాయణ కథ - నారదుడు వాల్మీకికి చెప్పుట.

ద్వి. వర తపస్స్వాధ్యాయ నిరతు నారదుని వాల్మీకి తపసి యా వాగ్విదాం వరుని
మునిపుంగవుని నిట్లు మున్నొక్క తరిని ప్రశ్నించె నెంతయు భక్తిమై గురుని
ఎవ్వ డీలోకాన నిపుడు చూడంగ గుణవంతు డెవ్వండు గురుమతి యెవడు
వీర్యవంతు డెవడు విక్రుతుం డెవడు సదృఢవ్రతు డెవడు సదమాత్మ డెవడు
తతకృతజ్ఞు డెవడు ధర్మజ్ఞు డెవడు సత్యవాక్యు డెవడు సచ్చరితు డెవడు
సర్వభూతాళికి సమహితు డెవడు ధర సదైకప్రియదర్శకు డెవడు
విద్వాంసు డెవ్వండు విబుధు డెవ్వండు మరి సమర్థు డెవడు కరణార్థుని డెవడు
ద్యుతిమంతు డెవ్వండు ధృతిమంతు డెవడు అనసూయకు డెవడు అనుకూలు డెవడు
ఎవడు జితక్రోధు డెవ్వండు చెపుమ సంగరాన నెవని సంజాతరోషు
వీక్షించి సురలును భీతుల్లు చుండ్రొ అట్టి యా నరుగూర్చి గట్టిగా వినగ
పరమ కౌతూహలం బగుచుండె యనఘ అట్టి యా నరుని యో యమలచారిత్ర
ఎరుగ సమర్థుండ వీవయౌ కతన వేడుచుంటిని నిన్ను వేడుక నాకు
వినిపింపు మునిచంద్ర ఘన తపస్సాంద్ర. 1-5

ముగింపు :-

ద్విపద. రాజర్షిసుతు డల్లప్రభుడు రాముండు అభిరామ యా రామ యా యతికామ
రాజన్యకన్య యా రమణి యా ధన్య ఉత్తమకన్య యా మత్తకాశినియు



పూత యా భూజాత సీతయు జెలగి లీల స్వయంగ్రహాశ్లేషంబు సత్కృప
బింబంబు ప్రతిబింబ మీ ద్వంద్వ మనగ పతుసపేకలు నాగ గను నల్లుకొనుచు
పీడక యెల్లెడ పెనవైచుకొనుచు లీనమై యద్విద్ధ రేకమై సతము
శ్రీ విష్ణుడు విభుండు శ్రీదేవి యట్లు అమరేశ్వరుం డల్ల యా లక్ష్మియట్లు
వెల్లి రతీతమౌ వెల్గుతో జగతి. 29

డెబ్బదియేడవ సర్గ సమాప్తి. శ్రీ బాలకాండ సర్వము సమాప్తి.

విశేషాంశములు :

ఈ గ్రంథాదియందు కాటూరి వేంకటేశ్వరరావుగారి ప్రస్తావన కలదు. అంతేగాక గ్రంథకర్త కృతి సమర్పణ పద్యములను, తన రచనా క్రమమును, ఉపోద్ఘాతమును, బాలకాండ విశిష్టతను కూడ ముందుగా పేర్కొనెను. ఇందు ఎడమవైపు మూల శ్లోకములుకూడ గలవు. కవి పద్యపాద నియమమును పాటించలేదు. ప్రతి బాగున్నది. లిపి స్పష్టము.

# మానికొండ రామాయణము

## అయోధ్యకాండ

(వాల్మీకి రామాయణ సహితము)

## మానికొండ సత్యనారాయణ శాస్త్రి

| | | | | |
|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 6021 | | కాల్ నెం | : జి 8-602 |
| ప్రతి | : కాగితము; సమగ్రము. | | పత్రములు | : 1309 |
| ప్రతిపరిమాణము | : 18.5 × 31 సెం.మీ. | | పత్రపంక్తులు | : 26 నుండి 30 |

ప్రారంభము :

అయోధ్యకాండ - మొదటిసర్గ

శ్రీరాముని గుణగణములు - శ్రీరామునకు పట్టాభిషేకము చేయగోరి దశరథుడు సభను సమావేశపరుచుట.

తే.గీ. మాతుల కులంబునకు నేగ భరతు డపుడు తోడ శత్రుఘ్ను నితని శత్రుఘ్ను తమ్ము
రమ్మనగ నాతడున్ వెంటరాగ నతని రమణ గొనిపోయె ప్రీతి పురస్సరంబు. 1

తే.గీ. అశ్వపతి మాతులుండును నచట తనను ప్రీతితో పుత్రసముగ లాలించుచుండ
బహుళసత్కారసంస్కృతుల్ బడయుచుండి భరతు డచ్చట వసియించె భ్రాతగూడి. 2

తే.గీ. వివిధ కామసమృద్ధుల పీరు లిటుల మేనమామ యింట సంతర్ప్యమాను లయ్యు
నెపుడు వృద్ధుని దశరథు నృపుని పితనె మనముల స్మరించుచుండి రా భ్రాతృవరులు. 3

ముగింపు :

తే॥ ఋషులు నుచ్ఛృష్టులై యున్న వేళలందు మరి ప్రమత్తులునై యున్న తరుణము జన
పట్టి తినుచుంద్రు వారి నా పాపు లకట నడుచుచుందుమి వారి కీ వెడముగాను

తే. ఇదె మహర్షులు వనమునం దెప్పు డేగి పండ్ల నాగి దెచ్చుకొనెడి మహాపథంబు
ఈ పథంబుననే నీవు నేగి రామ వనము దుర్గమమును జేర భద్ర మగును.

తే. ఇటుల ప్రాంజలులై ద్విజుల్ ఋషులు మునులు స్వస్త్యయనమిచ్చి యనుపస భార్యుడగుచు
లక్ష్మణునితోడ జొచ్చె పరంతపుండు వనము రాముండురవి యభ్రపటపి నట్లు.

119వ సర్గ సమాప్తి

అయోధ్యకాండ సర్వము సమాప్తి.

విశేషాంశములు:

ఈ గ్రంథాదియందు విషయ సూచిక, రాయవేలూరు జలకంఠేశ్వరాలయ చరిత్ర, గ్రంథకర్తృ నివేదన, బుద్ధుడు — రామాయణ రచనాకాలము గురించిన ఒక వ్యాసము కలవు. ప్రతి బాగున్నది. లిపి స్పష్టము. ఈ అయోధ్యకాండ రెండు సంపుటములుగా నున్నది.

# మానికొండ రామాయణము

## అరణ్యకాండ

(వాల్మీకి రామాయణ సహితము)

## మానికొండ సత్యనారాయణ శాస్త్రి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 6022 | కాల్ నెం | : టి 3-608 |
| ప్రతి | : కాగితము : సమగ్రము. | పత్రములు | : 758 |
| ప్రతిపరిమాణము | : 18.5×30·సెం.మీ · | పత్ర పంక్తులు | : 28 |

ప్రారంభము :-

మొదటిసర్గ

దండకారణ్యవాసులైన మునులు సతీసోదర సమేతుడగు రామునకు స్వాగత మిచ్చుట.



తే. గీ. ప్రవ ప్రవేశించి యా మహారణ్య మటుల దండకారణ్య మాత్మవంతుం డతండు
చూచె రాముండు దుర్ధర్షు డేచి ఎదుర తాపసాశ్రమ మండలం బా ప్రభుండు. 1

ద్విపద (మంజరి)

కుశల చీరెల నెల్లదిశల వ్యాప్తంబు బ్రాహ్మమౌ లక్ష్మి సర్వత్ర కాంతంబు
రవి మండలం బంబరంబునం దెట్లు ధర ప్రదీప్తంబు దుర్దర్శంబు నట్లు
సకల భూతాళికి నిక శరణ్యంబు లలి సుసంమృష్టాజిరంబు దివ్యంబు
బహు మృగాకీర్ణంబు మహి భీకరంబు ఖగగణ సంకుల కలరవోగ్రంబు
నిత్య మప్సరగణ నిభృత నృత్తంబు స్వర్వాసులకునేని సంపూజితంబు
జగతి విశాలాగ్ని శరణాళితోడ స్రుగ్భాండములతోడ స్రువములతోడ.

ముగింపు :-

తే.గీ. పురుషపుంగవ లక్ష్మణా ! పొమ్ము నీవు అల్ల సుగ్రీవుచెంత కం చనుచు విభుడు
సత్యవిక్రము లక్ష్మణస్వామి నరసి మరల శ్రీరాము డిటు బల్కె మదిని కలగి. 27

తే.గీ. దైన్యగతుడ రాజ్యభ్రష్టుడైన వాడ సాధ్వి నా సీతపైన యాస క్తమతుడ
తమ్ముడా! యాపె లేకింక ధాత్రి నెట్లు క్షణము జీవింపగలను లక్ష్మణకుమార. 28

తే.గీ. తమ్ము డతని కనన్యచేతమున కిట్లు చెప్పి మదనాభిపీడితుం డప్పు డెట్లో
అల మనోరమ పంప నానళిని జేరె వితతశోక విషాదయంత్రితుడు నృపుడు. 29

తే. అడవిని సుదూరసంక్రమం బధ్వమల్ల గనుచు క్రమముగ జని శుభకాననంబు
జగతి నానావిధాండజ జాలకంబు "పంప" జేరిరి యా రఘూద్వహులు ఘనులు. 30

75వ సర్గ సమాప్తి

అరణ్యకాండ సర్వం సంపూర్ణము.

విశేషాంశములు :

ఈ గ్రంథాదియందు సతి శ్రీవైదేహి స్మృతి, గ్రంథకర్త నివేదన, అరణ్యకాండ విశిష్టత, అంకిత పద్యములు, విషయసూచికలు గలవు. కవి దీనిని దండకారణ్యనిలయు డగు శ్రీ భద్రాద్రి నిలయున కంకిత మిచ్చెను. ఈ కాండము రెండు భాగములుగ ఒకే పుస్తకమున గలదు.

ప్రతి బాగున్నది. లిపి స్పష్టము.

# మానికొండ రామాయణము
## కిష్కింధకాండ
### (వాల్మీకి రామాయణ సహితము)
### మానికొండ సత్యనారాయణ శాస్త్రి

ఆక్సెషన్ నెం : 6023 కాల్ నెం : టి 3-604

ప్రతి : కాగితము; అసమగ్రము; పత్రములు : 755

ప్రతి పరిమాణము : 18.5 × 30 సెం.మీ పత్ర పంక్తులు : 26 నుండి 28 వరకు

ప్రారంభము :

మొదటి సర్గ

పంపాతీర శోభ గాంచి రాముడు సీతను దలంచి వాపోవుట - లక్ష్మణు డూరడించుట - ఇరువురు ఋష్యమూకమును సమీపించుట.

తే॥ సరసపద్మోత్పలాచ్ఛ ఝషాకులంబు పుష్కరిణి దాని జేరి యా భూవిభుండు
ప్రభుడు రాముండు కడువిలాపంబు జేసె ఆకులేంద్రియుడై కటా! యనుజు గూడి. 1

తే॥ ఆ సరస్సును గనినంత హర్షమునను ఇంద్రియంబులు పతికి చలించె నపుడ
కామవశు డౌచు నతడు లక్ష్మణున కిట్లు చెప్పదొడగెను రాముండు శ్రీయుతుండు. 2

తే॥ చూడు సౌమిత్రి పంప బల్ శోభ లెసగు క్రమవైఢూర్యవిమలోదకంబు వత్స
ఫుల్లపద్మోత్పలంబుల పొల్పు మీరు కాంతి శోభించు వివిధ ద్రుసంతతులను. 3

ముగింపు :

తే.గీ॥ నిశ్వసించుచు నార్తులై నీర్గి మూర్గి ఆర్ధనిస్సృతలైన మహాహితతుల
మహిని తద్ధరణీధరం బప్పు డొప్పె చూడ సపతాక మనునట్లు చోద్యముగను. 48

తే.గీ॥ త్రాస సంభ్రాంతు లౌచు నా తాపసులును తత్ శిలోచ్చయమును వీడి తరలి పోవ
అడవిలో సార్థహీనుడౌ నధ్వగు దన పొక్కుచుండెను నప్పుడా భూరి గిరియు. 49

ఉ. వేగ సమాహితాత్ముడటు వేగము బూని హరిప్రవీరు డా
సాగరమున్ దరింప మది శాత్రవహంత దలంచి యప్పుడే
సాగి మహానుభావు డిక స్వాంతముతోనె మనస్వి లంక నా
సాగరమేఖలన్ చొరవ చయ్యన జొచ్చె సమీరజుం డొగిన్. 50

67 వ సర్గ సమాప్తి.

కిష్కింధ కాండ సర్వము సమాప్తి.

విశేషాంశములు :

ఈ గ్రంథాదియందు, కవి తన కావ్యమును విరూపాక్షున కంకిత మిచ్చిన పద్యము, గ్రంథ విషయసూచిక, కర్తృ నివేదనలు కలవు. కవి పద్యపాద, ప్రాసనియమములను పాటించలేదు. ప్రతి బాగున్నది. లిపి స్పష్టము.

# మానికొండ రామాయణము
## సుందరకాండ
(వాల్మీకి రామాయణ సహితము)
### మానికొండ సత్యనారాయణ శాస్త్రి.

ఆక్సేషన్ నెం. : 6024 కాల్ నెం : టి 3-605
ప్రతి : కాగితము; సమగ్రము. పత్రములు : 633.
ప్రతి పరిమాణము : 19 సెం మీ.×32 పత్ర పంక్తులు : 16 నుండి 20
ప్రారంభము :

మొదటి సర్గ
హనుమంతుని సముద్ర లంఘనము.

తే॥గీ॥ శత్రుకర్శను డగు వాయుపుత్రు డపుడు మాత రావణసీత యా సీతపదము
చారణా చరిత మ్మల్లి చదల పథిని చెలగి యన్వేష మొనరింప తలపు గొనియె. 1

తే॥గీ॥ దుష్కరంబును నిష్ప్రతిద్వంద్వమైన ఉదధి లంఘన కార్యంబు నుద్యమించి
ప్రభుత సముదగ్రశిరము గ్రీవంబునొప్ప పృథు గవాంపతి భాతిగా వెలసి హనుమ. 2

తే॥గీ॥ సరసవైఢూర్యవర్ణంపు శాద్వలముల సలిల కలంబు లా కొండచరుల దరుల
ధీరుడు మహాబలుండు తత్తూరిగిరిని ఎదురులేకను విహరించె మద మెలర్ప. 3

ముగింపు :

సీ॥ ఆ శత్రుకర్శను నాకృతాత్ముని నీవు చూతువు శీఘ్రమే శూరు రాము
నా ధనుష్పాణి నా లక్ష్మణు జూచెద విపుడె లంకాద్వార విపుల సీమ
వానరపరివారు ప్లవగేశు సుగ్రీవు శూరుని నిచటనే జూతువమ్మ
తతనఖదంష్ట్రాయుధంబుల వారిని మృగరాజ శార్దూలవిక్రములను

తే॥గీ॥ వారణేంద్రాభులైనట్టి వానరులను ఘనుల శైలాంబుదనికాశ కపుల నింక
చెలమి లంకామలయసానువులను మిగుల సింహనాదాల గావించు రంహసులను
ఎన్నొ కపిముఖ్యయూధాల కన్నులార నచిరమున నీవె యరసెదవమ్మ యిటనె.

తే॥గీ॥ రాఘవుం డింక వనవాస వ్రతము దీర్చి తల్లి నినుగూడి యా యరిందముడు ఘనుడు
భువి నయోధ్యను నభిషిక్తు డవగ దేవి! శీఘ్రమే జూతు వీవు మా సీతమాత!

తే॥గీ॥ ఇటుల శివకర మగురీతి నిష్టపణితి కరమవీనంపుభాషల కాంత నెట్లొ
 కూరడిల బల్కు విని యాపె యూరడిల్లి హర్షచిత్తతన నప్తు సాగనంపె.

68 వ సర్గ సమాప్తి

గద్య :

ఇది శ్రీమత్ త్రిభాషామిత్ర కౌండిన్యపవిత్రగోత్ర వియమాంబా లక్ష్మీనృసింహపుత్ర మానికొండవంశ మణిఖని విభూషణ, సత్యనారాయణశాస్త్రి నామధేయ ప్రణీతంబైన శ్రీ మత్తెల్గు వాల్మీకాఖ్య మధురస తరంగిణీకల్లోలస్ఫాలనంబుల సర్వసుఖానంద సుందరవేలాంతం బగు సుందరకాండం బను పంచమ స్ఫాలనంబు సర్వంబు సమాప్తము.

విశేషాంశములు :

ఈ గ్రంథమునందు మూలశ్లోకములు మానికొండ రామాయణము, వావిలికొలను సుబ్బారావుగారి శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము మూడును తులనాత్మక పరిశీలనకు వీలుగా వ్రాయబడి యున్నవి. వావిలికొలనువారి రామాయణమునందు మాత్రము కొన్ని లుప్తభాగము లున్నవి. ఈ కవి పాద, ప్రాస నియమములను పాటించలేదు. ప్రతి బాగున్నది. లిపి స్పష్టము. ఈ ప్రతి రెండు పుస్తకములుగా నున్నది.

# మేఘసందేశము

(తెలుగు సేత)

## మానికొండ సత్యనారాయణ శాస్త్రి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | 6026: | కాల్ నెం | : టి 8-606 |
| ప్రతి | కాగితము; సమగ్రము. | పత్రములు | : 181 |
| పరిమాణము 17×21.5 సెం. మీ. | | పత్రపంక్తులు | . 8 నుండి 16 |

ప్రారంభము :

ప్రథమః సర్గః

1. కశ్చిత్ కాంతావిరహగురుణా స్వాధికారాత్ ప్రమత్తః
 శాపే నాస్తంగమితమహిమా వర్షభోగ్యేణ భర్తుః ।

యక్ష శ్చక్రే జనకతనయా స్నానపుణ్యోదకేషు
స్నిగ్ధచ్ఛాయాతరుషు వసతిం రామగిర్యాశ్రమేషు॥

శా॥ కశ్చిత్ యక్షుడు స్వాధికారమున మత్తుండై నిజస్వామిచే
శాపాస్తంగమితాష్టసిద్ధు డగుచున్ కాంతావియోగోగ్రతన్
తద్వర్షా ఒ సహబోగ్యకాలమున సీతాస్నాన పుణ్యోదకా
ర్ద్రచ్ఛాయాతరులన్ వసించె రఘురామాద్ర్యాశ్రమాలన్ బడిన్.

2. తస్మిన్నద్రౌ కతిచి దబలా విప్రయుక్తస్సకామీ
నీత్వామాసాన్ కనకవలయభ్రంశరిక్తప్రకోష్ఠః ।
ఆషాఢస్య ప్రథమదివసే మేఘమాశ్లిష్టసానుమ్
వప్రక్రీడాపరిణతగజః ప్రేక్షణీయం దదర్శ ॥

శా॥ ఆ యద్రిన్ అబలావియోగగతి నట్లాకామి మాసంబు లె
ట్లో పోద్రోసియు కొన్ని స్వర్ణవలయభ్రంశప్రకోష్ఠుండునై
ఆషాఢప్రథమాహమందున గనెన్ మేఘంబు నాశ్లిష్టసా
నున్ గోవాటలక్రీడలన్ పరిణతేభప్రేక్షణీయంబునున్.

ముగింపు :

56 తత్సందేశం జలధరవరో దివ్యవాచా చచక్షే
ప్రాణాం స్తస్యా జనహితరవో రక్షితుం యక్షవధ్వాః ।
ప్రాప్యోదంతం ప్రముదితమనాః సాపి తస్థౌ స్వభర్తుః
కేషాం నస్యా దభిమతఫలా ప్రార్థనా హ్యుత్తమానామ్ ॥

శా. తత్సందేశము నా పయోదవరు డాయక్షాంగనాప్రాణముల్
బ్రోవన్ జెప్పెను దివ్యవాక్కుల జనశ్రోత్రానుకూలధ్వనిన్
ఆ యక్షాంగనయున్ స్వభర్తృకుశలంబున్ వించు మోదించె నౌ
ప్రార్థింపన్ ఘనులన్ ఫలింప కెటులుండున్ ప్రార్థనల్ ఏరికేన్.

57. శ్రుత్వా వార్తాం జలదకథితాం తాం ధనేశోఽపి సద్యః
శాపస్యాంతం సదయహృదయః సన్నిధాయాస్త కోపః ।
సంయోజ్యైతౌ విగళితశుచౌ దంపతీ హృష్టచిత్తౌ
భోగాన్ ఇష్టాన్ అభిమతసుఖాన్ ప్రాపయామాస భూయః॥

శా. జాలిన్ గొల్పెడివార్త యా జలదునోటన్ వించు విత్తేశుడున్
రోషం బాగి, దయాంతరంగు డయి శాపాంతంబు గావించి, తా
గూర్చెన్ దంపతులన్, మనంబు లిగురొత్తన్ వారికిన్ భోగముల్
పూర్వంబట్టుల గల్గజేసెను నభీష్టంబుల్, కడున్ సౌఖ్యముల్.

ఉత్తరమేఘం సమాప్తం

విశేషాంశములు :

కవి ఈ ప్రతియందు కాళిదాసమూలమును, దాని ఆంధ్రానువాదమును తెలుగులిపిలో వ్రాసి, మరల ఆంధ్రానువాదమును నాగరలిపిలో కూడ వ్రాసియున్నాడు. స్థలమున్న చోట పుస్తకమునందును, స్థలముచాలనిచో చిన్నకాగితము మీదను వ్రాసి అందే అతికించియున్నాడు. పేజీ కొకపద్యమును వ్రాసి, దిగువ అధోలేఖనములనుకూడ వ్రాసినాడు. ప్రతి చివర తన అనువాదరీతిని వివరించుచు మేఘసందేశమునకు పీఠిక యొకటి వ్రాసి యున్నాడు. ప్రతి సులభగ్రాహ్యము, బాగున్నది.

# మైరావణ చరిత్ర

## గంగాధరుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 615 | కాల్ నెం | : టి 3-30 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పుటలు | : 35 |
| ప్రతి పరిమాణము | : 37×3 సెం.మీ. | పుట పంక్తులు | : 6 |

ప్రారంభము :

శ్రీధరు నంచితు శృంగారహారు నమిత సద్గుణహారు .... .... ....
.... .... .... .... .... ...., .... .... .... .... మనోజు
రవికోటిసమతేజు రవికులాంభోజు అంచితస్థితిపాత్రు .... ....
కలిగి వేదాద్యంత కలితమై యపుడు నిత్యసత్యంబులు నెగడిన పురము
పరమ....ప్రీతితో భానువంశజుండు చెలువొంద తమ్ములు చేరి తను గొలువ
........దినంబు మనుజేశ్వరుండు తనరంగ సుఖముండి తరుచరసేన

ననువంగవలెనని యాత్మ చింతించి భరతుని దను జూచి పలికె రాఘవుడు
కపిసార్వభౌమ యా ఘనబలోదగ్రు అతులితసాహ..........యు న్నారు.

ముగింపు:

పొలుపొంద నినుచీవు పొగడుకొనియెదవు అనిన రావణుండు మానుపడియున్న జూచి
మాయావివి నీతో మాటలేమిటికి నీలావు పరికింప నే నుంటిగాక
.... ........... దొకగట్టి పొలియింతు దివిజులు పొగడుచు నుండ
నీ మాయ లన్నియు నీరు గావింతు ననుచు వాయుజు డట్టహాసంబు చేసి
చెటులకోపంబున చేరి రావణుని ఒడసి గైదువగొనియుగ్రు డైవట్టి
మల్లయుద్ధంబున మదమెల్ల నణచి తనవాలముఖమున దగ జుట్టిపట్టి
పెనచిరా దిగిచి యొక్కపెట్టు పట్టించి హూంకారనినదంబు యుర్వి గంపింప
ఘూలితనూజుండు కర మప్పళించి యుబ్బంగి తమలోన యిద్దరు బెనంగి
పాయుదు డాయుదుర్బా హోదండములు వేయుదురు తోయుదురు విరిగి పాదుదురు
పిడికిళ్ళ బొడుతురు పృథివి గంపింప .... .... ....
............రంకెలు సాహసంబునను దెక్కరులు తమలోన ఢీకొన్న యట్లు

విశేషాంశములు :

ఈ మైరావణచరిత్ర మను కావ్యము గంగాధరకవి ప్రణీతము. అంజనేయుడు మైరావణుని యుద్ధమున చంపిన విధమే ఈ కావ్యమునందలి కథావస్తువు. ఈ కవి తాను హరి భక్తుడ నని తెలుపుకొనెను. ఇది పామరజనులకు సైతము అర్థమగునట్లు పాడుకొన వీలగునట్లు ద్విపదకావ్యముగ సులభశైలిలో రూపొందినది.

ఈ ప్రతియందు కావ్యాంతము లేదు. ఉన్నపత్రములు కూడ అధికముగ క్రిమిదష్టములై యున్నవి. కావ్యాదిని పెక్కుఅక్షరములే నశించినవి. ఆశ్వాసాంతగద్య యిందు లేదు. అందుచే కవి, కృతిపతుల వివరములుగాని, కావ్యవివరములుగాని ఎక్కువగ లభింప లేదు. ప్రతి మిక్కిలి శిథిలావస్థలో నుండి చూర్ణమగుదశయం దున్నది. భాషాదోషము లును కలవు. పద, అక్షర చ్యుతములు గలవు. కొన్ని పత్రములు తునకలై కొలది భాగములే మిగిలియున్నవి.

# మొల్ల రామాయణము

## ఆతుకూరి మొల్ల



ప్రారంభము :

ఉ. శ్రీమహిమాభిరాముడు వసిష్ఠమునీశ్వరపూజితుండు సూ
త్రామవధూకళాభరణదక్షుకు డాశ్రితభూషణుండు ద
ర్వామలసన్నిభాగుడు మహాగుణశాలిదయాపరుండు శ్రీ
రాముడు భక్తలోకముల రమ్యతరంబుగ బ్రోచుగావుతన్!

ఉ. శ్రీనగమందిరుం డమరసేవితు డర్ధశశాంకమౌళి స
న్మౌని మనఃప్రయోజదినినాయకు డబ్జభవామహే ...
ధ్యానలసుప్రసన్ను డగు ధన్యుడు శేషవిభూషణుండు పం
చాననుడై నయట్టి మల్లికార్జు నుతించు శుభంబు లెప్పుడున్!

* * *

వ. అని వితర్కించి ముదంబున నిష్టదేవతాప్రార్థనంబును, బురాతనకవీంద్రస్తుతియునుం
జేసి మొల్ల రామాయణంబునకు కథాక్రమం బెట్టిదనిన.

సీ. సరయూనదీతీర సతత సన్మంగళ ప్రాభవోన్నత భూరివైభవంబు
కనకగోపుర హర్మ్యఘనకవాటోజ్జ్వల ప్రాకార గోపుర శిఖరంబు
గజవాజిరథభట గణికాతపత్రచామర కేతు తోమరమండితంబు
ధరణీవధూపి యాభరణ విభ్రమరేఖ దర్శించు మాణిక్యదర్పణంబు

తే. భానుకులదీప సౌజన్య పట్టభద్ర భాసీనవరత్న రుచిరసింహాసనంబు
నాగ నుతికెక్కు మహిమ ననారతంబు ధర్మనిలయంబు భువి నయోధ్యాపురంబు!

సీ. మదనాగయూథ సమగ్రదేశము గాని కుటిలవర్తన శేషకులము గాదు
అహవోర్విజయ హరినివాసము గాని కీశ సముత్కరాంకితము గాదు

సుందరస్యందన మందిరం బగు గాని    సంతత మంజులాశ్రమము గాదు
మోహనగణికా సమూహగేహము గాని    యూధికానికర సంయుతము గాదు

తే. సరససత్పుణ్యజన నివాసంబె గాని    కఠిననిర్దయదైత్య సంఘంబు గాదు
కాదు కా దని గొనియాడ గలిగినట్టి    పురవరాగ్రంబు సాకేత పురవరంబు!

ముగింపు :

సీ. కుటిల మేఖలయందు కుంతలంబులయందు    బొంకు జూదరులందు బోంటులందు
లేమి వైరులయందు మేరుమధ్యములందు    భంగంబు నదులందు బరులయందు
కోపంబు ఘనులందు క్రూరవర్తనులందు    వదకువీణలయందు వ్యసనులందు
బంధంబు రతులందు పటుశిరోజములందు    మోహంబు ధనమందు ముదితలందు

తే. చింతకవులందు తాపసులచిత్తమందు    వర్ణమిశితంబు చిత్రరువందు యవను
లందుననె కాని పొందెడ కెందకుండ    లీల ధరయేలె శ్రీరామభూవరుండు!

క. ఈ రామచరిత మెప్పుడు    వారక విన్నట్టివారు వ్రాసినవారుం
గోరి పఠించినవారును    శ్రీరామునికరుణ మేలు జెందుదు రెలమిన్!

క. జలజాక్ష భక్తవత్సల    జలజాసనపాదవినుత జలజాతసుధా
జలరాశిభవ్యకోజ్వల    జలజాకరచారుహంస జానకినాథా!

గద్య :

ఇది శ్రీ కట్టమల్లేశ్వర వరప్రసాదలబ్ధగురులింగ జంగమార్చనవినోద యాతుకూరి కేసనసెట్టిగర్భసుక్తిముక్తాలలామ మొల్ల విరచితంబైన శ్రీమద్రామాయణ మహాకావ్యంబు నందు యుద్ధకాండ సర్వమును తృతీయాశ్వాసము.

విశేషాంశములు :

ప్రతివిలేఖనము :

ది 8 జూన్ 1889సంllరంll వికారినామసంllర నిజజ్యేష్ఠశుద్ధ 9గుll బాలాంత్రపు నరసరాజు కొప్పాకఅచ్యుతరామునికి వ్రాసియిచ్చిన మాతృకప్రకారం ఆలమూరు ఆకుండిరామయ్యగారివద్ద ద్వివేదులమల్లయ్య ఆత్మార్థంకొరకు ది 9-5-1900 సంllరముకు సరియైన శార్వరిసంllరవైశాఖశుద్ధ 10బుllసరికి బాలకాండ అయోధ్య కాండ అరణ్యకాండ కిష్కింధకాండ సుందరకాండ యుద్ధకాండ యీషట్కాండలు ద్వివే

దులమల్లయ్య స్వహస్తలిఖితంగా వ్రాసుకునెను. పిమ్మట ఆఖరిపత్రమందు ఈక్రింది విధముగా గలదు. కుమ్మరమొల్ల రాజుగార్కి కృతిపొందవలసిన దనిపట్టుకువెళ్ళినంతలో ఆ సంస్థానములోనున్న పండితులు పకారకొమ్ము కకారకొమ్ము వుంచి పద్యం చెప్పిన యెడల నీ గ్రంథము రాజుగారి యెదుట చదివించి మెప్పిస్తాము గనుక నీవు మేము యిచ్చిన సమస్య పద్యం చెప్పి తేవలసినది అంటే ఆ సమస్యకు చెప్పినపద్యం

రామం శ్యామాభిరామం రవిశశినయనం కోటిసూర్యప్రకాశం
దివ్యం దివ్యాస్త్రపాణిశతముఖ శరథిం చారుకోదండహస్తం
కాలం కాలాగ్నిరుద్రం రిపుకులదహనం విఘ్నవిచ్ఛేద దక్షం
భీమం భీమాట్టహాసం సకలభయహరం రామచంద్రం నమామి!

అని యీ పద్యం చెప్పి రాజదర్శనమునకు వెళ్ళి కృతిని బొందినది.

ప్రతి చక్కనిది. క్రిమిదష్టము కాలేదు. గంథశైథిల్య గ్రంథపాతములు లేవు. సమగ్రము వ్రాత బాగుగానున్నది. ఇందు మొత్తం 6కాండ లున్నవి. లేఖనదోషములు కలవు.

# మొల్ల రామాయణము

## ఆతుకూరి మొల్ల

| | |
|---|---|
| ఆక్సెషన్ నెం : 1582 | కాల్ నెం : టి 3-354 |
| ప్రతి : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు : 152 |
| ప్రతి పరిమాణము : 34×4 సెం.మీ. | పత్రిపంక్తులు : 5 నుండి 6 |

**విశేషాంశములు :**

గ్రంథము క్రిమిదష్టమైనది. పత్రములు శిథిలావస్థలో నున్నవి. గ్రంథాదియు, అంతమును లేదు. మొత్తము 8 ఆశ్వాసముల గ్రంథము. బాల నుండి సుందరకాండ వరకు నొక్కొక్క ఆశ్వాసము. యుద్ధకాండ మాత్రము 3 ఆశ్వాసములు.

# మొహాందా దానియా యాత్ర

## ఉరిటి శ్రీరామమూర్తి

ఆక్సెషన్ నెం : 3680 కాల్ నెం : జి 3-251
ప్రతి : కాగితము; సమగ్రము. పుటలు : 12
ప్రతిపరిమాణము : 20×35 సెం.మీ. పుటపంక్తులు : 25

ప్రారంభము :

గీ॥ వింశతి శతాబ్దమున షష్ఠవింశతి జన వరిని బదియవదిన మాదివారమునను
మొహోందసుదరామగడకును బోవు క్రొత్త యినుపదారిని జూడంగ జనితి నేను.

గీ॥ ప్రొద్దుననె తొమ్మిదవగంట పొసగ భోజుడి స్టేషనున బండి నెక్కితి జెలగి పదునొ
కంటికిని మొహోందా జేరుకొంటి నచట దానియా బండి నెక్కితి దద్ద ప్రీతి.

సీ॥ మొహొందాను వీడి జామునియతంచను దాటి దగ్గ జేర త్రికోశ దూరమయ్యె
నందు జాముని యాఖ్యమౌ నది సుగభీర కడుమనోహర సూక్ష్మకాయ యగుచు,
గానిపించెను బొగ్గుగనులును చపుదొల గాన్పించె బంకంబు గదియునట్టి
జానేల చెఖాలల అంపిల్లె వరిపంట కొంచముపైరు కాన్పించుచుండ
బొగ్గుగనులందు ఖనికర్మిబోలు కర్ష కులను కర్షకవృత్తిని దలప నిదు
ఇప్పు డెరుగలే లద్దాన సెనయు దొసగు ముందునకు గల్గు ముసురుల విందు లరయ.

ముగింపు :

మ॥ ఇరుచక్కిన్నెరకాంద్రుడు ధక్కిని విపంచి స్థాల్చి ప్రయోగింప బల్
నెరకాడొక్కడు నెమ్మిపించెము దల న్దీపింప నొయ్యారపుం
హరువుం దాలిచి పిల్లగ్రోవి పెదవి న్బాటించి మ్రోయింప నొ
క్కరొకరై నెఆకాంద్రుడు కన్నెలును జక్రాకారత న్జుట్టురా
నుర వొప్పంగను జాడ నాడ గడు నింపొప్ప న్గనన్ రాసముల్.

ఉ॥ కాళుల ఘల్లుఘల్లు మను గజ్జెకడెమ్ములు శబ్ద మీగగా
మాలిమి గాళులాటల గ్రమంబున నడ్మలగంటత్రొక్కు దా

మోలిని వంగుచో నినద మొప్పుగ జేయగ గోకిలార బ్లీ
బాలపనంబుల న్వేలయ నంచిత రాసము లాడువేళలన్
నోలగజేయు నా యువకశూరుల డెందము ల్లిలాడగన్.

మ॥ తరియౌ బంటల శోభ గన్పడ శరద్రాత్రు ల్దివంబు ల్లలిన్
గరువంబైన హిమంపు ప్రొద్దులు వసంతంబున్ గడు ప్రీతిమై
తరుణుల్ యౌవను లాడ రాసముల పెద్ద ల్దేవతాపూజలన్
గర మొప్పారగ జేసి పండుగ లొగి న్గావింప సాంతాలులన్.

వ. ఖోజుడీని రెండు మూడు దినంబు లుండి ఖడ్గపురంబు జేరితిని.

**విశేషాంశములు :**

ఈ కావ్యమునందు కవి తాను మొహదానుంచి ఖోజుడీమీదుగా వానియాకు చేసిన రైలు ప్రయాణము, ఆ రైలునుండి బయట కనిపించు ప్రకృతివర్ణన, బొగ్గుగనుల వర్ణన, ఖోజుడిలో సాంతాలుల వివాహవ్యవస్థను, రాసమును వర్ణించెను. ఇందు వ్యావహారిక భాష ఉపయోగింపబడినది. కాని మధ్య మధ్య కొంత కవిత్వపటుత్వపుభాషయు గలదు. ఇందు వర్ణనలే ప్రాధాన్యము వహించినవి.

దీనిని ఉరిటి శ్రీరామమూర్తిగారు వ్రాసిరి. ఆ కవి వ్రాసిన మూడు వేరు గ్రంథములతో కలిసి యిది యొక పుస్తకముగా నున్నది. ఈ గ్రంథము లన్నిటికి కలిపి ఒకే అపకారిక పద్యరూపమున నున్నది. ఈ ప్రతి కొన్నిచోట్ల శిథిలబడి యున్నది.
ఇందలి లిపి స్పష్టముగ నున్నది. ప్రతియు బాగుగానున్నది. ఈ యాత్ర 1926 సం॥ జనవరి 10 వ తేదీ ఆదివారము జరిగినట్లు గలదు.

# యామునాచార్య చరిత్ర

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 2292 | కాల్ నెం | : టి 3-39 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 11 |
| ప్రతి పరిమాణము | : 45×4.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 నుండి 7 |

**ప్రారంభము :**

మ. ఉరు విద్యానిధి యామునార్యుడు మహాయుక్తిం క్రియాదక్షుడై
హరి దంతంబుల .... .... ....

.... .... .... నది నానాకోవిదుల్ ప్రస్తుతిం
తురు నా కావిధ మంతయుం దెలియ సంతోషంబునన్ బల్కవే.

వ. అని శిష్యం డడిగి .... .... త మయ
మూర్తి హరి కృపాసంయుతుండు సరవి నీశ్వర మునులకు సంభవించె యామునా....

మ. .... నీచపు వేల్పులం విడిచి తాత్పర్యంబుతో నెప్పుడున్
అరవిందానన శంకరాదులకు రాజై మించు నారా ....
.... .... .... .... కుం
స్థిర మర్థిం దల చాది భక్తతతికిం బెటుల ప్రాప్తంబగున్.

వ. అని మరియును, యిక్క ... నకృత్యంబు లాచరించి జనకుండు యామునా
చార్యులకు వేదం బభ్యసింపం బనిచిన. నాస్తోత్రియు .... ....
యమ్మహాత్ముం డింటికిం బోయి, మరునాడు చదువ వచ్చిన స్తోత్రియుం డవి వచ్చిం
దెరుంగక నతండు.

గీ. మొనసి తొలునాడు .... .... ....
.... కు జెప్పంగ జొచ్చె ననుచు చదువ కింటికి చనుదెంచె సంతసమున.

ముగింపు :

వ, తెలిపిన యా ఘనునకు రాజ్యంబుమీది మోహంబు లేక విరక్తి మార్గం బంకురించినం
జూచి పరమానందంబునం బొంది శ్రీరామమిశ్రులు యామునాచార్యులం దోడ్కొని
శ్రీరంగంబునకు వేంచేసి యా శ్రీరంగధాముని సేవింపంజేసి, యామునేయులతో
నిట్లనియె.

గీ. ఇదుగో యీమూర్తి తాత ఘడించినట్టి గొప్పనిక్షేప మిది నీవు తప్ప కిపుడు
గొను మటంచును రహస్యార్థ మొనర దెలుప నంత సన్యాసియై యామునాచార్యుడచట
నెలవుకొనియుండె నాస్వామి దలచుకొనుచు.

క. చక్రాయుధకృతి గోచర చక్రాహితచక్రదుష్కసూచిజ్వలనా
చక్రేందుభోగిశయనా నక్రకృపణాపహరణ నయగుణసారా.

మత్తకోకిల.

శంకితాహితశ్రీసతీహితసారసాతరపావనా పంకజేక్షణ దీనరక్షణ భవ్యలక్షణలక్షణా
పంకజాసన లోకనీక్షణభక్తపోషణభూషణా పంకనిగ్రహ శాంతివిగ్రహభక్తలోలనశీలనా

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు కావ్యారంభమున గాని కావ్యాంతమున గాని కవిపేరు లభించలేదు. కావ్యము కథారంభముతోను కావ్యాంతముగూడ కథాంతముతోను ముగిసినది. గద్యకూడ లేదు. అందుచే కావ్యకర్త, కావ్యభర్తల వివరములు లభించలేదు.
మొదటి పత్రము కొంతభాగము నష్టమైనది. మిగిలిన పత్రములుకూడ దక్షిణభాగమున కొంత నష్టమగుటకు సిద్ధముగా నున్నవి. అక్షరదోషములు స్వల్పముగా నున్నవి. లిపి బాగున్నది. ప్రతి శిథిలావస్థలో నున్నది.

# రంగనాథ రామాయణము

## గోన బుద్ధారెడ్డి

| | | | |
|---|---|---|---|
| అక్సేషన్ నెం | : 3989 | కాల్ నెం | : డి8-8838 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 349 |
| ప్రతిపరిమాణము | : 46.×4 సెం.మీ. | పత్ర పంక్తులు | : 8 |

ప్రారంభము :

శ్రీకామినీనాథు జితదైత్యనాథు లోకరక్షణకృత్యు లోకైకనిత్యు.
నిత్యసంధానందు నిర్వాణకృత్యు కృత్యవిదూరు నకృత్రిమాధారు
ఆధారకమల మధ్యామోదభేద సాధన క్రమ సమాచరణ షట్చరణు
సింధురవరదు నాశ్రితలోక బంధు బంధమోచను బలిబంధనోదగ్రు
నారూఢపంచదశాక్షరప్రసవ పారిజాతాకారు ప్రణవానుకారు
నగ్రామ్యగోపికాభ్యంతరవ్యగ్రు నగ్రేసరాకారు నాకారరహితు
యోగిమానసలసదోంకారదీప యోగసందర్శనాభ్యుదయప్రచారు
శ్రుతిశిరోభాగు విరచితచైతన్యు యతిలోకసర్వలోకాశ్రయశ్లోకు

*　　　*　　　*

ఆదికవీశ్వరుండైన వాల్మీకి నాదరంబున పుణ్యులందరు మెచ్చ
జెప్పిన తెరగున శ్రీరామచరిత మొప్ప జెప్పెద కథాభ్యుదయ మెట్లనిన॥

*　　　*　　　*

శ్రీరామచరిత మశేషంబు నీకు కోరి నారదుడు సంకోచించి చెప్పె
అది విస్తరించి నీ వఖిలంబు జెప్ప మది సర్వమును జూచునని జెప్పిపోయె
మది నిర్మలధ్యానమతిజేసి మౌని తరిగొని సకలంబు తలపోసి చూచి
రఘుచరితము దశరథు చరితంబు రఘురాము జన్మంబు రామువర్తనము
తాటకవధయు నుద్దండరాక్షసుల యాటోపహరణంబు యజ్ఞరక్షణము

ముగింపు :

రాముడు మరి యువరాజ్యంబునందు సౌమిత్రి భరతుల చతురమానసుల
తగ ప్రతిష్ఠించి యాతతరాజ్యభూతి దవిలి సుఖింపుచు దాను సీతయును
మహనీయరాజ్య సమ్మదమున బొంది మహితభోగముల నిమ్మహి వెలుగొందె
వేదోచితాచారవిమలమార్గముల ఆదిరాజన్యుల నందర గడచి
పూజితానుష్ఠానములు నశ్వమేధ వాజపేయములాది పరయాగతతులు
సొలవక సేయుచు సురల భూసురల యెలమి రక్షింపుచు నింపు దీపింప
నిండారు ధర్మైకనిష్ఠతో బదునొ కండు వేలేం డ్లుర్వి పాలింపుచుండె
పాలించి యేలుచో బరగుదు రైసల మూలరు చెందరు దుర్భిక్షదెసలు
గలుగ వెల్లెడలందు గాలిదోషములు చలియింప వేమియు సత్యధర్మములు
పరహితారంభతాత్పర్యంబు లెలమి పురుషులయందును బొందియుండుదురు

ఆశ్వాసాంతము :

అని యాంధ్రభాషా భాషాధీశ్వరుండు వినుతకావ్యాగమవిమలమానసుడు
పాలితాచారుం డపారధీశరధి భూలోకనిధి గోనబుద్ధభూవిభుడు
ఆచంద్రతారార్కమై యొప్ప మిగుల భూచక్రమున నతిపూజ్యమై నొప్పు
అసమానలలితశబ్దార్థసంగతులు రసికమై చెలువొందు రామాయణంబు
బరగ నలంకారభావనల్ నిండ కర మర్థి నీ యుద్ధకాండంబుజెప్పె

* * *

ఎందాక కులగిరు లెందాక తార లెందాక రవి చంద్రు లెందాక దిశలు
ఎందాక భువనంబు లెందాక జలధు లెందాక వేదంబు లెలమి దీపించు
అందాక నీ కథ యక్షరానంద సందోహళాచారమై యెన్నబరగు

విశేషాంశములు :

విషునామసంవత్సర పుష్యబహుళ ౧౦ శుక్రవారంవరకు రంగనాథరామాయణం ప్రతిలో వున్నక్రమాన చూచి .... సంగన్న వ్రాసినది.
ప్రతి అలతిగా క్రిమిదష్టమైనది. లిపి స్పష్టము. వ్రాతదోషము లంతగా లేవు.

# రంగనాథ రామాయణము

## గోన బుద్ధారెడ్డి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 314 | కాల్ నెం | : టి 3-331 |
| ప్రతి | : తాళపత్రము,సమగ్రము | పత్రములు | : 353 |
| ప్రతిపరిమాణము | : 43.5×4 సెం.మీ | పత్రపంక్తులు | : 7 నుండి 9 |

విశేషాంశములు :

ప్రతివిలేఖనము. వికారోధికృతు నామసంవత్సర ఫాల్గుణ శుద్ధ ౭ గురువారంవరకు కొరపాటివెంకట్రాముడు వ్రాసిన రంగనాథరామాయణం షట్కాండలు సంపూర్ణంగా వ్రాసెను.

సమగ్రము. క్రిమిదష్టమైనది. అలతిగా శిథిలావస్థలో నున్నది. వ్రాత చక్కనిది. వ్రాతదోషము లల్పము.

# రంగనాథ రామాయణము

## గోన బుద్ధారెడ్డి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 311 | కాల్ నెం | : టి 3- 328 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 337 |
| ప్రతిపరిమాణము | : 45.5×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 నుండి 8 |

విశేషాంశములు :

ఇందు పెక్కుపత్రములు లోపించినవి. ఇందలి కాండలన్నియు సంపూర్ణముగా లేవు. బాలకాండ - అసమగ్రము. అయోధ్యకాండ సుమారు రెండుమూడుపత్రము లున్నవి.

అరణ్యకాండ అసమగ్రగము. కిష్కింధ, సుందర, యుద్ధకాండలు గలవు. వాటియందును గ్రంథపాతములు గలవు. కొన్ని పత్రములు శిథిలమై యున్నవి.

# రంగనాథ రామాయణము

## గోన బుద్ధా రెడ్డి

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : | 8[illegible] | కాల్ నెం | : | టి 3-326 |
| ప్రతి | : | తాళపత్రము;అసమగ్రగము. | పత్రములు | : | 279 |
| ప్రతిపరిమాణము | : | 46.×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : | 8 |

విశేషాంశములు :

ఈ ప్రతిలోని యుద్ధకాండ యందు సుమారు 28 పత్రములు లోపించినవి. గ్రంథము క్రిమిదష్టమై యున్నది. ఇందు బాలకాండనుండి యుద్ధకాండవరకు గలదు.

# రంగనాథ రామాయణము

(బాల, అయోధ్య, కిష్కింధ కాండలు)

## గోన బుద్ధారెడ్డి

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : | 808; | కాల్ నెం | : | టి3-332 |
| ప్రతి | : | తాళపత్రము;అసమగ్రగము | పత్రములు | : | 186 |
| ప్రతిపరిమాణము | : | 39.5×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : | 5 నుండి 7. |

విశేషాంశములు :

ఈ ప్రతియందు అయోధ్యకాండ ముగింపు పత్రములు, కిష్కింధకాండ ప్రారంభ పత్రములు లేవు. ప్రతి క్రిమిదష్టమై శిథిలావస్థలో నున్నది. వ్రాతతప్పు లధికము.

# రంగనాథ రామాయణము

(బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర కాండలు)

## గోన బుద్ధారెడ్డి

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 302 | కాల్ నెం | : టి3-327 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము | పత్రములు | : 219 |
| ప్రతిపరిమాణము | : 43 × 4 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 నుండి 7 |

విశేషాంశములు

ఈ ప్రతియందు బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ సుందరకాండలు సంపూర్ణముగా గలవు. ఇందు మూడు తాళపత్రములు మాత్రము లోపించినవి.

ప్రతి అచ్చటచ్చట క్రిమిదష్టమై యున్నది. వ్రాత బాగుగా నున్నది.

# రంగనాథ రామాయణము

(యుద్ధకాండ)

## గోన బుద్ధారెడ్డి

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 538 | కాల్ నెం | : టి 3-330 |
| ప్రతి | : తాళపత్రము,అసమగ్రము | పత్రములు | : 265 |
| ప్రతిపరిమాణము | : 41 × 3.5 సెం.మీ | పత్రపంక్తులు | : 7 |

విశేషాంశములు :

ఇందు కేవలము యుద్ధకాండమాత్రమే గలదు. అదియును అసమగ్రము. గ్రంథము నందలి ప్రతిపత్రము క్రిమిదష్టమై యుండి శిథిలావస్థలో యున్నది. మధ్య మధ్య పెక్కుపత్రములు లోపించి యున్నవి.

# రంగనాథ రామాయణము
(యుద్ధకాండ)

## గోన బుద్ధారెడ్డి

ఆక్సెషన్ నెం : 1514   కాల్ నెం : టి3-333

ప్రతి : తాళపత్రము;అసమగ్రము.   పత్రములు : 125

ప్రతిపరిమాణము : 46×4 సెం.మీ.   పత్రపంక్తులు : 7

విశేషాంశములు :

ఈ ప్రతియందు యుద్ధకాండ మాత్రమే గలదు. గ్రంథమందలి పత్రములు బాగుగా నున్నవి. వ్రాత చక్కనిది.

# రంగనాథ రామాయణము
యుద్ధకాండ

## గోన బుద్ధారెడ్డి

ఆక్సెషన్ నెం : 812   కాల్ నెం : టి3-329

ప్రతి : తాళపత్రము;అసమగ్రము.   పత్రములు : 85

ప్రతిపరిమాణము : 45×3.5 సెం.మీ.   పత్రపంక్తులు : 6 నుండి 8.

విశేషాంశములు :

ఈ ప్రతి మిక్కిలి క్రిమిదష్ట మగుటయేగాక శిథిలమై యున్నది. పెక్కుపత్రముల వరుసక్రమసంఖ్యలు లోపించినవి. ఉన్నపత్రములైనను సక్రమముగా లేవు.

# రంగరాయ విజయము
## దిట్టకవి నారాయణకవి

ఆక్సెషన్ నెం. . 3643   కాల్ నెం. : టి 3-225.

ప్రతి : తాళపత్రము; అసమగ్రము.   పత్రములు : 84

ప్రతిపరిమాణము : 32.5× 3 సెం.మీ.   పత్రపంక్తులు : 5

శ్రీమద్భూమి ధవ .... .... .... వామాంకసీ
మా మధ్యంబున జేర్చి లోకవితతి న్మన్నించు ధన్యుండు లీ
లామర్త్యాకృతి రాఘవుండు సుగుణాలంకారు మల్రాజు శ్రీ
రామరాయ వసుంధరాధిపు కృపం రక్షించు నశ్రాంతమున్.

మ. విమలాంభోజ సువర్ణకర్ణిక పయి న్వెల్గొందు పూబోడి చం
ద్రము సైదోడగు ముద్దరాలు మురజద్వక్షస్థలిం బొల్చుకౌ
తమయాఖానన పాలవెల్లిని సు ...తాంద్రమా ధరోత్క్షిపతం
సము మల్రాజు కులాబ్ధి చంద్రముని మహైశ్వర్యాన్వితుం జేయుతన్.

చ. తొలుబలుకుల్ సుజానన చతుష్టయ మార్గవినిర్గతంబు లై
నెలకొని .... వ్నధర్మములనిర్ణయమల్ ప్రకటింపుచుం జగం
బులు వెలయింపగా తెలగు....రాయురోన్నతుల్
పొలుపుదలిర్ప రామనృప పుంగవమౌళి కొసంగు గావుతన్.

* * *

గీ. ఇట్లు చనుదెంచుచున్న సూరాగ్రయాయి జన....కాయంబు గాంచి యాశ్చర్యమంది
తత్పురీగూఢచరు ఒకి త్వరిత నేగి మరుదధీశ్వరు గాంచి నమస్కరించి.

శా. దేవా దేవరవీటి కెవ్వరో ధరిత్రీభాగ మందుండి తే
జోవైశ్వానరు లాటిరంగునరు లక్షుద్ర ప్రభా....భా
హావిక్షేపిత శాతహేతి రుచి ధారా కృష్ణ దుష్టాహిత
ష్మాప ర్వెం జిరు లేగుదెంచి రన నాశ్చర్యం బవార్యంబుగన్.

సీ. ఉచ్చైశ్రవంబు చుంబొడిసిపట్టి చవాల్న నెగసి యెక్కమ్మడి నెక్కువారు
నందనోద్యాన మందార శాఖల వంచి యొరపుగా నుయ్యాల లూగువారు
కామధేనువు నడ్డుకట్టి గుమ్ములుగ్రోల యా బెయ్య యిది మంచి దనెడువారు
సురసల్కినక తామర ....మ్ములిడబోక తెమలిం .... .... ....వారు

జలవిహారవర సాహచర్య లమర నమర కన్యా కపోల స్తనాతి చిత్ర
మకరికా పత్రముల చూపుమాపువారు నగుచు నెల్లెడ వారయెరిగ విరోధి.

ముగింపు :-

ఉ. ఆపద నంతరంబున మహాకులితం శిబిరంబులో జన
ప్రాత మొనర్చు క్రిందునవిరావముచే నిజమన్న వార్త వా
క్రాతతిశూన్యమై కలవరంపులనంబున నెట్లొకాక య
న్నీతి ఫరాంసురేడు కొలిపించె నగాదులపై.

గీ. ఆ ఫిరంగుల రవలికి నా నృపాలు శిబిరమెల్ల బికబికలై బెదరిపార
నపు డరాజకమైన తధావసదము కొల్లపరచిరి కల్లరు కొల్లకాండ్రు.

సీ. సంపూర్ణరుచి మించు చంద్రబింబము లేక పరగెడు సత్పత్రపటలిమాడ్కి
వృషభపానం బైనవిహ్వలత్వము గాంచి కనుకనిపరిచు గోగణముభంగి
సురుచిరాకృతి బొల్చు తరళరత్నము పీడి తొరగెడు ముత్తెపుసరముపగిది
కరచరణాది రేఖాప్రైఖడులు గల్గి శిరము గానని కళేబరముకరణి
చతురచతురంగబలసమున్నతము లగుచు రాజమణి హూన్నమగుట నిస్తేజమగుచు
తన్మహారాజ .... ....
.... .... .... ...

**విశేషాంశములు :**

ఈకావ్యమునకు "రంగరాయవిజయ" మనియు "రంగరాయకదనరంగచరిత్ర" యనియు రెండుపేర్లు కలవు. ఇది మూడాశ్వాసముల కావ్యము. బొబ్బిలియుద్ధ వృత్తాంత మిందలి వస్తువు. బెల్లముకొండ దుర్గాధిపతి యగు మల్రాజు రామరాయలు కోరుటచే ఈ రంగరాయవిజయకావ్యమును రచించి ఆయనకే అంకిత మిచ్చెను. ఈ కవి రామభక్తుడనని చెప్పుకొనెను.

ఈ ప్రతియందు ఆది కలదు. కాని ప్రథమాశ్వాసమున 17 తాళపత్రములు, ద్వితీయాశ్వాసమున 17 పత్రములు, తృతీయాశ్వాసమున 30 పత్రములు లేవు. ఉన్న ప్రతియందు 84 పత్రములే కలవు. తుదిపత్రముకూడ లేదు. ఉన్న పత్రములు కూడ చాల శిథిలములై క్రిమిదష్టమై యున్నవి. కొన్ని సగభాగములే యున్నవి. ప్రతి చాలా నలుపు దిరిగినది. పద్యములలో కొంత కొంత భాగమునకై వ్యవధానము వదిలివేయ బడినది. భాషాదోషములు పెక్కుగలవు. ప్రతివిలేఖరి కొన్ని పద్యములను పూర్తిగా వదిలివేసెను. కొన్నిటిని ముందు వెనుకలుగా వ్రాసెను. కొన్ని పద్యపాదములుకూడ ముందు వెనుకలై యున్నవి. లిపి స్పష్టము.

# రంగరాయ విజయము

## దిట్టకవి నారాయణకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4689 | కాల్ నెం | : టి 3-105 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 69 |
| ప్రతిపరిమాణము | : 34×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 |

**విశేషాంశములు :**

ఈకావ్యమునకు రంగరాయవిజయ మనియు, రంగరాయ కదనరంగచరిత్ర యనియు రెండుపేర్లు కలవు. గ్రంథము క్రిమిదష్టమైనది. గ్రంథపాతము కలదు. అలతిగా శైథిల్యముకూడా గలదు. ఇందు 3వ ఆశ్వాసమున చివరిభాగము లోపించినది. ప్రథమాశ్వాసమున పీఠికాభాగమునకు సంబంధించిన పత్రములు లుప్తమైనవి. వ్రాత చక్కనిది. ప్రాచీన పత్రములలోని లిపికన్న ఈ ప్రతియందలి లిపి కొంత పరిణతి చెందినది.

# రంభా నలకూబరోపాఖ్యానము

## వెంకయాఖ్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 3823 | కాల్ నెం. | : టి 3-272 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 47 |
| ప్రతిపరిమాణము | : 48X4 సెం మీ. | పత్రపంక్తులు | : 7 నుండి 8. |

ప్రారంభము :

ఉ. శ్రీమిథిలాత్మజ న్మహిత శ్రీల వరించి యశేషభార ....
....మిభరంబు బాపుటకు భార్గవు నొంచి సురల్ నుతింపగా
వ్యోమచరాధిపుం చరను వెక్కసబెట్టు నిశాచరాధమున్
భీమ పరాక్రమంబునను బింక మణంచిన రాము గొల్చెదన్.

శా. ఏదేవుం డరుదెంచి చూచి తెరు పీయంచుం....న్వేడినం
పాదుం జూపక మూర్ఛమొంది మరియుం పైబొంగు నా నీరధిం
కాదంచు న్వడి లేచి తీవ్ర శరవేగాగ్ని న్నివారించు నా
వేదాంతాఖిల వేద్యు రామవిభుని న్వేమారు గీర్తించెదన్.

* * *

క. తత్కథ ప్రారంభించెద మత్కావ్యమునందు తాము మనుసించి దయన్
యత్కించెను దనక ....చ మత్కార మొసంగవయ్య మా హృదయేశా.

సీ. త్రిభువన లక్ష్మి యీ తెరగున సిల్చిన దన త్రిదివం బన దనరి వెలసె
సుధవాల కదలిలో సురభికూడియు వచ్చి నామోదమున నిల్వ నాక మయ్యె
యజ్ఞపురోడాశ మమిత భాగంబులు సౌరది గొనుట గాన స్వర్గ మయ్యె
నిమిగూర్చు నిమిషంబు నెడ గలించుట జేసి లోకమం దనిమిషలోక మయ్యె

వెలయు ముక్తికి మార్గంబు విశద మగుచు పితృదేవత లెప్పుడు పెంపు తోడ
దేవతలగూడి వర్తించ దేవయోగ్య మైన సురపురి బెంపొందె మహిమ తోడ.

ముగింపు :—

గీ. ఇవ్విధంబున పురుషుండు నేపురేగి మించి జలకేళి చేయంగ మేలిమైన
సతులు తమతోన నుప్పొంగి సరసగతుల అంబురాశిలో జనిరి ప్రేమంబు లెసగ.

మ. ఇటులా కాంతలు వార్ధి జొచ్చి యెలమిం యింపొంది ముంజేతులం
తటినీజాత సువర్ణ పంకజ మరందాసక్త దానేచ్చచే
పటురావంబులు జేయు షట్పదములుం పల్మారు బారంగ యా
తటికాళిలన్ తదహల్దిరి? సరిద్వారిం మహావేడుకన్.

వ. మరియును.

సీ. ఒకమోషి ఘనకేశ నికరముల్ దేలేడ నీద గాయమునను నేర్పు దెలిపె
నొకయింతి యతి కాంతి నికరమౌ దరహాస మొదవ సరస్వతి మురవు జూపె
నొక బాల యక్కజమున నింపు శ్రీగంధ మును గలయ గంగతో ముద్దుజూపె
నొకలేమ ముఖచంద్రు నొదవించుటకుజేసి చంద్రభాగానదీ చెలువు జూపె
కలిత కలకంఠ కలకంఠ కలరవంబు లెంమి గావించి .... ....

.... .... .... .... .... .... ....

**విశేషాంశములు :**

ఈ కావ్యమును కవి శ్రీరామచంద్రున కంకితము గావించెను. ఇష్టదేవతా ప్రార్థన గురుజన వందనము, సుకవి కీర్తనము, కుకవి నిందయు గావించి షష్ఠ్యంత వృత్తము వ్రాసెను. ప్రారంభమున శ్రీరామచరిత్రను క్లుప్తముగా వ్రాసెను. ఉత్తర రామాయణము నందలి రంభానలకూబర చరిత్ర నాధారముగ దీనిని రచించితి నని కవి కావ్యాదిని పేర్కొనెను. ఇది మూడా శ్వాసముల గ్రంథము.

ఈ ప్రతియందు తుది పత్రములు రెండు ఇరుప్రక్కల శిథిలమై నష్టమైనవి. ఇందలి లిపి స్పష్టము. అక్షర దోషములు స్వల్పముగా గలవు. ప్రతి కొంత నలుపు దిరిగినది.

# రఘు వంశము

(1నుండి 8సర్గలు)

| | | | | |
|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 6080 | కాల్ నెం. | : | బి 3-609 |
| ప్రతి | : కాగితము; అసమగ్రము. | పత్రములు | : | 62 |
| ప్రతిపరిమాణము | : 16 సెం.మీ. X 21.4 | పత్రపంక్తులు: | | 24 నుండి 33 |

ప్రారంభము :

(మొదటిసర్గ)

కం. వాగర్థంబులబోలె స దా గూడియు జగతికెల్ల తలిదండ్రులు ("దంపతులును") నౌ
నా గౌరీశంకరులను వాగర్థప్రసిద్ధికొరకు వందింతు నెడన్.

(లేక)

తే.గీ. వాక్కు నర్థంబు బోలెను వరుసగూడి జగతికెల్లను పితరులై జరుగునట్టి
పార్వతీపరమేశ్వరవరుల కెపుడు వాక్కు నర్థంబు జ్ఞానంబు వరలుకొరకు
వందనం బాచరింతు నే వ్రాలి యెపుడు. 1

కం. ఎక్కడి సూర్యవంశము ఎక్కడి నా యల్పమేధ, యెరుగక యింతన్
అక్కట దుస్తరసాగర మొక్కట దాటంగ నెంతు నుడుపము చేడన్. 2

కం. మందుడ కవి కీర్త్యాశను నెందును ప్రాంశునికి మాత్ర మేర్పడ దొరికే
పొందౌ ఫలముల కుబ్జుడు నందగ చేజాచి గేలి యగు నట్లగుదున్. 3

కం. ఆజన్మశుద్ధులున్ మరి యోజన్ ఫలసిద్ధివరకు నుడుగనివారున్
ఆ జలధి వేల భూపుల్ భ్రాజిత మానాకరథ సువర్మము వారున్. 5

ముగింపు :

తే.గీ. పూలమాలిక శోభన పుష్పమయము పెడదయురమున (జొమ్ముగ) వ్రేలం
(గపుడమిరేడు) వరేణ్యు డతడు
బాహు (లతికల) పాశాల యా బాలఁబట్టి తనను మెదను వ్రేలెడు భంగిగా నెదద నెంచె
84

ఆ.వె. జలద ముక్తశశిని గలిసె నీ కౌముది సముని జలధి జొచ్చె జహ్నుకన్నె
అనుచు నేకరీతి సమగుణంబుగ ప్రీతి జనము పేరు లనిరి నృపు చెవులు సూడ.
85.

తే.గీ. ఒకట మోదించు పరపక్షనికర మొప్పి ఒకటి దుఃఖించు నృపపక్షనికర మొప్పి
ఉషసి వికసించు పద్మంబు లొక్కయెదను మొగుడు కుముదంబు లింకొక్క-
యెదను గలుగు
సరసిబోలెను నప్పుడా సభ గనంగ. 86

(ఆరవసర్గ సమాప్తి.)

విశేషాంశములు :

కవి గ్రంథమునం దనేకచోట్ల ప్రాస, పద్య పాద సంఖ్యా నియమములను పాటించలేదు. లిపి సులభ గ్రాహ్యము. కొన్నియెడల పాఠాంతరములు గలవు.

# రాఘవాభ్యుదయము

## చింతలపల్లి ఛాయాపతి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం : | 443. | కాల్ నెం | : టి3-28 |
| ప్రతి | : తాళపత్రము:సమగ్రము. | పత్రములు | : 124 |
| ప్రతిపరిమాణము : | 33×3.5 సెం.మీ | పత్రపంక్తులు : | 6 |

ప్రారంభము :

.... .... .... .... .... .... మెరయగ లీలా
ఖేలాకలితి మురళీ గో పాలప్రభు లీవుతన్ శుభంబులు మాకున్॥



ఏతద్వ్యనాభియందేర్ప .... .... .... ....
.... .... .... .... నిరవొంద నరవిందమందిరమైన సత్పదవి వెలది
యే ధన్యునంఘ్రి యందివురించె జగదేకపావనియై ముత్తోవచెలువ
యే కాంతుతనయుడై యి........ జగమ్ములు గెల్చి చెలువువాడు
.... విశ్వాదిమూలరూపానురూప దివ్యసౌభాగ్యశాలియై తేజరిల్లు
శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గపాణి ధీచమత్కృతి మత్కృతి .... గాత ॥.

* * *

వ. సమర్పితంబుగా నవరసానుప్రాసభాసురవృత్తి ఛేకాద్యలంకారపాత్రచిత్రకవితాను బంధంబుగా నా యొనర్పంబూనిన రాఘవాభ్యుదయం బను మహాప్రబంధంబునకు కథాప్రారంభం బెట్టిదనిన ।

సీ॥ శ్రీదమై పశ్యద్వినోదమై సంతతా మోదమై బుధజనాహ్లాద మగుచు
కాంతమై రవికులాక్రాంతమై యనుగతా కాంతమై లక్ష్మినిశాంతమగుచు
రామమై బహుగృహారామమై ప్రతిపద గ్రామమై విద్విషద్భీమమగుచు
ఆద్యమై సర్వదాభేద్యమై జయరణ ద్వాద్యమై వసుధాభివాద్యమగుచు
పరగె నంతితదంతరాంతరనిరూఢ శశిశిలాసౌధరుచిరాగ్రశాతకుంభ
కుంభచుంబిమరుద్ధునీజలంభదచ్ఛ భువనపూరంబు సాకేతపురవరంబు ॥

ముగింపు :

కవిరాజవిరాజితం :

శ్రితజనపోషణ చిత్రవిభాషణ సింధురపోషణ సేవ్యమహా
ప్రతిమపచఃకవిరాజవిరాజిత రమ్యగుణోన్నత రామహరీ
శతమఖముఖ్యదిశాపతి సంతతసన్నుత నిశ్చల సారశుభ
వ్రతహిత యాదవరాజమణి ఫణిరాజశయాన ధరాజయదా ॥.

ఉపేంద్రవజ్ర :

ఉపేంద్రవజ్రప్రణుతోరుకీర్తి ద్విపేంద్ర సంరక్షణ దివ్యవృత్తి
నృపేంద్ర సంపూజిత నిర్మలాంఘ్రి కృపీటజాక్ష ప్రియకృష్ణ శౌరీ ॥

మంగళమహాశ్రీ వృత్తం :

శ్రీధర సురాదర హరీదరహరా వరధురీణ గురుమంగళ మహాశ్రీ
సాధుగుణయోధ జనసాధకసుసాధన .... శార్ఙ్గధర నందక గదారీ

బోధి నిరుపాధి కవి బోధన దనుబోధసమగాధ   యశరాధా
రాధిత వినోద కవిరాజ సువిరాజిత సరాజ   సవి రాజరథ రూఢా ॥.

**గద్య :**

ఇది శ్రీ మురళిగోపాల లీలాబ్రహ్మకృపాలబ్ధ వర పరిస్ఫురదుభయ కవితా నిరంకుశ ప్రసాగ్రమాంజ్యతేజః శాశ్వతాశ్వలాయన సూత్ర పవిత్ర చిత్ర కళావినిశ్చింత చింతలపల్లి శ్రీవీర రాఘవకవిపౌత్ర గోపాలభట్టశిరోమణిపరపుత్ర సకలసుధీ జనవిధేయ ఛాయాపతి నామధేయ ప్రణీతంబైన రాఘవాభ్యుదయం బను మహాప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

**విశేషాంశములు :**

గ్రంథ మచ్చటచ్చట క్రిమిదష్టమైయున్నది. వ్రాతబాగుగానున్నది. మొత్తం 6 ఆశ్వాసముల గ్రంథము.

ఈ కవికి చిత్రకవిత్వమనిన మిక్కిలి ఇష్టముగా దోచుచున్నది. నవరసాలంకారయుక్తముగా రచించినట్లు పీఠికలో పేర్కొనెను. ఇతనికి శబ్దాలంకారములయందు ప్రీతి మెండు. వ్రాతయందు స్వల్ప దోషములు కలవు. పద్యములయం దచ్చటచ్చట కొన్ని అక్షరలోపములు గలవు.

# రాఘవాభ్యుదయము

## చింతలపల్లి ఛాయాపతి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 545 | కాల్ నెం | : డి3-35 |
| ప్రతి | : తాళపత్రము:అసమగ్రము. | పత్రములు | : 75 |
| ప్రతిపరిమాణము | : 45×3.6 సెం.మీ | పత్రపంక్తులు | : 6 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియం దైదాశ్వాసములు మాత్రమే యున్నవి. ప్రతి చాలవరకు క్రిమిదష్టమై శిథిలావస్థలో నున్నది. గ్రంథాద్యంతములు లేవు. అటనట కొన్నిపత్రములు లోపించినవి. మరికొన్ని విరిగిపోయినవి. వ్రాతదోషము లధికము.

# రాఘవ పాండవీయము

## పింగళి సూరన

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 2748 | కాల్ నెం | : ట 3-34 |
| ప్రతి | : తాళపత్రము ; సమగ్రము | పత్రములు | : 51 |
| ప్రతి పరిమాణము | : 41.5×3.5 సెం.మీ | పత్ర పంక్తులు | : 8 |

ప్రారంభము :

శా. శ్రీ తోఁ బుట్టి సుధామధుద్రవముతోఁ జెన్నొందు పుష్పంబుఁ దో
ఘా తారుణ్యా మెలర్పగాఁ మిడుచు పంపాహేమకూట శ్రియ
ఖ్యాత బ్రహ్మము బ్రోచు గావుత విరూపాక్షాహ్వయం బాకుపీ
టి తిమ్మప్రభు వేంకటాద్రి హృదయా టికంబు లోకంబులన్.

శా. శ్రీ చన్గొండలు రెండు నండగొని వాసిం బేర్చు చన్పక్తి సొ
మీచిన్యామల పెద్దవేంకట నృపోస్మిల న్మనశ్చాతక
వ్యాచక్రంసకు గైవసం బయిన దోదంచత్కృపాదృష్టి స
ద్రీచీనం బగు కృష్ణమేఘము జగత్ప్రీతిన్ దగన్ జేయుతన్ ॥

* * *

వ. సభక్తి సమర్పితంగా నా యొనర్పం బూనిన రాఘవపాం .... కుం గథా ప్రారంభం
బెట్టి దనిన.

కం॥ వెలయు నఖిలభువనములలోన వారణనగరి పురమతల్లి నా దనర్చి
రాజ్యలక్ష్మి మిగుల ప్రబల నయోధ్య నా రాజ వినుతి గసిన....

కం. ఆ పట్టణ మేలెడు పృథ్వీపాలుఁడు భృకుటి మాత్ర విముఖిత సమదా
టోపారి పంక్తిరథుడు ద్దీపించు నుదార నీతి ధృతరాష్ట్రి డనన్।

చ॥ తెలివి నతి ప్రగల్భ్యుఁడ సద్భృగ్బలు డా .... ....
శలమె సహాయమై యమర శత్రుల నే పదప న్వలంతియై
నిలుకడ నేలె విశ్వధరణిం దనమిత్రకులంబు వైభవో
జ్జ్వలత దలిర్ప బౌరవ సుసంతతి రాజుల కెల్ల హెచ్చుగన్

ముగింపు :

వ. ఆ సమయంబునందు.

గీ॥ మౌనిపద విస్పృష్ట మహిత నవోత్పన్న కుశల వసుసమృద్ధి వశత నొదవు
కొదవ లెల్ల దీర్చుకొని యవ్విభుండు గా వించె నశ్వమేధ విధులు వెలయ

సీ॥ శ్రీధాన్యకటకమై చెలువొందె రాజ్యంబు నెలమూడు వానలు నెలమి గురిసె
బాడిని పంటను బ్రజలు విజృంభించి రరి విపద్వ్యతపత్తి యస్త మించె
రోగాపమృత్యు వార్తాగంధ మెడలెను జార చోరాదుల పేరు నుడిగె
వర్ణాశ్రమాచార వర్తన ల్కడు నొప్పె ధర్మంబు నాల్గు పాదములు నడచె

గీ॥ రామభద్రుండు సన్మార్గ రక్షణైక పరుడు దిగ్దంతి సీతకీర్తి పాండు సూను
డుర్విపై చతురాత్మానుజోప చరిత చరణు డగుచు సామ్రాజ్యంబు సలుపు నపుడు.

శా॥ దేవా దేవర ప్రేరణంబున నయుద్దీపించు వాగ్వైభవ
శ్రీ విస్ఫూర్తిని రామ భారత కథా శ్లేష ప్రబంధోత్త మం
బావిర్భావము నిట్లు జెందె నిది భవ్యాభవ్యతల్ జూడ కిం
పై వర్తిల్లు బరిగ్రహింపుము విరూపాక్షా జగద్రక్షకా.

శా॥ క్రీడామాత్ర కృతిత్వమూర్తి భరణాంగీకార చూడాపరి
వ్రాడాదిత్యధునీ పృషత్పృషిత పంపాశైత్యవేదోమరు
ద్రాడారాధితపాద యంత్రమినబ చంద్రద్యోతసిద్యత్పురి
వ్రాడా ఖండల మండలీ హృదయ జీవంజీవ సంజీవనా।

కం. కారుణ్య విభవలక్ష్మీ తారుణ్య సదోపభోగ ధన్యకటాక్షా
శారీరార్ధ సులాలిత గౌరీ రాజ్యమాన క్రమాపేక్షా

కలహంస వృత్తము :

హిమనగేంద్ర తనయేక్షిత లక్ష్మీ స్తిమిత పుణ్యఫలదేహ విలాసా
విమల భక్తి పెదవేంకట ధాత్రీ రమణ మానస నిరంతర వాసా.

గద్య :-

ఇది నిఖిల సూరి లోకాంగీకార తరంగిత కవిత్వ వైభవ పింగళి యమలనా మాత్య తనూభవ సౌజన్యజేయ సూరయ నామ ధేయ ప్రణీతం బైన రాఘవ పాండవీ యంబు నందు సర్వంబును జతుర్థాశ్వాసము.

విశేషాంశములు :

ప్రతి వివేకనము : పింగళ నామ సంవత్సర కార్తీక బహుళ ౭ ఆదివారం రోజున వ్రాత యారంభించి పింగళ నామ సంవత్సర మాఘ బహుళ ౧౦ సో సిద్ధి, రాఘవ పాండవీయం సంపూర్ణంగా పోతుల పెదరాజ నార్యు వ్రాసిన పుస్తకము చూసి శ్రీరామార్పణముగా కొమ్మనా పల్లి సన్యాసి కుమాళ్ళు కృష్ణమ్మ వ్రాసుకొనెను.

గ్రంథమునందు సుమారు 4 పత్రములు శిథిలమై యున్నవి. వ్రాత తప్పులు కలవు.

కవి ఆపస్తంభసూత్రుడు. పింగళి సూరకవికి పౌత్రుడు. అమరన్న, అబ్బమ్మల పుత్రుడు, అమలన, ఎఱ్ఱనలకు నగ్రజుడు.

కృత్యాదిపద్యమునందు చెప్పబడిన అకువీటి తిమ్మప్రభువు కృతికి ప్రత్యక్ష నియామకుడేగాని కృతిపతి మాత్రము కాదు. దీనికి నిదర్శనముగా ఈ క్రింది పద్యమును పేర్కొన వచ్చును.

"దక్షత యింత కల్గి విశదంబుగ గాంచి యు నీ మదిన్ ఫలా
పేక్ష ఘనంబుగామి నిది యిట్లని గొంకెద నీకు నోలలా
పేక్షణ భక్తి శీల ! రచించుట యిష్ట .... విరూ
పాక్షున కంకితంబుగ శుభార్థము రాఘవ పాండవీయమున్"

ఈ పద్యమునుబట్టి ఇతడు ఈశ్వరభక్తు డని తెలియు చున్నది. ఇందు రచించిన షష్ఠ్యంతములు విరూపాక్షు నుద్దేశించి వ్రాయబడినవి. అట్లే ఆశ్వాసాంత పద్యములు కూడ ఈశ్వరు నుద్దేశించియే వ్రాయబడినవి. ఇది నాల్గాశ్వాసముల గ్రంథము.

ఇది ద్వ్యర్థికావ్యము. ఇట్టి కావ్యమును తొల్లి భీమన రచించె నని ప్రతీతి కలదు గాని గ్రంథ మలభ్యము.

ఒక కథవినియెడి సమయమందు వేరొక కథను వినుటకు ప్రయత్నించిన యెడల నేయర్థము స్ఫురించక పోవును. కాబట్టి ఒక అర్థముగల కావ్య మెట్లుండునో అట్లే

ఒక దాసి పిమ్మట మరియొకటి అనగా భారతార్థము పిమ్మట రామాయణార్థముగాని ఇట్లే రామాయణార్థము పిమ్మట భారతార్థముగాని చదుకొనవలె నని కట్టడి చేసెను. ఇందు ప్రయోగింపబడిన శ్లేషలను రెండర్థముల నెప్పుడెప్పుట నేయేరీతిగా సమన్వయించు కొనవలె నను ప్రశ్నలకు సమాధానము కూడా యీ గ్రంథమునందు పేర్కొనుట జరిగినది.

# రాఘవపాండవీయము

## పింగళి సూరన

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 3661 | కాల్ నెం | : టి 3-283 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము | పత్రములు | : 73 |
| ప్రతి పరిమాణము | : 34.5×3.5 సెం.మీ | పత్రపంక్తులు | : 6 |

**ప్రతివిలేఖనము :**

సర్వధారి నామ సంవత్సర నిజ ఆషాఢ శు ౧ స్థిరవారం పరరోజువరకు రాఘవ పాండవీయము నాల్గు ఆశ్వాసములు సంపూర్ణంగాను, అమిరెపు అబ్బిరాజు కొమారుడు అప్పలరాజు వ్రాసెను.

ఈ ప్రతియందు నాల్గు ఆశ్వాసములు పూర్తిగా గలవు. కాని పతి నలుపుదిరిగి కొలదిగా క్రిమిదష్టమైనది. లిపి స్పష్టముగా నున్నది. అక్షర దోషములు కొలదిగా నున్నవి.

# రాఘవపాండవీయము

## పింగళి సూరన

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 707 | కాల్ నెం | : టి 3-113 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము | పత్రములు | : 82 |
| ప్రతి పరిమాణము | : 23×3.5 సెం.మీ | పత్రపంక్తులు | : 8 |

విశేషాంశములు :

ఈ ప్రతి నలుపుదిరిగి యున్నది. కొన్ని పత్రముల చివరలు శిథిలము లైనవి. కొలదిగా క్రిమి దష్టమైనది. మధ్య రెండు పత్రములు మాత్రము లోపించినవి. మొత్తముమీద ఈప్రతి సమగ్ర మనియే గ్రహించ వలెను. లిపి స్పష్టముగ నున్నది. అక్షర దోషములు స్వల్పముగ నున్నవి. ఇందు నాలుగు ఆశ్వాసములున్నవి.

ఈప్రతి శుభకృతు నామ సంవత్సర మాఘ శుద్ధ ఏకాదశి నాటికి వ్రాయబడినది.

# రాఘవపాండవీయము

## పింగళి సూరన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3998 | కాల్ నెం | : టి 3-266 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 64 |
| ప్రతిపరిమాణము | : 36×3.5 సెం.మీ | పత్రపంక్తులు | : 6 |

విశేషాంశములు:

ఈప్రతియందు నాలుగు ఆశ్వాసములు పూర్తిగా నున్నవి. ప్రతియొక్క ఊర్ధ్వ, అధో భాగములు కొద్దిగా శిథిలమై ఒక్కొక్క పంక్తి మాత్రము లోపించినది. లిపి స్పష్ట ముగ నున్నది. అక్షర దోషములు కొలదిగా కలవు.

# రాఘవపాండవీయము

## పింగళి సూరన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4685 | కాల్ నెం | : టి 3-87 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 57 |
| ప్రతి పరిమాణము | : 44×3 సెం.మీ | పత్రపంక్తులు | : 6 |

విశేషాంశములు :

ప్రతి స్వల్పముగా క్రిమిదష్టమైనది. కొన్ని పత్రములు కొంతభాగము శిథిలమైనవి. ప్రతి నలుపు దిరుగ నున్నది. లిపి స్పష్టము. ప్రతి విలేఖన దోషములు కలవు. ఇందు నాలుగు ఆశ్వాసములు కలవు. ప్రతి రెండవ పత్రమునుండి కలదు.

# రాఘవపాండవీయము

## పింగళి సూరన

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 4012 | కాల్ నెం | : టి 8-271 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 41 |
| ప్రతి పరిమాణము | : 41×3 సెం మీ | పత్రపంక్తులు | : 7 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు మొదటి మూడు ఆశ్వాసములు పూర్తిగను, నాలుగవ ఆశ్వాసము కొంతయు గలదు. ప్రతి బాగుగ నున్నది. ఇందు నాల్గవ ఆశ్వాసములో కొంత నుండి వ్యాఖ్యానము కూడ గలదు. మొదటి మూడు ఆశ్వాసములలో లేదు. కాని చివర కొన్ని పద్యములకు టీక, భారత, రామాయణార్థములు వ్రాయబడినవి. గ్రంథాంత మిందు లేకుండుటచే వ్యాఖ్యానకర్త వివరములు తెలియుట లేదు. అక్షరములు నిర్దోష ములు. లిపి స్పష్టము. ప్రతి బాగుగానున్నది. అసమగ్రము.

# రాఘవపాండవీయము

## పింగళి సూరన

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 710 | కాల్ నెం | : టి 8-50 |
| ప్రతి | : తాళపత్రము: అసమగ్రము | పత్రములు | : 81 |
| ప్రతి. పరిమాణము | : 36×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 |

**విశేషాంశములు :**

గ్రంథము మిక్కిలి క్రిమి దష్టమైనది. శిథిలావస్థలో నున్నది. గ్రంథపాతములు కలవు. గ్రంథ మసంపూర్ణము. ఇందు రెండు ఆశ్వాసములపై కొంతభాగము కలదు. ప్రథమాశ్వాసమున పీఠికాభాగము లుప్తమైనది.

ఇందు టీకకూడా గలదు. టీక విపుల మైనది గాదు. మిక్కిలి సంక్షేప రూపమున గలదు. వ్రాత దోషము లధికము. టీక క్రమపద్ధతిలో వ్రాసినట్లుగా కనబడదు.

# రాజవాహన విజయము

## కాకమాని మూర్తికవి

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 8557 | కాల్ నెం | : బి 3-243 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము. | పత్రములు | : 59 |
| ప్రతిపరిమాణము | : 42×8 సెం.మీ. | పత్ర పంక్తులు | : 6 |

ప్రారంభము:

ఉ. శ్రీ యధరోపరిం గుచగిరిం గబరిం దరహాస పీఠికా
ఛాయల యింపు సొం .... లయి చందన కుంకుమ పత్రరేఖలై
యాయత కుంద చంపకములై తగ గన్గొను వేంకటేశ్వరుం
డా యిరుగంటి చూడ్కి జనార్జితమంబు .... దల్పు గావుతన్.

మ. మొగమున్ మైసగమున్ సగౌరనగమున్ మేరూజ్వలజ్జూట ప
న్నగము న్మిక్కిలి కన్ను గన్న మొగమున్ హర్మ్యాయతానేక హా
రగమున్ కొమ్ముల జిమ్ము మేల్తురగమున్ యారోధితాజ్ని ప్రతా
పగమున్ రాజిలు ...జు మాధృపుల కిచ్చున్ శాశ్వతైశ్వర్యముల్.

ఉ. సుద్దుల కన్నె కన్నుగవ చొక్కపు చెక్కులు మోవి నొక్కమై
ముద్దిడు వేళ మోవికిని మోము గోరంత దలంచి వేలుపున్
బెద్దకు పంచ వక్త్ర గని పెంచిన మేటికి పంచవక్త్రి వే
దద్దిర యంచు నవ్వు చతురాస్యుడు మాకు జిరాయు వీవుతన్.

* * *

వ. అంకితంబుగా నా రచింపంబూనిన రాజవాహన విజయం బను ప్రబంధంబునకు
కథా నిబంధనం బెట్టి దనిన.

క. మగధావని మృగధారిని నగధాత సృజించినట్టి నరనాథులకున్
నగరనదగు కుసుమాహ్వయ నగర మ .... రు నగర ....

క. అన్నగరము ....పుసింధూ త్పన్నగరము పన్నగాగ్ర పన్నగరము సం
పన్నగరము విడ వెన్నని యన్నగరము మనుపు నగరి ననిశం బనుటన్.

క. పుటభేదన విప్రులు పద పటిమ భుజంగేంద్రు గుట్టు పరపుచు కృత్యా
త్కట .... వపు ప్రకటింపగ జట చిక్కుల గెల్చు టెంత సాత్యవతేయున్.

ముగింపు :

క. .... .... .... .... పటపట మనుచు గిరులు వగి లెండగిలెన్
చిటచిటచిట మనుచు స్ఫూర్తి గిటగిటగిట మనుచు జనము గ్వసి యించె సెగన్.

గీ. ఏమి చెప్పుదు ....య్యంతతామరసజ వాండభా ... ...
.... .... ....గ్రాల కుమ్మరావమ్ము కరణి జగమ్ము దొరసె

సీ. సికతాతలోద్వగుల్ తెకతెక నడుగంట దుప్పట్లు ద్రొక్కి పాదుకలు దలప
....సదాదు.కాద్వమ్ము లిసుము బూడ్చు .... .... ....
....చేరు నధ్వనీనులు పెలువడ చల్లి చల్లనిగుజ్జు మామిళ్ళు వెదుక
గుజ్జుమామిడి మ్రోక గూర్చు పాంథులు చూతపటలికి చప్పరము లడుగ
చప్పరంబుల .... .... .... .... కాసలు ఘటింప
జంట వణగుప్పె పంకకాసార మగ్న కాసారము లైన నై దాఘ వాసరములు.

సీ. గతిచేతి రాయంచ గలిగించి క్రౌంచాద్రి కంచు మాయూరి .... ...
.... ... .... మించి శరాళి బు ట్టించి నెత్తమ్ముల నొంచు దంత
చలువవల్లి కదంబములకు దావి యొసంగు తేట మైతీగ సంటిన మిటారి
గేదంగి క్రొన్ననల్ జాదిక్రొన్నన చాలు .... .... రయు మేటి
యింద్ర గోపంబు పరపుల నెరయు జాణ గురు పయోధర పాళి యంబరములోన.
దళుకు కులుకంగ దగు వర్ష దగిలె నేని అడుగిడగ నీదు నిజపురీయాత్రకను ....

శా. .... .... .... ....
స్తంభంబుత్తర పార్థి నిల్పి నిజకాంతా సైన్య సంయుక్తుడై
జంభారిక్రియ జేరి యాత్మపురి నిచ్చల్ తల్లిదండ్రుల్ ప్రజల్
సంభాషింప సమస్తరాజ్య పదవీసౌఖ్యంబు .... ....

శా. .... .... ....గ్గాధార గాధారమా
ప్రాధీన స్తుతధీర వాగమృతధారా ధారరాధార సే
యాధైర్యచ్యుతి కృద్ధృతీక్షతమహీ యోధారయోధారధీ
మాఘర్మ .... .... .... శా.

కం. అలమేల్మంగా పాంగా చల చంచచంచలాభిజనన సముద్య
త్కలికాళ్ళ వర్షహర్షిత పులకాంకుర సస్యకృష్ణమా సదృశాంగా.
పృథ్వీవృ .... .... తారుణా ధరాధర ధరాధరాధరణ ధన్యబాహో త్యుదా
ధరాధర హితాఖిల ప్రకల భూసురాగ్రేసరా సరాధర వినంద నాంచ....ర పాంరాయణా

గద్య :

....పట్టభద్ర కాద్ర వేయాధిపవర సమాగత ....రస సారస్వత లహరీ పరిపాక కాక
మానిమూర్తి ప్రబోధ బుధ కవిసార్వ బౌమ పౌత్ర రామలింగ భట్ట పుత్ర కౌండిన్య
గోత్ర భాగ ధేయ .... రాజవాహన విజయం బను మహాప్రబంధంబునందు సర్వం
బును పంచమాశ్వాసము.

**విశేషాంశములు :**

**ప్రతివిలేఖనము :**

జయనామ సం॥ మా .... రవారంవరకు రాజవాహన విజయం 5 ఆశ్వాసము
లున్న దండెమరాజు వేంకట నరసన్నగారి ప్రతిని ఉన్నక్రమానను అమిరెపు
అచ్చిరాజు కొమారు అప్పలరాజు వ్రాసెను.

ఈకావ్యము వేంకటేశ్వరాంకితము. రాజవాహనుని జననము, తైర్థయాత్ర, మృగయా
వినోదము, వివాహము ఇందలి ముఖ్యాంశములు. ఇది ఐదాశ్వాసముల గ్రంథము.

ప్రతి మిక్కిలి క్రిమిదష్టమై చాలభాగము నష్టమైనది. కొన్ని పత్రములు తునిగి సగ
భాగములే మిగిలి యున్నవి. లిపి స్పష్టము. అక్షర దోషములు కొద్దిగా కలవు. ప్రతి
శిథిలావస్థలో నున్నది.

## రాజశేఖరచరిత్రము

### మాదయగారి మల్లన

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : | 442 | కాల్ నెం | : | డి 3-83 |
| ప్రతి | : | తాళపత్రము ; అసమగ్రము. | పత్రములు | : | 79 |
| ప్రతి పరిమాణము | : | 37×4 సెం.మీ. | పత్రపంక్తులు | : | 4 నుండి 5 |

ప్రారంభము :

వ. అవధరింపు। మత్తెరంగున నావర్తిత నామకరణాది సంస్కారుండై ప్రతిదిన ప్రవర్ధ మానుం డగుచు నక్కుమారుండు.

ఉ. నిద్దపు రత్న .... .... .... డు స
మ్మద్దుల బాలు డ .... .... రపుల్ పలుమారునుంజూచి చీరుచుం
విద్దెము సేయుచుం దిరుగు విందుల- విందు లంచ నే
ప్రొద్దు నృపాలుడుం సతియుం బొంగుచు ....గావింపగన్।

శా. కేలికాంచన సౌధవీధికల చక్కం దొట్లలో బెట్టి యో
ప్రాలేయాచల ....కాధవకృపా పారంగతా నిద్ర పో
వే లావణ్యపయోనిధి యనుచు నావిర్భూత మోదంబునన్
జోలల్ పాడుదు రక్కుమారునకుం శుద్ధాంత కాంతామణుల్।

ముగింపు :

స్వర్భామాజనకీర్తనీయ గుణఘోషద్విట్ప్రతాపార్య మ
స్వర్భానూద్భట పారసీక .... .... రా
విర్భూతోర్భల .... టిధూ .... ఖరదోర్వీర్యా వధూటార్జునా
గర్భస్థాపిత భూర్భువప్రముఖ లోకస్వన్న .... ....

గద్య :

... .... .... ... రాజశేఖర చరిత్రం
బను మహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము.

విశేషాంశములు :

మద్దూరి పాపరాజు కుమారుడు వెంకన వ్రాసిన రాజశేఖర చరిత్ర ... .... ....
గ్రంథము సందలి ఆద్యంతములు శిథిలములైనవి. గ్రంథమునందు వ్రాతదోషము లధికముగా గానవచ్చు చున్నవి. ఈ ప్రతియందు ప్రథమాశ్వాసము లుప్తమైనది.

# రాధామాధవ సంవాదము

## వెలిదిండ్ల వేంకటపతి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 744 | కాల్ నెం | : టి 3-36 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 55 |
| ప్రతిపరిమాణము | : 39×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 5 నుండి 6 |

**ప్రారంభము :**

చ. అనవరత ప్రబోధకరమౌ మిథిలాపురమందు నొక్క నా
డనఘుడు ధన్యు డజ్జనకు డార్యులలో సుఖరీతి నుండి సొం
పున సకలావతారముల పుణ్యకథల్ వివరింపు మంచు నా
చనవున వేడె కృష్ణుకథ సత్యనిధిం శుకయోగి రాయనిన్.

చ. అడిగిన భక్తితోడ పులకాంకితు డై నయనాంబుజంబుల్
వెడలు ముదాంబు రాసి యదువీరుని కృష్ణుని సన్నుతింపగా
బడసితి యెంత భాగ్య మని పద్మదళాక్షు తలంచి మ్రొక్కుచున్
బడలిక దీర పాపములు బారగ భాగ్య .... ....

గీ. జనకరాజేంద్ర వినవయ్య సావధాన మతిని కృష్ణ చరిత్రముల్ మహిని నిండు
నవి రచింతువు మాకు మా యనుభవంబు .... శృంగార రూపమై చిత్తగింపు.

మ. యమునాతీరమునందు బృందదరి బాగౌ పల్లె రేపల్లె నా
యమరుల్ గొల్వ .... ....ల్లె తజ్జనుల భాగ్యం బెంత వర్ణింతు మె
ల్లమిగా నందరు కొల్లలాడుదురు పాలన్నే తతన్నే తయున్
యమి .... ....,డు నందుడున్ దగును దేవాధీశ భోగంబులన్.

సీ. తీరు దారై జేయు తేరుల చందా.... .... దగులతోటి యా గదుపు లమర
కనుగొనక మదించు గజముల కైవడి కొమ్ముల వృషభముల్ కొమర మిగుల
చెంగున దాటు కురంగముల వి .... ....,రుకైన లేగలు సొంపుమీరు
చివ్వాపకట్టున కాల్రద్వవ్వ వీరుల రీతి చలపోరి పెనంగు కోడెలు చెలంగ

గీ. నదియె చతురంగబలముపై యతిశయిల్లు మొల్లమై .... రేపల్లె నల్లు కొనిన
ఫలితవనములు కోటపై పరిధవిల్ల నంప చలువొంద నందు డానంద మొంది.

క. ఒక పశువు ప్రోచు వానికి సకల ఫలంబులును గ.... సంతతమును కొ
ల్లకు మించు పశుగణంబును ప్రకటంబుగ బ్రోచు నందు ఫల మెట్టిదయా.

ముగింపు :

వ. ఇట్లు మ్రొక్కిన సక్కునంజేర్చి రుక్మిణ్యాదులగు సతులందరుం బ్రియంబుగ...

క. .... .... .... .... రాధం గూర్చి పదం త్తుకలఁ మెచ్చుకొనుచు ప్రియంబున్
గూర్చి పలుకంగ కృష్ణుడు కూర్చుండంగ నిడియె న .... .... .....

ఉ. అంతట వారిని గృహంబులకుం సెలవిచ్చి రాధికా
కాంతను కృష్ణదేవుడ తగన్ గరగించి చెలంగి నంతకున్
వింతలుగా రమిన్ .... .... .... .... .... .... కేగి య
త్యంత్య విలాస మార్గముల దక్షిణ నాయకుడై మహోన్నతిన్.

క. విను రాధామాధవమును మనమున నుడివిన ను .... .... ....
పుణ్యాత్ముల కెప్పుడు వనజాక్షు డొసంగు సకల వాంఛలు దయతోన్.

శా. శ్రీగోపాలు డొసంగు సకల నీప్సిత ఫలశ్రీ పుత్ర పౌత్రా ....
.... .... .... .... ఖిల జగద్వ్యాధి ప్రతాపోన్న తుల్
సాంగోపాంగము సార్థకంబుగ బుధస్ఫారసచ్ఛ్రీసూ క్తిచే
శృంగారాకరమైన యీ కథ మదిన్ శోభి .... ....

శా. .... ....ధర వర్ణుడై రసికుడై శృంగార చారిత్రుడై
మోదాగ్రేసరుడై కృపాకలితుడై యొప్పారు శ్రీకృష్ణు డీ
రాధామాధవ సచ్ఛ్రబంధి కథ వ్రా .... .... ....
..ధన్యాత్ముల కిచ్చు పుత్ర యశ లక్ష్మ్యాయుష్కనారోగ్యముల్.

వ. అనుచు శుక యోగి తెలుప నజ్జనక నృపతి కృష్ణు .... పదదాసు దేని తన భావమునను
తలచి కీర్తించి మ్రొక్కుచు ధన్యు డయ్యె.

గద్య :

ఇది శ్రీవేణుగోపాల వరప్ర .... .... .... .... .... ...., తిరువేంగళాచార్య
.... .... .... ... .... విధేయ వేంకటపతి నామధేయ .... .... ....

విశేషాంశములు :

ఈ కావ్యారంభము కథాప్రారంభముతోనే గావింపబడినది. ఇది మూడాశ్వాసముల గ్రంథము. ఆద్యంతములు పూర్తికథయు నున్నది. కాని ప్రతి యొక్క ఇరు పార్శ్వముల యందు కొంతభాగము శిథిలమై కొంతకావ్యభాగము నష్టమైనది. లిపి అంత స్పష్టముగా లేదు. భాషాదోషములు పెక్కు గలవు.

# రాధామాధవ సంవాదము
## వెలిదిండ్ల వేంకటపతి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3409 | కాల్ నెం | : బి 3–205 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 59 |
| ప్రతిపరిమాణము: | 34.5×3.5 సెం.మీ | పత్ర పంక్తులు : | 5 |

విశేషాంశములు :

ప్రతి బాగుగా నున్నది కాని లిపి యస్పష్టము. వ్రాత దోషములు కలవు. అవతారిక మృగ్యము.

# రాధామాధవ సంవాదము
## వెలిదిండ్ల వేంకటపతి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 728 | కాల్ నెం. | : బి 3-219 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 29 |
| ప్రతి పరిమాణము : | 45.5× 4 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 నుండి 7 |

విశేషాంశములు :

ఈ ప్రతియందు ప్రథమాశ్వాసమున నవతారిక లేదు. ద్వితీయాశ్వాసము పూర్తిగను, తృతీయాశ్వాస మసమగ్రముగను నున్నవి. ప్రతి యటనట క్రిమిదష్టమైనది. వ్రాత దోషములు కలవు.

# రామకథా సుధాలహరి

## చామర్తి శేషగిరి రాయకవి

ఆక్సేషన్ నెం : 5568 కాల్ నెం : బి 3-345

ప్రతి : కాగితము; సమగ్రము. పత్రములు : 27

ప్రతి పరిమాణము : 27.5×24 సెం.మీ పత్రపంక్తులు : 20

ప్రారంభము :-

ఉ. శ్రీవర నీలమోహిత విరించనుల న్మద మొప్ప నెంతు స
ద్భావలయాధిపత్యము విభూతి చిరాయువు గోరి యిందిరా
ర్యా వచనాబ్జ నేత్రల రయంబునఁ గొల్చెద భాగ్యవశ్య వా
చా విభవాప్తి వేడి గిరిజాసుతు నెంతు నిజాభి వృద్ధికై. 1

గీ. వ్యాస వాల్మీక శుక గంధవహజ కాళి దాస భాస్కర వాగనుశాసనాది
కవివరుల నెంచి నే రామకథ పఠింతు పద్యశతంబుగా నతి హృద్య ఫణితి. 2

* * * *

సీ. పుణ్యజనప్రౌఢి బొల్చె నేని సురాద్రి నిలయంబు సరి యని బలుక వచ్చు
బహుళ సంతాన ప్రభలు గల్గెనేని నా క నివాస మవని దీ టనగ వచ్చు
రాజశేఖర సుమిత్రత నొప్పె నేని వా ణీశు ప్రోలుద్దిగా నెంచవచ్చు
మిగుల దక్షవ్యాప్తి మెరసె నేని గిరీశ పురము జోడని మది బొగడ వచ్చు

నిఖిల రాజ్యరమా కృపాన్విత నిజేశ దర్శనోత్సాహ పరతంత్ర ధారుణీంద్ర
కవిత కోటీర మాణిక్య కలిత సైక తాతతాధ్వరం బయోధ్యా పురంబు. 5

ముగింపు :-

క. సర్వమయ సర్వరూపక సర్వాత్మక సర్వసాక్షి సర్వాతీతా
సర్వాదర నీ మహిమలు సర్వంబు నుతింప మాకు శక్యం బగునె. 99

సీ. అని నుతింపగ మోద మంది వారల తమ తమలోకముల కంపి ధరణి తనయ
ముఖ్యవానరులకు పుణ్యజనాధిపు లకు బహుమానము ల్ప్రకటితముగ
సల్పి పావని భవిష్యద్బ్రహ్మగా వర మిచ్చి నిషాదుల నెచ్చు సేసి
స్వనివాసములకు బోవగ నాజ్ఞ యొసఁగి దా రాజ్యంబు పాలించె రామవిభుడు

గీ. ముఖ్యకథల జెలంగు నీ సౌఖ్యదాయి లలిత రామకథా సుధాలహరి యనెడి
చరిత మెవరైన నిరతంబు జదివి రేని గరిమ సకలార్థ సిద్ధులు గలుగ కున్నె. 100

గద్య :-

ఇది శ్రీమ దుమారమణ కరుణా కటాక్ష దీక్షా సుధారస పరిలబ్ధ సరస కవితాభి నందిత రసికజన నికాయ చామర్తి వంశపయః పారావార సంపూర్ణ పూర్ణి మాత్రేయ గోత్రపావయా మాత్యపౌత్ర, వేంకటమంత్రిపుత్ర, విబుధమిత్ర సుందర శేషగిరిరాయ కవి పురందర ప్రణీతం బైన రామకథా సుధాలహరి యను పుణ్య ప్రబంధంబున సర్వంబు నేకాశ్వాసము 101

**విశేషాంశములు :**

శాలివాహన శకం 1796 యువనామ సం॥ మార్గశిర శుద్ధ ౮ భానువారం వర్కు-సంపూర్ణముగా చెప్పబడినది.

ఈ కవికి కలలో సీతారాములు కన్పడి ఆదేశించుటచే హృద్య మగు ఈ యేకాశ్వాస కావ్యమును వ్రాసినట్లు కవి తెలిపెను. లిపి స్పష్టము. ప్రతి విలేఖనమున దోషములు సవరించ బడినను కొన్ని యింకను గలవు.

# రామానుజ విజయ సుధారసము

## పెరరుళాళదాసు

| | | | | |
|---|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 1580 | కాల్ నెం | : | ౬ 3-308 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము. | పత్రములు | : | 187 |
| ప్రతిపరిమాణము | : 38×4.5 సెం.మీ. | పత్రపంక్తులు | : | 6 నుండి9 |

ప్రారంభము :-

శ్రీ .... విలాస సవిశేషిత సత్కృ....దాంతి శీలతన్
జేతన రక్షణేచ్ఛ రతి శ్రీమత నాసు . . . దవ
ఖ్యాతి మ....త్మబద్ధ జనకల్మష నాశ విశుద్ధ స...మ
త్యాతిశయోజ్వల ప్రతిభ యార్య విలక్షణ ....త్మరక్షణా.

వ. అవధరింపు మస్మద్విజ్ఞాపనం బనాదికాల కర్మవాసనం జేసి అఖిలజంతు జాతావస్థలం జెందెని క్లేశింపు ....నంత సుఖయ విభూతీశ్వరుం డైన జగదీశ్వరుం డత్యంత కృపా కటాక్ష వీక్షణంబుచే నన్ను రక్షింప దలంచి లక్ష్మీసమాన యగు లక్ష్మీ గర్భంబు నం జనియింపం జేసిన ....ంబున .... వరణంబునుం గలిగి బాలక్రీడ సలుపుచున్న సమయంబున.

* * *

అంకితంబుగా నా యొనర్పం బూనిన రామానుజ విజయ సుధారసంబునకు కథా క్రమం బెట్టిదనిన.

సీ. వేదాంత సారార్థ వేద్యుడై వెన్నొందు బరమకారణ పరబ్రహ్మ యొకడు
పర వ్యూహ విభవాది పంచరూపు జెలగు చేతనాచేతన శేషి యొకడు
నిఖిల హేయప్రత్య నీకుడై విలసిల్లు త్రిగుణాత్మ మూర్తి యౌ ధ్యేయు డొకడు
భోగలీలార్థ విభూతి ద్వయం బేలు కారణ కార్యప్రకాశు డొకడు

గీ. శుద్ధ సత్వము సందుండి సూరి జనుల చేత నెప్పుడు సేవలు చెలగి కొనుచు
పరమపద వాసుడైన శ్రీభర్త సమత తోడ బాలింపుచును తులదూగుచుండె.

వ. అట్లు కొంత కాలంబు చనిన పిమ్మట నొక్క యేకాంత సమయంబున, సంతోష చిత్తుండై కేళీవిలాస మనోభిరాము డగుట గనుంగొని, యఖిల జగన్మాత యగు నిత్యానుపాయిని ................ట్టు యారు మనకిది సమయం బని ధ్యానింపుచున్నంత, సకలాంతర్యామి యగు సర్వేశ్వరుండు నీ పరాకున కేమి కారణం బని యడిగిన యిట్లనియె.

ముగింపు :-

ఉ. మిక్కిలి ప్రేమచే దిగిచి మీదికి చయ్యన గౌగిలించి తా
నక్కున జేర్చి ముద్దుగొని యౌర కుమారక యింత పట్టు నీ
వెక్కడ నుండి వం చడిగె నిందిరభర్తపు డూరు పీఠ మం
దక్కజ మందగా నిలిపి యౌదల మూర్కొని బుజ్జగింపుచున్.

గీ. అటుల దేవదేవు దతికూర్మి మెరయంగ నాన తీయ వినియు నతిముదంబు
తోన విన్నవించ బూని యో సర్వేశ యఖిల మెరిగి నన్ను యడుగ దగునె.

క. బాలుని యవ్యక్తంబులు జాలా మది పొంగి పొంగి సంతోషముచే
వాలాయము తలిదండ్రులు నాలింతురు ప్రేమ మరియు నగ్గల మగుటన్.

సీ. ఆ రీతి నా పల్కు లాదరించి వినంగ దేవ మీ చిత్తంబు విన్న మయ్యె
స్వామి మిమ్మెఱఁగాని చౌశీతి లక్షల జీవరాసుల యోని స్థిరముగాను
జొచ్చి వెల్వడి చాల నొచ్చి కర్మ ఫలంబు పాప పుణ్యంబులై పరిధ విల్లి
నాక నరకంబులు నయమంచు దుర్విష యాది జరవశతచే సంకటమ్మ

గీ. జన్మముల యందు శేషించ సార మర్త్య లోకమున నుద్భవం బంది ప్రాకటముగ
బంచ షష్ఠములంటుచే బ్రబలి యవ్వి రోధి మహామస్మి యను పామరోక్తి నుండు.

విశేషాంశములు

ఈ ప్రతి యందు అయిదు ఆశ్వాసములు గలవు. రామానుజులు ఆసూరి కేశవార్య గర్భంబున జన్మించుట, యామునాచార్య మంత్రోపదేశము యేకసంతాధ్యయనా భ్యాసము మతస్థాపనోద్యుక్తు లగుట పంచసంస్కారాదుల యనంతరం, శ్రీరంగమున కలుగుట రంగపతి యతిపతి సంవాదము. ఉభయవిభూతు లొసగుట, కట్టళ్లు నియమించుట, తిరుమల కేగి శంఖచక్రాదు లొసగుట, శ్రీరంగమున హరిగీతిలకు భాష్యము జేయుట, యజ్ఞమూర్తి నోడించి శిష్యునిగా గొనుట మున్నగు విషయము లిందుగలవు. ఈ ప్రతి అధికముగ క్రిమి దష్టమై కొంత శిథిలావస్థ యందున్నది. కొన్ని పత్రములు తునుకలై యున్నవి. ప్రతి విలేఖనమున దోషములు గలవు. లిపి స్పష్టముగ లేదు.

# రామాభ్యుదయము

## అయ్యలరాజు రామభద్రకవి

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 780 | కాల్ నెం | : టి 8-111 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 68 |
| ప్రతిపరిమాణము | : 44× 4 సెం.మీ. | పత్రపంక్తులు | : 11 |

ప్రారంభము :

శా. ............ నాయకమణి శ్రీయుత సాకార శ్యం
గారంబై తగు మచ్చ వక్షమున భూకాంతస్థితి న్దెల్ప సౌ
ఖ్యారూఢి న్విలసిల్లు వేంకట నగాధ్యక్షుండు రక్షించు గొ
బ్బూరి తిమ్మనృపాలసింహ నరసింహోర్వీశ చూడామణిన్.

చ. పలుకు ఒడంతి యే యువిద పజ్జల గోదరికంబు ........
.... నూడిగపు గత్తియ పిండు శచీముఖా మరీ
కుల మగజాత యే చెలువకుం జెలి యయ్యలమేలుమంగ భా
సిలు సిరులుంచు గొబ్బురి నృసింహ నృపాలుని మందిరంబునన్.

ఉ. ఆయతధర్మ బోధము నిరంతర శాస్త్ర వివేకమున్ జగ
ద్గేయ పటుప్రతాపమును గీర్తియు .... హు శక్తియున్
బాయక యుండ జేసి నిరపాయముగా గరుణించి విష్ణు పం
చాయుధి యేలు గావుత మహోమహు గొబ్బురి నారసింహునిన్.

* * *

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన రామాభ్యుదయ ప్రబంధంబునకు
కథా విధం బెట్టి దనిన.

క. మనుకులము రాచవారల మనుకుల కిర వగుచు కలిమి మగువకు నిరవై
తనరు నయోధ్యానగరము తనరు చిరశ్రీ రసజ్ఞతతి నుతియింపన్.

క. ఘనజాలంబును మించును ఘనసాలము మణులు ఘృణులు కమలాప్తునకున్
దినమును నప్పురి మధ్యం దినమున బరివేషలక్ష్మి దిరముగ జేయున్.

ముగింపు :

సీ. శత్రుఘ్ను డపుడు కౌసల్యాది జనయిత్రు లకు .... పసిడి పాలకులలోన
............ మంత్రులు వివిధసేనలు గొల్వ వెంట దవిలి
సాకేత మంతయు జనుదేరగ బరాశ ర మునీంద్రు ........
కొనుచు నంది గ్రామమున జేరుచో భర ద్వాజు వీడ్కొని రఘువరుడు వచ్చి

తే. భూమిజయు లక్ష్మణుడు దాను పుష్పకం.. ... ... .... .... .
భరత శత్రుఘ్నుల బ్రసన్న కరుణ నునిచి వంశగురునకు మొక్కి దీవనలు గాంచె.

క. కౌసల్యా కైక సుమి త్రాసాధ్వి ప్రణామముల పరంపర యొసగం
గా సేవించి తదాశీ ర్వాసితమును జనజ యేలి వచ . . .

సీ. ... .... .... .... .... స్వామిలక్ష్మణ, భరతుల ....
సాగించి మంగళ స్నానక్రియానంత రమున శత్రుఘ్నుని విమల వసన

గంధ మాల్యామూల్య కమనీయ భూషణ ప్రతతి సన్నుల నలంకృతుల జేసి
కూర్మికో .... .... ... .... .... .... ....

తే. ... ... ప్పుడు రమ్మ టంచు బలికి ధన ... ...
.. సుత విభీష ణాంగద హనుమదాదు లకు నలంకార వాహనాదికము లొసగి.

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు కొన్ని పద్యములు అసంపూర్ణములుగ గలవు. ప్రతి విలేఖరే వ్యవధానము లుంచి అసంపూర్ణ పద్యములను వ్రాసెను. గ్రంథాంతమున నుండు గద్యయు రెండు పద్యములు వదిలివేయబడినవి. ఈ ప్రతి యందలి పత్రములు పార్శ్వముల కొంత శిథిలము లైనవి. క్రిమి దష్టమగుటచే గ్రంథములోని కొన్ని భాగములు దృగ్గోచర మగుటలేదు. ప్రతి నలుపు దిరిగినది.

# రామాభ్యుదయము

## అయ్యలరాజు రామభద్రుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం : | 3653 | కాల్ నెం | : టి 3-235 |
| ప్రతి : | తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 32 |
| ప్రతిపరిమాణము : | 45×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 నుండి 7 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు ప్రథమాశ్వాసములోని 122వ పద్యమునుండి యించుమించు నాలుగవ ఆశ్వాసము చివర వరకు గలదు. అందును ప్రథమాశ్వాసాంతము ద్వితీయాశ్వాసము యొక్క ఆదియందు 7 పత్రముల గ్రంథము లోపించినది.

ఇందు కొన్ని పత్రములు క్రిమిదష్టము లైనవి. కొన్నిపత్రములు మిక్కిలి శిథిలావస్థలో నున్నవి. లిపి స్పష్టము. అక్షర, పదచ్యుతులు. భాషాదోషములు గలవు.

# రామాభ్యుదయము

## అయ్యలరాజు రామభద్రుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4637 | కాల్ నెం | : టి 3-29 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 94 |
| ప్రతి పరిమాణము | : 38×4 సెం. మీ | పత్రపంక్తులు | : 6 నుండి 8 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు ఆదినుండి ఆరు ఆశ్వాసములు పూర్తిగాను, సప్తమ ఆశ్వాసమున 20 పద్యాలు ఉన్నవి.

ఈ ప్రతి చాలభాగము క్రిమి దష్టమై యున్నది. ఇందలి లిపి స్పష్టము. కాని ప్రతి విలేఖనమున చాల దోషములు గలవు.

# రుక్మాంగద చరిత్ర

## ప్రౌఢకవి మల్లనార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 332 | కాల్ నెం | : టి 3-61 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 121 |
| ప్రతిపరిమాణము | : 34×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 4 నుండి 6 |

**ప్రారంభము :**

ఉ. శ్రీమయ పత్రముల్ జటలు చెల్వగు నభ్రతరంగిణీ కణ
స్తోమము పుష్పముల్ ఫలము సోముడునై పొలుపొందు పార్వతీ
కోమల దేహవల్లి వెసగొన్న సమంచిత దక్షవాటికా
ధీమయ దేహకల్పక మభీష్ట ఫలంబులు మాకు నీవుతన్.

చ. కలశపయోధికన్య మృదుగండ మరీచుల నీడ చూచుచున్
తిలకము కమ్మకస్తురి ప్రదీప్తముగా కొనగోర దిద్దు ను

త్పలదళ మేచకద్యుతి కదంబ శరీరుడు మాధవుండు ని
చ్చల గరుణాకటాక్షముల సమ్మతితో మము బ్రోచు గావుతన్.

x x x x

వ. అత్యంత భయభక్తి శ్రాస్పదంబువలన నసేక సాష్టాంగ దండ ప్రణామంబులు సమ
ర్పించి యమ్మహాదేవుని కృతినాయకుం గావించి నా యొనర్పం బూనిన రుక్మాంగద
చరిత్రంబునకు కథాక్రమం బెట్టి దనిన.

x x x x

ఉ. తెల్లనిపాము పానుపును తెల్లనివార్ధము నెక్కు బిడ్డడున్
తెల్లనిమోము గుబ్బమును తెల్లనిమామయు తెల్లకై దువున్
తెల్లనిదీవిపై విడిచి దెల్లనిదమ్ముల మీరు కన్నులున్
తెల్లని కోడలుం గలుగు తెల్లనికూతురు తండ్రి గొల్చెదన్.

x x x x

సీ॥ కాశ్మీర మగదాంధ్ర కాంభోజ కరహాట మాళవ మత్స్య లాట కుకుర
ఘూర్జరీ కర్ణాట ఘోటాణ కురుమద్ర కేరళ సంవీర సూరసేన
సింధు మహారాష్ట్ర చేది పాంచ్య విదేహ కుంతల ద్రావిళావంతి నిషధ
వంగాంగ మచ్ఛాళ బంగాళ నేపాళ పాంచాల సాల్వ బర్బర వరాట

గీ. శక విదర్భాది వివిధదేశములు గలుగు పట్టణ వ్రాతములలోన పౌర కీర్తి
నఖిల సౌభాగ్య వైభవాయత్త మనుచు జగతి బొగడంగ దగు విధిశాపురంబు.

చ॥ శ్రుతియుతు లర్కతుల్యులు వసుల్ ప్రభు లగ్నిసముల్ గులాచల
ప్రతిమము లానయానములు రత్నపుబొమ్మలు కల్పవృక్ష సం
తతులు దలంప దత్పురము లప్పుడురాజ కుమార వైశ్య వ
ర్ణిత భట సామ జాశ్వ తరుణీ జన మానవకోటు లున్నతిన్.

క. అందుల విప్రోత్తములు పు రందరగురు సదృశులు వరరాజ ప్రభువుల్
వందిత పరమేశ్వర గో విందు పదాంబుజులు వేదవేదాంగ విదుల్.

x x x x

ముగింపు :

సీ॥ సర్వసర్వంసహా చక్రంబు లంఘించి యోగి భువర్లోకంబు నుద్వసించి
దేవలోకము లిరువదిమూడు వడి దాటి ఘనమహర్లోక మార్గంబు గడచి

జనలోక విస్తీర్ణ సరణి యుజ్జన జేసి గురుతపర్లోకంబు పరిహసించి
బ్రహ్మలోక సమగ్రపదము విసర్జించి శివలోక విఖ్యాతి సీమ దరసి

గీ. మాధవుని గొల్చి దివ్యవిమాన పంక్తి గగన గమనంబు నందున బర్వ మహిమ
జనియె రుక్మాంగద క్షితీశ్వరునితోడ భూరి విస్ఫూర్తి వైకుంఠ పురమునకును

శా॥ ఆ వైకుంఠ పురంబునందు సురకన్యారత్నముల్ గొల్వ రా
జీవాప్తాన్వయు డంగనా సహితుడై శ్రీవిష్ణుపాదాబ్జ సం
సేవానిశ్చల మానసస్థితి వసించెన్ రమ్యహర్మ్యంబులన్
శ్రీవిఖ్యాత సమగ్ర వైభవముసం జిత్తంబు మోదింపగాన్.

x x x v

ఉత్సాహ॥ ముక్తికామినీవిహార ముగ్ధచంద్రశేఖరా, భక్తిపాలనప్రచార పన్నగేంద్రభూషణా
శక్తినై ఖరీవిలాస సుందరీకుచాంచయా శక్తిమానవేశ్వరా ప్రశంసపార్వతీశ్వరా।.

గద్య :

ఇది శ్రీమత్పార్వతీశ్వర వరప్రసాదలబ్ధ కవితా పవిత్ర పోతనామాత్యపుత్ర సకల జనానంద చార్య ప్రౌఢకవిమల్లనార్య ప్రణీతం బైన రుక్మాంగద చరిత్రంబను మహా పుణ్యకథయందు సుకేశి యను దానవాంగన పద్మనాభునిం గాంచుటయు, దారకాసుర వధయును, కాశీప్రవేశంబును, పాంచాల శేఖర మహీపాల సంవీక్షణంబును, పద్మినీ కన్య వివాహంబును, పద్మినీ సుకేశి సమన్వితుండై పతి తనకడ కేతెంచి తన్ను జేపట్టె ననియును, తా నొనర్చిన కలుషంబునకు నైజముం డివ్విధంబునం బుట్టెనని కీటంబు జెప్పిన కథవిని మోహిని సంధ్యావళి ధిక్కరించుటయు, మోహినీ రుక్మాంగద సంవా దంబును, వ్రతంబునకై భూమీశ్వరుండు నిజతనూభవుని శిరంబు దునుమ కరవాలం బెత్తుటయు, తత్క్షణంబ లక్ష్మీశ్వరుండు ప్రత్యక్షం బగుటయు, ధర్మాంగదు రాజ్యాభి షేకంబును, రుక్మాంగదు వైకుంఠాగమనంబును నన్నది సర్వంబు పంచమాశ్వాసము సంపూర్ణం.

విశేషాంశములు :

ప్రతి విలేఖనము : స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు 1755 అగునట్టి విజయనామ సంవత్సర ఆషాఢశుద్ధపాడ్యమి అంగారకవారంవరకు ద్వితీయ యామంవరకు రుక్మాంగద చరిత్ర పంచమాశ్వాసాలు సంపూర్ణంగా వ్రాసినది.

ఈకావ్యము ద్రాక్షారామ భీమేశ్వరున కంకితము.
గ్రంథము చక్కగా నున్నది. లిపి బాగుగా నున్నది. వ్రాత దోషములు కలవు.

# రుక్మాంగద చరిత్ర

## ప్రౌఢకవి మల్లనార్యుడు

| ఆక్సెషన్ నెం | : 2795 | కాల్ నెం | : టి 3-133 |
|---|---|---|---|
| ప్రతి | : తాళపత్రము, సమగ్రము. | పత్రములు | : 86 |
| ప్రతి పరిమాణము | : 37×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 8 |

**విశేషాంశములు :**

ప్రతివిలేఖనము : శోభన కృతునామ సంవత్సర వైశాఖ బహుళ ౧౦ జయవారం తారీకున ప్రతి వ్రాసినది. ఆ ప్రతిలోవున్న ప్రకారం కీలక సంవత్సర శ్రావణ శుద్ధ ౭ ఆదివారం సర్కి- కింతాడ సూరప్ప రుక్మాంగద చరిత్రంబను పుణ్యకథ పంచమా శ్వాసాలున్ను సంపూర్ణంగా వ్రాసి లాలిపెట్టె పెదనారయ్య కొమారుడు మల్లియ్యకు ఇచ్చెను.

ప్రతి చక్కగా నున్నది. అంతగా క్రిమి దష్టమైనది. గ్రంథ శైథిల్యము లేదు. గ్రంథ పాతము లేదు. వ్రాత దోషములు కలవు.

# రుక్మాంగద చరిత్ర

## ప్రౌఢకవి మల్లనార్యుడు

| ఆక్సెషన్ నెం | : 2794 | కాల్ నెం | : టి 3-135 |
|---|---|---|---|
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 182 |
| ప్రతిపరిమాణము | : 44×3.5 సెం. మీ. | పత్రపంక్తులు | : 5 |

**విశేషాంశములు :**

ప్రతివిలేఖనము : సర్వజిత్తు నామ సంవత్సర భాద్రపద బహుళ ౧౨ సోమవారం రోజు సాయంతరం సర్కి- ఈ రుక్మాంగద చరితంబును కింతాడ పాపయ్య ... కోట జంగము బైరాగి ఉభయులు కలిసి యీ పుస్తకం సంపూర్ణంగా వ్రాసినారు. ఈ పుస్తకం కింతాడ పాపయ్యది.

గ్రంథము బాగుగా నున్నది. వ్రాత దోషములు కలవు.

# రుక్మాంగద చరిత్ర

## ప్రౌఢకవి మల్లనార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 6116 | కాల్ నెం | : టి 3–616 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 73 |
| ప్రతిపరిమాణము | : 33×3.5 సెం. మీ. | పత్రపంక్తులు | : 8 నుండి 10 |

**విశేషాంశములు :**

అటనట ప్రతి కొద్దిగా క్రిమిదష్టమైనది. వ్రాత చక్కనిది. దోషము లంతగా లేవు. ప్రతి మంచిస్థితి యందున్నది.

ఉ. "ఆరయ వర్తమాన వ్యవహారిక చాంద్రమ మాన మందు నాం
గీరస నామవత్సరము కీర్తికి నెక్కిన కార్తికంబు శ్వాం
గారము కృష్ణపక్షమున గారవ మొప్పగ పంచ మందు స
ద్వారము నాటికి న్విబుధ దాసుడనై పలువొంద వ్రాసితిన్."

అని ప్రతిచివరలో వ్రాయబడి యున్నది. ప్రతివిలేఖకుడు తనపేరును మాత్రము వ్రాసుకొనలేదు.

# రుక్మాంగద చరిత్ర

## ప్రౌఢకవి మల్లనార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4627 | కాల్ నెం | : టి 3–58 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము, | పత్రములు | : 133 |
| ప్రతిపరిమాణము | : 33.×3.5 సెం.మీ | పత్రపంక్తులు | : 5 |

విశేషాంశములు :

ప్రతివిలేఖనము : పరీధావి నామసంవత్సర పుష్య బహుళ ౭ అంగారక వారారభ్య తత్సంవత్సర మాఘ శు॥ ౧౪ అంగారక వారం దినములు యిరువైవక్కంటికి పంతులు వెంకయ్యకుమారుడు కృష్ణయ్య వ్రాసినది.

ప్రతి క్రిమిదష్టమై కొన్ని పత్రములు శిథిలావస్థలో నున్నవి. లిపి స్పష్టము. వ్రాత దోష ములు కలవు.

## రుక్మాంగద చరిత్ర

### ప్రౌఢకవి మల్లనార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 4565 | కాల్ నెం. | : టి. 3-141 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 92 |
| ప్రతిపరిమాణము | : 41.5×3.5 సెం. మీ. | పత్రపంక్తులు | : 6 |

విశేషాంశములు :

ప్రతి విలేఖనము : సాధారణ నామసంవత్సర పుష్య బహుళ ౧౨ సోమవారంవరకు హరిదాసు వెంకటేశ్వర్లు వ్రాసిన రుక్మాంగద చరిత్ర సర్వంబును సంపూర్ణము.

ప్రతి అలతిగా క్రిమిదష్టము. 11,14,35,61-67,70,88, అను నెంబర్లుగల పత్రములు సగభాగము లోపించి యున్నవి. 14నెంబరుగల పత్రము మూడుపంతులుపైగా లోపించి నది. వ్రాత బాగుగానున్నది. అలతి దోషములు కలవు.

## రుక్మాంగద చరిత్ర

### ప్రౌఢకవి మల్లనార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 3657 | కాల్ నెం. | : టి 3-239 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 29 |
| ప్రతిపరిమాణము | : 24.5×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 8 నుండి 9 |

విశేషాంశములు :

ఈ ప్రతియందు గ్రంథపాత మెక్కుడుగ గలదు. గ్రంథమున ఒకఆశ్వాసముగూడ పూర్తిగ లేదు. ఉన్నపత్రములు కూడ మిక్కిలిగ క్రిమిదష్టమైయున్నవి. ప్రతి శిథిలా వస్థలో నున్నది. అక్షరములు స్పష్టము.

# రుక్మాంగద చరిత్ర

## ప్రౌఢకవి మల్లనార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 786 | కాల్ నెం | : టి 3-33 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 79 |
| ప్రతిపరిమాణము | : 45 × 4 సెం.మీ. | పత్రపంక్తులు | : 8 |

విశేషాంశములు :

ప్రతి చాల వరకు క్రిమిదష్టమై శిథిల మైనది. ఇందు ఐదుఆశ్వాసము లున్నను అటనట కొన్ని పత్రములు లోపించినవి. కొన్ని విరిగి పోయినవి. క్రిమిదష్ట మగుటవలన ఈ ప్రతిని పరిశీలించుట చాల కష్టము.

# రుక్మాంగద చరిత్ర

## ప్రౌఢకవి మల్లనార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 787 | కాల్ నెం | : టి 8-60 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 63 |
| ప్రతిపరిమాణము | : 47 × 3 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 నుండి 7 |

విశేషాంశములు :

ప్రమోదూత నామసంవత్సర మాఘ శుద్ధ విదియ నాటికి కెల్లెపల్లి నరసరాజు వ్రాసిన ప్రతి ననుసరించి గుడిమెల్ల తిరువేంగళాచార్యుల కుమారుడు కృష్ణమాచార్యులచే ఈ ప్రతి వ్రాయబడినది.

ఈ ప్రతియందు వ్రాత దోషము లధికము. పెక్కు పద్యము లసమగ్రముగా వ్రాయ బడినవి.ఇందు ఐదాశ్వాసము లున్నను ప్రతి చాలావరకు క్రిమిదష్ట మైనది.

# రుక్మాంగద చరిత్ర

## ప్రౌఢకవి మల్లనార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం. | : 4628 | కాల్ నెం | : టి 3-184 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 95. |
| ప్రతి పరిమాణము | : 42.5 × 4 సెం.మీ. | పత్ర పంక్తులు | : 6 |

**విశేషాంశములు :**

ప్రతి మిక్కిలి క్రిమి దష్టమై శిథిలావస్థలో నున్నది. వ్రాత దోషము లధికము. గ్రంథాద్యంతములు లేవు.

# రుక్మాంగద చరిత్ర

## ప్రౌఢకవి మల్లనార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 4629 | కాల్ నెం | : టి 3-59 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 63 |
| ప్రతిపరిమాణము | : 39 × 3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు గ్రంథ ప్రారంభమునుండి చతుర్థాశ్వాసమున సగముభాగమువరకు మాత్రమే కలదు. ప్రతి చాలవరకు క్రిమి దష్టమై శిథిల మైనది. అటనట కొన్ని పత్రములు లోపించినవి.

# రుక్మాంగద చరిత్ర

## ప్రౌఢకవి మల్లనార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 5843 | కాల్ నెం | : టి 3-54 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము; | పత్రములు | : 86 |
| ప్రతి పరిమాణము | : 46×3.5 సెం మీ | పత్ర పంక్తులు | : 5 |

ప్రతి విశేషము: విళంబిసంవత్సర మార్గశిర బహుళ 30నాటికి రుక్మాంగద చరిత్ర రెండో ఆశ్వాసము ప్రతినున్న క్రమాన మురపాక సూరయ్య వ్రాసెను.

అసమగ్రము. అలతిగా క్రిమిదష్టము, గ్రంథపాత మధికము. గ్రంథ శైథిల్యము కలదు. ఇందు ప్రథమ, ద్వితీయాశ్వాసములు ఒకటిరెండు పత్రములు తక్కువగా సంపూర్ణముగాను, తృతీయ, చతుర్థ పంచమాశ్వాసములు అసమగ్రముగాను గలవు. గ్రంథాంతము లేదు. వ్రాత దోషములు కలవు.

# రుక్మాంగద చరిత్ర

## ప్రౌఢకవి మల్లనార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 5842 | కాల్ నెం | : టి 3-240 |
| ప్రతి | : తాళపత్రము : అసమగ్రము. | పత్రములు | : 6 |
| ప్రతిపరిమాణము | : 43×3.5 సెం. మీ. | ప్రతపంక్తులు | : 8 |

ఈ ప్రతియం దటనట కొన్ని పత్రములు లోపించినవి. లిపి స్పష్టము. వ్రాత దోషములు కలవు. ఈ ప్రతియందు ప్రథమాశ్వాసము మాత్రమే కలదు. అదియును అసమగ్రమే.

# రామాయణ కథాంశములు

(1. హనమంతుని వృత్తాంతము 2. విభీషణబుద్ధి
3. అంగదురాయబారము 4. అతికాయుని యుద్ధము
5. సుందరకాండ)

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 645 | కాల్ నెం | : జి 3-353 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 78 |
| ప్రతిపరిమాణము | : 42.5×3.5 సెం. మీ. | పత్రపంక్తులు | : 8 |

ప్రారంభము :

## 1. హనుమంతుని వృత్తాంతము

.... ... అతి రమ్యముగను, అలరంగ గొలువున శాయత్త పరపు
మనవుండు భరతుండు అతిసంభ్రమమున పరగంగ .... ....
.... .... మంత్రులం బురోహితుల నాప్తులను వరవసిష్ఠాది మునివరు .... పించి
కవి బుధ వందిత .... భరత శత్రుఘ్నుల ....

**ముగింపు :**

అలరంగ పుత్రపౌత్రాదులతోడ గ్రామ భోగంబులు కామ్యార్థములను
శత్రు నాశనమును జయవదనంబు ధనధాన్య వృద్ధియు ధర్మవర్తనము
వలనొప్ప లావణ్య వతులైన యట్టి, కొడుకులు, గోడండ్లు, కోర్కెలు మెరసి
అలరంగ సౌభాగ్య మనుభవింపు .... ....
సాధించు రాఘవు చరితంబు విన్న కరమర్థి జదువంగ గ్రహణ కాలమున
గంగాది తీర్థముల్ కలయు నాడుచును శ్రీరామ నామంబు జెల్లు నందాక
చెలువంద పుణ్యంబు సిద్ధించు నెలమి పరగంగ హెడిల్లు పాప క్షయములు.

## 2. విభీషణ బుద్ధి

ప్రారంభము :

అక్కడ రావణుం డఖిల మంత్రులను తక్కక రావించి తగ వారి కనియె
మంత్రికోవిదులార మర్కటుం డొకడు జంత్రంబు పూని .... దానవ ....
లంకినిం జంపి యీ లంక శోధించి పంకజానన సీత బరికించి ....

ముగింపు :

సకల భూతవ్రాత సంతృప్తు లొసగి విడువని సంగ్రామ విపుల యజ్ఞంబు
కడును జేయు రాఘవ సోమయాజి .... గాన మున్ను సీతాంగన దెచ్చి
యి .... బ్రతుకుటయె .... అనిచె . . సుగ్రీవు డాడు వాక్యములు
విని శు . . చారుడు . . పోయి అచటి వృత్తాంతంబు నా రావణునకు
.... నంబున జవ్వ మరియు నక్కడను వనధి తిర .... న వరదర్ప శయ్యే
మోనలి .... మొప్పారు చుండ అమృతపయోధిలో నాహిత . . యు

ప్రారంభము :

అంగదు రాయబారము

తనరిన లంక కు త్తరపు వాకిటను వెనుకొని వేలంబు లిడిన రాఘవుడు
విబుధ మైధులతోడ తివిరి సీలుండు రభసంబు మీర పూర్వద్వారమునను
గజుడు గవాక్షుండు గంధమాధనుడు భుజాడ్యైన రుషభుండు పొంకంబుతోడ

ముగింపు :

అనమాత్మ సకలసురాదు లుప్పొంగ గని యంగదుడు బల్కె నా రాఘవుండు
మనమున హర్షించి మరియు నిట్లనియె

ప్రారంభము :

అతికాయుని యుద్ధము

అట మహాధ్వనితోడ నమ్మహా సాధ్వి పటు భయంకరముగా పడుటయు జూచి
కరువలిచే దుల్లు కారాకు లనగ తిరిగి దైత్యులు నలుదెసలకుం జనిరి
ఆ చందమున వార లందరు బడుట చూచియు రోషవిస్ఫురణ శోభిల్ల
మి .... కలోకము లెల్ల మ్రింగెద ననుచు కణగిన క్రియ నతికాయుండు పేర్చి

ముగింపు :

అంతఃపురంబున కరిగి యొకరుడు అంతరంగమ్మున నడలుచు నుండి
అతి దుఃఖమును బొంది నడలు నయ్యసుర పతి కడ కేతెంచి పలికె మైపుత్రి
అసురేశ లోకంబు లన్నింటిలోన అసమానసత్వుండ వైన నీకిట్లు
పాడియె శోకింప . . ద్దవిలైన నాదేల తెచ్చితివి నరనాథు దేవి
యొప్పింప నేరవు యేమందు ....

ప్రారంభము :

సుందరకాండ

అంత నా హనుమంతు డాయద్రి మీద నెంతయు కజకతో యేపుమై నిలిచి
అట రక్షణము చూచి అప్పు డిట్లనయె అట . . కూ . . ద్రి పై ... దాని
కదలక ధర్మార్థ కామముల్ మూడు పొది నున్న శిలివోలి పొలుపొందు దాని

ముగింపు :

ధరిణిజ కానక తద్దయ ... అలరు రావణ . . . . . .
.... .... .... సభామ . ను తిరిగి ...
యౌవ ... సముఖం గృశి యొక మ్రానిక్రింద విపుల దుఃఖముల చేవెల్లి మునిగి ..

విశేషాంశములు :

గ్రంథము మిక్కిలి క్రిమిదష్టమై యున్నది. ఆద్యంతములు లేవు.

ఈ ప్రతియందు మొత్తము ఐదు కథలు గలవు. గ్రంథపాతములు కలవు. పెక్కు దోషములు గలవు.

# రుక్మిణీ కల్యాణము

## గడ్డం నరసింహారెడ్డి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 2304 | కాల్ నెం. | : టి. 3—200 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 5 |
| ప్రతి పరిమాణము | : 45×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 నుండి 7 |

శ్రీరామ కృష్ణుల సేవించి మదిని భగవ దనుగ్రహ ప్రౌఢిమ గాంచి
రుక్మిణీ పరిణయము రూఢంబుగాను ద్విపద కావ్యంబుగా ధీమంతు లెన్న
రచియింతు సీగతి రక్షించు హరియు భక్తి సమర్పింతు భగవంతునకును
నదియెట్టి దన్నను ఆర్యులు వినుడి శుకయోగి అభిమన్యు సూనుని జూచి

ఖగనాథు డమరేంద్రు కణకతో గెల్చి యమృతంబు దెచ్చిన యా రీతితోడ
జగదీశులను గెల్చి చెలగుచు దెచ్చి రుక్మిణీదేవి సురూపిని పెండ్లి
యాడె నటన్నను నాసక్తితోడ అర్జున పౌత్రుండు అడిగె నిట్లనుచు
శుకయోగి చంద్రుండు చెప్పంగ దొడగె తెలుగు విదర్భదేశం బన బరగు
ఆ భూమి కధిపతి అరయ భీష్మకుడు అతనికి పుత్రులు అయిదుగు రొక్క
కూతురు గల్గెను కూరిమి .... కడగొట్టుదై పుట్టె కమలాంశమునను
ఆ లలన రూపంబు ఆ సుబుద్ధులును చారులచే విని చక్రియు దనకు
యిల్లాలుగా .... యుక్త మనుచు నిశ్చయంబుగ నుండె నీరజాక్షుండు

**ముగింపు :**

రాజీవ నేత్రుండు రాజుల గెల్చి రాజస మొప్పగా రాజీవ నేత్రి
తన పురికి దెచ్చియు దానవ వైరి శుభముహూర్తంబున సుందరీ మణిని
పెండ్లి యాడెను హరి ప్రేమ దళుకొత్త పురజనుల్ వస్త్రాది భూషణంబులును
కానుకల్ దెచ్చిరి కడుప్రేమతోడ ఆదిలక్ష్మినిగూడి అటుక్రీడ సల్పి
జగతిలోపల నున్న జన ముల్లసిలిరి అని చెప్పె నమౌని ఆ పరీక్షితుకు
యీ .... రితంబటుల లోనయువారు చదివిన వ్రాసిన చక్కగా వినిన
యిహమందు గలుగును యిష్టసంపదలు పరమందు మోక్షంబు బాగుగా గలుగు
సత్యంబు దీనికి శంకయులేదు వైదర్భి కల్యాణ వైభవం బపుడు
ద్విపదగా రచియించె ధీమంతు డైన గద్దమాన్వయవార్థి కంజాతమిత్రు
నరసింగరాఖ్యుండు నయకోవిదుండు విష్ణుభక్తుం డన వెలయుచు నుండు.

0 0 0 0

**విశేషాంశములు :**

ప్రతివిలేఖనము : అం(గిరస) నామ సం॥ మాఘ బ ౫ (ర) యిందువారం ద్విపద కావ్యం రుక్మిణీకల్యాణం మందడి వెంకయ్య స్వహస్తం వ్రాసినారు.
ప్రతి చాల క్రిమిదష్టమై శిథిలావస్థలో నున్నది. భాషాదోషములు కొద్దిగా నున్నవి.

# రుక్మిణీ కల్యాణము

## బమ్మెర పోతన



ప్రతి : తాళపత్రము; అసమగ్రము. పత్రములు : 11

ప్రతిపరిమాణము : 44.2 × 3.6 సెం. మీ. పత్రపంక్తులు : 6

**ప్రారంభము :**

క. ఆ వనజగర్భు పంపున రైవతు డనురాజు దెచ్చి రామున కిచ్చెన్
రేవతి యనియెడు కన్యను భూవర మును వింటిగాదె బుద్ధిం దెలియన్.

వ. తదనంతరంబ.

మ. ఖగనాథుం డమరేంద్రు గెల్చి సుధ మున్ గైకొన్న చందంబునన్
జగతీనాథుల చైద్య పక్షచరులన్ సాల్వాదులం గెల్చి భ
ద్రగుడై చక్రి వరించె భీష్మకసుతన్ రాజీవగంధిన్ రమా
భగవత్యంశభవన్ మహాగుణమణిం బాలామణిం రుక్మిణిన్.

**ముగింపు :**

ఆ. అనయ మాదిలక్ష్మియైన రుక్మిణి తోడ గ్రీడ సలుపుచున్న కృష్ణు జూచి
పట్టణంబులోని ప్రజ లుల్లసించిరి ప్రీతు లగుచు ముక్త భీతు లగుచు.

వ. అని చెప్పి.

క. కువలయ రక్షాతత్పర కువలయ దళనీల .... .... దేహా
కువలయ నాదశిరోమణి కువలయ జనవినుత విమలగుణ సంఘాతా.

మాలిని॥ సరసిజ నిభహస్తా సర్వలోక ప్రశస్తా నిరుపమ శుభమూర్తీ నిర్మలారూఢ కీర్తీ
పరహృదయ....దారీ భక్తలోకోపకారీ గురుజనబుధపోషీ ఘోరదైతేయశోషీ.

॥రుక్మిణీ కల్యాణము సంపూర్ణము॥

**విశేషాంశములు :**

ఈ రుక్మిణీ కల్యాణకథ మహాభాగవత దశమస్కంధ పూర్వభాగాంతర్గత మైనది. గ్రంథము క్రిమిదష్ట మైనది. ఆఖరి పత్రము రెండుగా విరిగి పోయినది. గ్రంథపాతము కలదు.

# రుక్మిణీ కల్యాణము

## బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 753 | కాల్ నెం | : టి 3-539 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 29 |
| ప్రతిపరిమాణము | : 24.3×3.3 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 |

**విశేషాంశములు :**

ఈ ప్రతి చాలవరకు క్రిమి దష్టమై చాల శిథిలావస్థలో నున్నది. లిపి స్పష్టము. ప్రతి విలేఖనమున స్వల్ప దోషము లున్నవి. ఈ ప్రతి విరోధి నామసంవత్సర వైశాఖ శుద్ధ సప్తమి శుక్రవారం నాటికి గడివేముల సంజీవయ్య కుమారుడు రామయ్యచే వ్రాయబడినది.

# రుక్మిణీ కల్యాణము

## బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 2793 | కాల్ నెం | : టి 3-538 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 9 |
| ప్రతిపరిమాణము | : 35.8×3.7 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 |

విశేషాంశములు :

గ్రంథ శైథిల్య గ్రంథపాతములు కలవు. కొన్ని పత్రములు మిక్కిలి శిథిలము లైనవి. సుమారు 50 పద్యము లుండవచ్చును. వ్రాత దోషములు కలవు.

# రుక్మిణీ కల్యాణము

## బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5689 | కాల్ నెం | : టి 3-584 |
| ప్రతి | : తాళపత్రము, అసమగ్రము. | పత్రములు | : 15 |
| ప్రతి పరిమాణము | : 37×3 సెం.మీ. | పత్రపంక్తులు | : 5 |

**విశేషాంశములు :**

ఈ ప్రతి చాలవరకు క్రిమిదష్ట మైనది. లిపి స్పష్టము. లేఖన దోషములు కలవు.

# రుద్రాక్ష మాహాత్మ్యము

## గోపతి లింగకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 2794 | కాల్ నెం | : టి 3-212 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 30 |
| ప్రతిపరిమాణము | : 30.5×4 సెం. మీ. | పత్రపంక్తులు | : 6నుండి7 |

**ప్రారంభము :**

చ॥ .... .... .... .... శిష్టమానసుం
దజరు దమేయు దవ్యయు దనామయు దక్షయ మూర్తి యై మమున్
నిజమహిమ ప్రభావగతినిన్ బిగిబాయక బ్రోచు నెప్పుడున్
భజన మొనర్తు మజ్జనకు పాపయలింగము నెల్ల కాలమున్.

క॥ అంగుగ తుమ్మా పాపయ లింగం బను ఘనుని సాధ్వలింగాంబ తపః
సంగతపుత్రుని గోపతి లింగం బను కవిని శివుని లీలలు వెలయన్.

క॥ నప్పరమేశ్వరు డుమయున్ నెప్పుడు మత్హృదయ పీఠిని వసించి కృతుల్
జెప్పగ జెప్పితి నెలమిన్ తప్పొప్పులు నావిగావు తథ్యం బరయన్.

వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నే రచియింపం బూనిన యీ కృతి కధీశ్వరుండును అండజాకర్ణ కుండలుండును చండికా హృదయపుండరీక చండాంశుండును భక్త మనోహరుండును గర్వితాజాండుండును మండితాఖండలాకారుండును నిగమగోచర జగదాంగుండును నైన పైరాగ్యేశ్వరగురుం డని సంతసించి తత్పదపయోజాంకితం బుగా నా యొనర్పం బూనిన నిమ్మహాప్రబంధ ప్రారంభం బెట్టి దనిన.

ఆ.వె. సకలవేదశాస్త్ర నికరపౌరాణేతి హాసములను నీశ్వరాక్షులకును
రూఢిజనన మైన రుద్రాక్ష ఘనమహా మహిమ లొనగెడున్ సమస్త విధుల.

క॥ సలలిత మగు రుద్రాక్షల ఫలములు తన్మహిమ పద్మపౌరాణమునన్
విలసిత కృతి వర్ణించెద కలితోన్నత లీల పద్యకావ్యము గాగన్.

ఉ॥ అంబుభవోద్భవాండముల నంతయు నేలెడి వీరశైవ ర
త్నం బగు విష్ణుదేవు దమరాధిప ముఖ్యుల బ్రోవగా కటా
క్షం బవలంబితోన్నతముగా ధరణిన్ ఘనరామచంద్రుడై
అంబరకేశు దివ్యచరణాంబురుహంబులు నాత్మ దాల్చుచున్.

* * *

ముగింపు :

క॥ అని యిట్లు రాఘువునకున్ ఐనుపడి బోధించె శంభుభట్టారకు డి
ట్లను నీకృతియిలవెలయును ఘనతర మాచంద్ర తారకాదీప్యముగాన్.

క॥ ఈ పుణ్యచరిత మహిలో నేపారగ నెవ్వరేని హితమతి గృహమం
దీ పుస్తక మర్చించిన పాపక్షయ మఖిల పుణ్యఫలవృద్ధి యగున్.

x x x x

పంచ చామర వృత్తం॥

పరాపరాత్పరప్రమేయ భక్తవత్సలాయ తే
సురాసురార్చితాయ శంభుశూలి చంద్రమౌళి భా
స్కరాసుధాకరానలాక్ష కర్మఖండ నాయతే
హరా శివామహేశ యీశ లింగ యీశ్వరం భజే.

గద్య :

ఇది శ్రీగిరిమల్లికార్జునదేవర దివ్య శ్రీకరుణాకలిత వరప్రసాదలబ్ధ కవితావిచిత్ర పాపయలింగనామాత్యపుత్ర గోపతిలింగ నామధేయ ప్రణీతం బగు శ్రీవీరమాహేశ్వరాచార సంగ్రహంబునం గల శ్రీరుద్రాక్ష మాహాత్మ్యం బను మహాప్రబంధంబును సర్వంబును యేకాశ్వాసం సంపూర్ణము.

* * *

విశేషాంశములు :

శ్రీ వీర మాహేశ్వరాచార సంగ్రహంబునగల యీ రుద్రాక్షమాహాత్మ్యమును కవి ఏకాశ్వాస ప్రబంధముగా రచించినట్లు గద్యమువలన దున్నది. కవి దీనిని మల్లికార్జునునకు అంకిత మొనర్చెను.

ఈ ప్రతియందు మొదటిపత్రము లేదు. పదవపత్రము చివరయు, పదునారవ పత్రము సగభాగముపైగా శిథిలమై యున్నవి. లిపి గ్రహించుట కొద్దిగా కష్ట మగుచున్నది. దోషములు గలవు.

# లక్ష్మీ నారాయణ సంవాదము

## కూర్మనాథ కవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 648 | కాల్ నెం | : టి 3-129 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము. | పత్రములు | : 32 |
| ప్రతిపరిమాణము | : 38×3 సెం.మీ. | పత్ర పంక్తులు | : 4 |

ప్రారంభము:

క. శ్రీలక్ష్మీ నారాయణ నీలాంబుద తులితదేహ నీరజనేత్రా
లాలితముగ నీ చరితము లోలిం బ్రస్తుతులు జేతు నొసరగ మదిలోన్.

ఆ. కాముతల్లి పాల కడలికూతురు లక్ష్మి సామి వేట కేగి జాగు సేయ
గృహము మేనలంకరించి చెక్కిటచెయి గదుమ హాదిదలంచి గడపనుండె.

చ. జలరుహబాణకోటి నెకసక్క్య మొనర్చెడు వన్నెకాడు చె
న్నలరెడు గొల్లకన్నియల యాత్మలు కొల్లలుగొన్న రేడు మ
ర్దలకలగీతవాద్య చతుర ప్రమదాళ .... మేలు ....ని
శ్చలకృపతోడ వచ్చె నలశౌరి రమాంగన యున్న యింటికిన్.

చ. పరవనితాంగరాగ రసభవ్యతరోచిత కోచి వచ్చు న
య్యురగళయానుజూచి తంము .... న లేచి తల్పు వే
గిరమునవైచి శయ్యదగు కృష్ణు .... ని దా మరలంగ జూచి యిం
దిర బహిరంతరస్థు డగు దేవుని జూచెమ ...

ముగింపు :

మ. అరవిందాక్ష ముకుంద కృష్ణ నరసింహా శౌరి గోవింద శ్రీ
ధర నారాయణ వాసుదేవ పరమాత్మా భక్తసంరక్షకా
హరి వైకుంఠ యనంత చక్రధర దైత్యారాతి దీనార్తి సం
హరణా తావక దాస దాసజనదాస్యం బిచ్చి రక్షింపవే.

ఉ. నావిని మందహాస వదనంబున వెన్నెల గాయు పద్మ మే
మో వికసించ దంచు జనముల్ మనముల్ వెరగంది చూడ నా
పావన శీల గన్గొని కృపారస వర్షనియుక్త హర్ష వ
ర్షావనదంబు గర్జిలిన చందమునన్ దను జూచి యిట్లనెన్.

సీ. వైనతేయ విరాజమాన ప్రభావంబు ఆంజనేయుని పావనాత్మయుక్తి
చెలువౌ ననంతుని శేషత్వమహిమంబు .... షణుని పుణ్యజన విభుత
ప్రహ్లాదు సన్మార్గ వరదాన వత్వంబు శుకభాగవత హిత ప్రకటసూక్తి
శ్లాఘ్యమౌ భీష్ముని శాంతనవత్వంబు అర్జున విజయ కథాతిశయము
గీ. నుర్వి నీయందు కలదుగా యూహ సేయ .... ను నీకే యణేయ మ టయ్య మాయ
పరమవైష్ణవ పుంభావ భాగదేయ నైష్ఠిక విధేయ పరకాల నా ....

**విశేషాంశములు :**

ఇందు లక్ష్మీ నారాయణుల సంవాదము మనోహరముగ కావ్యరూపమున నున్నది. ఈ కవి తాను హరిహర దాసుడనని చెప్పుకొనెను.

ఈ ప్రతియందు మొదటి రెండాశ్వాసములు గలవు. కాని రెండవ ఆశ్వాసాంతము లేదు. ఇందు కావ్యవివరాదులుగాని, కృతిభర్త వివరాదులు గాని మొదట లేవు.

ఈ ప్రతి అంతయు మిక్కిలిగ క్రిమిదష్టమై యున్నది. ప్రతి విలేఖమున దోషములు గలవు. లిపియు స్పష్టము కాదు. ఈ ప్రతి చివర కొన్నికీర్తనలు నాలుగు పత్రములలో కలవు.

# లక్ష్మీ విలాసము

## రాయసము వేంకటపతిమంత్రి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3828 | కాల్ నెం | : టి 3-277 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 119 |
| ప్రతిపరిమాణము | : 18×3 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 నుండి 8 |

**ప్రారంభము :**

శా. శ్రీలన్నించు రమావిలాసమతి మైత్రిన్ చిత్తకంజంబునం
దాలేఖ్యాకృతి హెచ్చి పెక్కురుచి బాహ్యంబందె నా పే రెదన్
లాలిత్యంబులు జూపు సింధుజయు దేలన్ క్రీడలన్ ధన్యు నా
లీలాబ్రహ్మము శేషశైలపతి జాలిం బ్రోచు మమ్మెప్పుడున్.

సీ. భాస్వదుత్పల హితప్రకట దృగ్గరిమతో దృఢతటిద్వన దేహ కాంతితోడ
వివిధ ముక్తాహార వక్ష్యమండనముతో శ్రీవరనామ సంసిద్ధితోడ
గురుజీవన గ్రహ కుండల రుచులతో పటుసువర్ణ విచిత్రపటిమతోడ
తతసహస్రారాజ్య యుతకర క్రీడతో విపులాభరణ కళావృత్తితోడ
గీ. నాత్మవిలసన పదరూఢి నతిశయిల్లు యిందిరాదేవి హృదయారవింద పీఠి
దిరముకొన జొక్కు వేంకటాధిపుడు మమ్ము పూర్ణ సకలేష్టదాయియై బ్రోచు గాత.

వ. అంకితంబుగా రచింప బూనిన రమావిలాసం బను రసవత్ప్రబంధంబునకు కథాక్రమం బెట్టి దనిన.

క. శ్రీరమణీశ కథామృత సారముసం దనివిసనప జనమేజయు డి
చ్చారతి వైశంపాయను సారమతిం జూచి పలికె సవినయ మతియై.

సీ. అనఘ భారతము సం దాదిపర్వంబున దివిజు లంభోధి మథించుటయును
సరసిజాలయ యందు జనియించుటయు జక్రి వరియించుటయును మీవలన వింటి
మును పది సంకోచమున బల్కితిరి మీరు కావున దత్కథాక్రమము వినగ
వేడు కయ్యెడు నాకు విబుధులు యే రీతి నంబుధి ద్రచ్చి రందు శ్రీమధురవాణి

గీ. జనన మేరీతి నడచె నా శౌరి యెటుల పరిణయం బయ్యె నవి సవిస్తరముగాగ
నాన తీవలె నన్న హర్షాదరమున జన పతికి దెలుప దొడగె నా మునివరుండు.

క. అమరవరు లందరును దమ కమరత్వము బలసమృద్ధి యారోగ్య శ్రీ
లమరగ యోజ నలర గని యమరగని యమృతలబ్ధి నగునది యనుచున్.

చ. కులగురు డా పితామహునకుం దెలుపం దగునట్టి కార్య మ
య్యలఘుడు నిర్వహింప గలడంచు పురారి పురస్కృతంబుగా
పలుకులకొమ్మ నేలు దొరపాలికి వేడని భక్తియుక్తులై
వలగొని వందనంబు లతివాంఛితముల్ దెలుపన్ విరించియున్.

* * *

ముగింపు :

సీ. పూర్ణశశాంక బింబంబు భాతిగ ప్రభ వించి చిన్మయాకారత వహించి
సంచితాజ్ఞానక సమదూమ రుచిబొల్చు చిద్జ్ఞాన దీపికా శ్రేణిగూర్చి
స్ఫుటశుభాశుభకర్మ సూత్రసంవళితల జీవుల చిత్రప్రతిమల నొనర్చి
భావానుభావుక భాతి యొప్పగజేసి గూఢరూపముచేత లీలనొప్ప

గీ. (పరమ)పురుష స్వరూప విభ్రాజితప్ర పంచమున(కీలు)బొమ్మలా డించుకొనుచు
ప్రౌఢి క్రీడించి రాద్యదంపతులు వేడ్క నిరుపమాన యథేచ్ఛా విలోలు దగుచు.

సీ. విద్యా నవోద్యానవద్యా నట స్ఫూర్తి మందార కుందార విందకీర్తి
శ్రీకార రాకార తాకార సిద్ధాంత శ్రుతిహార తతిహార శుకవయస్య
ప్రాలంబనాలంబ కోలంబకులవేణి వీణాంక శోణాంక విమలపాణి
దీనాయ సూనాయ మానాయ గుణపాత్ర కంజాత సంజాత ఘనకళత్ర

గీ. భారతీదేవి చాతుర్య భారతిష్ఠ సరసులకు నీ రమావిలాస రసకావ్య
రసన భావింపు మఘరివా గ్రచనగూర్చి మహిమనీషుల జేయు ధీమహిమ వెలయ.

సీ. రాజీవ రాజీవ రాజీవతేజంబు మారోప మారోప మంజురేఖ
సంతాన సంతాన సంతానసౌఖ్యంబు బలహరి బలహారి పబలి విభవ
వామాంగ వామాంగ వామాంగసంపద తారేశ తారేశ యోమకీర్తి
కాండ ప్రకాండ ప్రకాండ ప్రభుగుణాప్తి శృంగారశృంగార శిఖరధృతియు

గీ. శ్రీ(కర)విలాసి యొసగు లక్ష్మీవిలాస చతుర కృతి స్వప్నపతియించు చతురులకును
శుభకకావృత్తిలో పురుషోత్తముఁడిదు పరను సంపదలాచంద్ర తారకముగ.

క. భావన భావస చేలా, దానవదానవరశీల తతకరవాలా
తానవ దానవ లీలా, మానవ మానవన ఖేల మఖగోపాలా.

వనమయూరము :

అధ్వగత దుర్భరశిలాకృతివధూటీ సాధ్వసచివోద్యమవిశాల పరధాటీ
అమితర విదూషక కులాద్రిశతకోటీ మధ్యముని హృత్కమల మధ్యనిజధాటీ.

x x x x

గద్య :

ఇది శ్రీమద్వేంకటరమణ కరుణాకటాక్ష సంప్రాప్త సారస్వతవైభవ లక్కయామాత్య తనూభవ రసికజన హృదయంగమ సంగీత సాహిత్య కళాధౌంధర్య రాయసము వేంకటపతి మంత్రివర్య ప్రణీతంబైన లక్ష్మీవిలాసం బను మహాప్రబంధంబునందు సర్వంబును పంచమాశ్వాసము సంపూర్ణము.

విశేషాంశములు :

ప్రతివిలేఖనము : క్రోధి నామసం॥ చైత్ర శు॥ ౧౩ ఆరభ్య బ॥ ౧౩ సోమవారం సాయంత్రంతంవరకు —— ప్రతిలోవున్న క్రమాన వ్రాసి ముగించిన లక్ష్మీవిలాసము సంపూర్ణము.

ఈ కవి తాను వేంకటరమణ కరుణాకటాక్షలబ్ధ సారస్వత విభవుడ నని చెప్పుకొనెను. ఇతడు సంగీత సాహిత్య కళాధురంధరు డని గద్యవలన తెలియు చున్నది.

ఈ గ్రంథము వేంకటేశ్వరాంకితము. సముద్రమథనము లక్ష్మీజననము, లక్ష్మీనారాయణుల వివాహములు ఇందలి ప్రధానాంశములు.

ప్రతి బాగుగా నున్నది. లిపి స్పష్టము. కొలదిగా అక్షరదోషములు గలవు.

# లక్ష్మీ సరస్వతీ సంవాదము

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం : 3903 | | కాల్ నెం | : టి 3-228 |
| ప్రతి | : కాగితము; సమగ్రము. | పత్రములు | : 18 |
| ప్రతిపరిమాణము | : 14.5×19 సెం.మీ. | పుటపంక్తులు | : 17 |

ప్రారంభము :

మ. వినవే భారతి గర్వ మేల వలదే వెయ్యేల నే జెప్పెదన్
నను బోలేవటె నీవు యెంతగరిమన్ నానాప్రకారంబులన్
కొని యా డించు క యున్నగాని భువిలో గానంబు నీ వెంతయున్
వినయంబుం గలిగుండు మద్వినుతయోవిద్యావిశేషంబులన్.

మ. అనినన్భారతి కోపగించి యిపుడు న్నేనేనె వో లక్ష్మిణీ
నిను నీవే కొనియాడుకొంటివి తగన్నీనా మహత్యంబునన్
సనకాదుల్ మునియోగబృంద మెపుడున్ సంస్తుత్యముం జేయుచున్
ఘనతం జెందగ యట్టిమాట లనియెన్ గాంభీర్యవై యుండుమా.

శా. వాణీ నా సరి రావటంచు ననగా వాదించెదో మాటికిన్
వాణీయోదువె నీవు నున్న స్థలమే సత్యంబుగా దెల్పుచు

న్నాకెంబై విలసిల్లుచుండు దెపుడున్ నానీ సమానంబులున్
వీణార్క్యం ధరియించునా డె రుగదే వెయ్యేలనే భారతీ॥

స. వేదములుం బురాణములు విద్యలు శాస్త్రము లెల్ల గావ్యము
న్నాదిగలట్టి నాట్యములునై విలసిల్లెడు నక్షరంబులున్
బోదలుసేయు వాక్యములు పొందుగ భారతి యంచు యెన్నగా
నాదయగల్గి యున్నపుడె నాతిరో లక్ష్మిరో బ్రహ్మవేత్తకున్॥

ముగింపు :

గీ. మీకు నీరీతి గలహంబు మేరగాదు యుభయు లైక్యతచే నున్న నుర్విజనులు
భావుకము నొందుదురుగాన భవ్యలార వైరములు మాను డని మురవైరి చెప్పి

వ. ఇట్లొండొరుల సమాధానపరచి చక్రధరుండు తనతో నరుదెంచిన బ్రహ్మాదుల వీడ్కొల్పి తానును వైకుంఠంబునకుం జనియె॥

విశేషాంశములు :

వ్రాత దోషములు ఛందోదోషములు కలవు. గంగా గౌరీ సంవాదమువలెనే 'లక్ష్మి-సరస్వతుల సంవాదము' అను పేర యీ కృతి వెలయు చున్నది. వీరిద్దరి సంవాదము లోకోపకార మగునని విష్ణువు పేర్కొని వారి వాగ్వివాదమును తీర్చెను.

గ్రంథకర్త నామముగాని, వ్రాయసకాని పేరుగాని, కాలముగాని పేర్కొనబడలేదు.

# వకుళభూషణ భాస్కరోదయం

## చెన్న భట్టు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4575 | కాల్ నెం | : టి 3-4 |
| ప్రతి | : కాగితము; సమగ్రము | పుటలు | : 169 |
| ప్రతి పరిమాణము | : 22×18 సెం.మీ | పుట పంక్తులు | : 18 |

ప్రారంభము :

శా॥ శ్రీకాంతా కుచకుంకుమాంకిత లసత్ శ్రీవత్సవక్షోగ్రస
త్ప్రాకారోపమిత ప్రసూన సరముల్ప్రాగాది దిగ్దేశముల్

జీకట్లన్ విదలింప పెక్కుతులు దా జేమోడ్పులన్ జేయగా
లోకాలోకమత ప్రసిద్ధచరితున్ లోకేశ్వరు న్గొల్చెదన్ ॥

ఉ॥ మారుని తల్లినిన్ కుసుమమంజుల కల్పకవల్లి భక్తులం
న్నారసి జన్మసిరభిని నల్లక వేగమె ప్రోచి భర్తచే
కోరిన కోర్కెల న్నొసగ కోరెడు సారససంభవన్ మదిన్
జేరిచి పూజసేతు దరిజేరి మదిప్సిత మెల్ల దీర్పగన్ ॥

వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన వకుళభూషణ భాస్కరోదయం
బను మహాప్రబంధంబునకు కథా విధానం బెట్టిన.

శ్లో॥ కలౌఖలు భవిష్యంతి నారాయణ పరాయణాః
క్వచిత్క్వచిన్మహాభాగాః ద్రావిడేషుచభూయశః
తామ్రపర్ణీనదీతీరే కృతమాలాయశస్వినీ
కావేరీచ మహాభాగా ప్రతీశ్చసరస్వతీ ॥

కం॥ ఈ గతి హరిభక్తుల కథ భాగవత పురాణమునను బలుకుటయు మహా
భాగు డగు దేవరాతురు డాగమపరు శుకుని జూచి యనియె స్ప్రీతిన్॥

మ॥ మునినాథోత్తమ నీ ప్రసాద మహిమన్ మోదంబు సంధిల్లె నా
కనిశంబు న్సకలార్థము ల్సఫల మయ్యె న్గాని నింకొక్కటే
వినవేడ్క న్మదినుంచి వేడెదను భావిన్ద్రావిడోర్వీస్థలిన్
ఘనయోగు ల్జనియింతు రంట నది సాకల్యంబుగా దెల్పవే॥

వ॥ అని యడిగిన పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండు వినుపించబూని॥

మ॥ మనుజాధీశ మహాప్రసంగ గతిగా మానాథు భక్తాళి సం
జననంబు ల్వినుపించి తిప్పుడది నిస్సందేహమౌ నట్లుగా
వినుపింతు న్వినుమ త్తెరం గిపుడు నే విన్పింతు కన్నంత యం
చు నయోపేత భవద్వచోగరిమకున్ చోద్యంబు సంధిల్లగన్॥

మ. పరమవ్యోమమునన్ రమాధవుడు సుప్రఖ్యాతమై యప్పుడున్
బరగున్ స్వర్ణమయంబుగా సకలమున్ భవ్యోన్నత్యమున్
ధరయున్ నీళయు నిత్యులు న్వరుసగా దాస్యంబు సేయ న్నిరం
తర కేళీ మణిమంటపంబున రమాతన్వి మనోల్లాసియై ॥

సీ॥ ఎవ్వారి జూచిన నవ్వారిజాక్షుని రూపలావణ్య స్వరూపయతులు
ఎచ్చోట గనుగొన్న నచ్చట విష్ణు వి హారమంటప ఘనోద్యానములును
ఏ దిక్కు బొడగన్న మోదావహంబుగా సామగాన ధ్వానసంకులంబు
ఎచ్చోట వీక్షింప వాచామగోచర భాసుర ధవళాత పత్రములును
ఎందు విన్నను రామ గోవింద కృష్ణ పద్మనాభ మురాంతక పరమపురుష
యనుచు గొనియాడు శుక శారి కాద్యనేక విహగములు గల్గి తత్పురి వెలయు చుండు॥

ముగింపు :

వ. అపరాంకుశసూక్తులను, శైవపాండితో క్తి వాక్యంబుల నొక్క పలకపై నునిచిన కుదృష్టి శైవోక్తు లన్నింటిని దీసివైచి కరంబుల జలంబులం గడిగి పరాంకుశో క్త దివ్యపత్రిక యొకటి శిరంబున ధరించినం, గని శైవ కవి భయాద్భుతంబులు మనంబున బెనంగ సారమేయంబు వ్యాఘ్రంబురీతి యగునె యని కురుకానగర వకుళాభరణ రచిత ప్రబం ధోక్తులతో నస్మదాది కావ్యకవి ప్రబంధంబులు సమం బగునే యని శఠగోప విషయంబుగా చేసిన అపరాధక్షమంబు గోరి చేసుకొని నిరంత స్వభావ్యుండై పరాకుశ యోగి వైభవంబును విభూతులయందు ప్రకాశింపజేసి సంతసంబున నుండెనని శౌనకాది మునులకు సూతుండు చెప్పె నని శుకయోగి పరీక్షిన్నరేంద్రున కెరింగించె॥

క॥ ప్రకటిత శఠగోపుల కథ యకుటిలమతి వినిన చదివినంతనె భక్తిన్
సుకర మగు వ్రాసినన్ భువి సకలాఘ నివృత్తు డగుచు చను హరిపురికిన్॥

ఉ. శ్రీనగరీవిలాస మునిశేఖర ద్రావిడవేద తత్పరా
భానుసమాన తేజ కచభార విరాజిత సూనముద్రికా
మానితషడ్గుణార్ణవ సమస్తశుభాకర యోగనైష్ఠికా
భూనుత నామసద్వకుళభూషణ భాస్కర నామ ధీమయా॥

పంచ చామరము॥

శ్రియాసహాయకాంఘ్రి చింతితామలాత్మకా
త్రయీమయాస్ఫురద్వచోక్త ద్రావిడ ప్రబంధదా
త్రయీసమానదివ్యరూప చిత్రభానుతేజయా
సుయోగిరాజశ్రీ శఠారిదివ్యనామకా ॥

**గద్య :**

శ్రీవకుళభూషణ కృపాలబ్ధ కవితాప్రతిష్ఠ సూత్ర కాశ్యపగోత్ర జగన్నాథార్యపుత్ర చన్నభట్ట నామధేయ ప్రణీతంబైన వకుళభూషణ భాస్కరోదయం సంపూర్ణం॥

**విశేషాంశములు :**

కాగితమునకు రెండువైపుల వ్రాయబడియున్నది. వ్రాత స్పష్టము. వ్రాత దోషములు కలవు. కొంతవరకు ఈ వ్రాతప్రతియందలి దోషములు దిద్దబడినవి. అయినను ఇంకనూ కొన్ని దోషము లున్నవి.

ఇందు 5 ఆశ్వాసములు గలవు. ఇష్టదేవతా ప్రార్థనానంతరము భవిష్యత్కథా సూచనముజేయు సమయమున స్వప్నమున వ్యాఖ్యాన ముద్రాకలితుండై వకుళాభరణుండు విజయముచేసి స్వవిషయంబుగా నొకప్రబంధము గల్పింపుమని కవిని ఆజ్ఞాపించినట్లు ఈ గ్రంథ మందలి పీఠికా విషయమును బట్టి తెలియుచున్నది. ఇతడు కశ్య పాన్వయుడు. విష్ణుభక్తుడు. ఇతనితండ్రి జగన్నాథార్యుడు. ఈ గ్రంథము విష్ణువునకు (హరికి) అంకితమీయ బడినది. ఇందు ప్రధానకథతో పాటుగా, పెరియాళ్వారిచరిత్ర తిరుమంగయాళ్వారుచరిత్ర మొదలగునవికూడ యిందు గలవు.

# వసుచరిత్ర

## రామరాజ భూషణుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 361 | కాల్ నెం | : టి 3-144 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 133 |
| ప్రతి పరిమాణము | : 43.5×3.5 సెం.మీ | పత్రపంక్తులు | : 6 |

**ప్రారంభము :**

శా. దంతాఘట్టిత రాజితాచల చలద్గౌరీ స్వయంగ్రాహముం
గంతుద్వేషికిగూర్చి శైలజకు దద్గంగా ఝురీభ్రాంతి న
త్యంతామోదము మున్నుగానిడి కుమారాగ్రేసరుండై పితృ
స్వాంతంబుల్ వెలయింపజాలు నిభరాడ్వక్త్రుని బ్రశంసించెదన్.

సీ. తరుణార్క కబళనోద్ధతి జూపె నెవ్వాఁడు రుచులచే ఫలమోహ రుచులచేత
నకలంక రామముద్రిక నూనె నెవ్వాఁడు శయముచే హృత్కుశేశయముచేత
మున్నీరు పల్వలంబుగ దాఁటె నెవ్వాఁడు జవముచే గుణగణార్ణవముచేత
నక్షశిక్షాప్రౌఢి నలరారె నెవ్వాఁడు రణముచె నియమ.......చేత
ధరణి ................... ........ రి కిశోరవ్యక్తి దెలిపె
నతనిమత్కావ్యభవ్య వాగమృత ఘటన మంజులస్వాంతు హనుమంతు మది దలంతు

x x x v

అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన వసుచరిత్రం బను మహా ప్రబంధంబునకుం గథా ప్రారంభం బెట్టి దనిన.

శా. శ్రీరమ్యం బగు నైమిశంబున దపఃశ్రీరాజితా వ్యాజిలే
జోరాజుల్ శకశౌనకాది మునిరాజుల్ సూతజుం జూచి ము
న్నేరాజేంద్రుడు దివ్యచిహ్నధరుడై యేలె న్మహీమండలం
బారాజేంద్రుని దెల్పు మాకన నతం డత్యంత హర్షంబునన్.

శా. శక్రాపాదిత దివ్యచిహ్నధరుడై చంచద్విమానాధి రా
జక్రీడాపరుడై యమానుష మహాసత్త్వాఢ్యుడై భేదిభూ
చక్రేశుండు ధరిత్రియేలె వసుసంజ్ఞుం డచ్చరిత్రంబు ని
ర్వక్ర ప్రౌఢిమ విన్నవింతు నని వాగ్వైచిత్రితో నిట్లనున్.

సీ. వరసుమనోభవ్య తరుల కావాల మ త్యలము కళాపాళికలకు ధరణి
సరిలేని తెలిముత్యసరుల కొటారు క ల్యాణ పరంపరల తొలుదీవి
సురుచిర మణుల కాకర సీమ శ్రుతహిత భాషిత ద్విజకోటి బట్టుకొమ్మ
సరసుల కారామ సరణి శ్రీరంగ గే హక్రోడవాసిని కాటపట్టు

వెలయు నావరణాంబు సంపీతహాట కాండమోహాద పరిఘావృతాంఘ్రి వజ్ర
దంతుర ప్రాంత గంగా నిరంతరాగ్ర భూరి వరణం బధిష్ఠాన పురవరంబు.

* * *

ముగింపు :

సీ. ఆరాజు విమల విఖ్యాతి చంద్రిక నిచ్చ రహి కెక్కజారె జారప్రసంగ
మాఘను దానధారాపూర్ణ వర్ష ము ర్వర బర్వ దిగియె నస్మగహాత్రి

యాలోకహితు వ్రతపాలపం బవిరతో దయ రూఢి దగనింకెద స్యుళంక
యాసద్గుణాబ్ధి చర్యామృతం బెల్లచో దయివార దెరలె నా మయవిభూతి
యమ్మహాశైల చమను రాజ్యమున నిష్ట ఫలము లీనెడుజెట్ల తోబాల వెల్లి
కామ్యం బసితో నఖండ భోగములతోడ ప్రజలు గాంచిరి భూరివైభవ సమృద్ధి.

క. అని యిట్లు రోమహర్షణి తనయుడు వసురాట్కథా సుధారస మఖిలం
బును దెలుప విని మహోత్సవ మున బొదలిరి శౌనకాది మునికులచంద్రుల్.

మ. దృఢబాహాబల భీమ భీమ సమర ప్రేంఖజ్జయశ్రీ పరి
క్రఢిమాఢౌకిత భూమ భూమ హిత తూర్యధ్వాన దత్తేశ ధా
క్కఢమత్కారవినామ నామ కథన క్లామ్యన్మహోద్రిల్లి కా
గఢరాఢాద్యరి ధామ ధామ గరిమ్న గస్త్రగహ గ్రామణి.

క. ధాటీబహుల ధాటీ కన ఘోటీ....ఖురకోటి రజ
శ్యాటీ వృతహరిచపదిప ధూటీ కుచశైల ప్రబల దోర్బల శిలా.

మాలిని :

సారసాహితీ సదధ్వచారి భూరి ధీరసా ధీరసాహసోరు దోరతి స్ఫుర స్మహా సార
.... .... తతీ....రాపగా సుధారసా ధారసాధుకిర్తి హంసధారి సూరిసారసా

* * *

గద్య :

ఇది శ్రీమద్రామచంద్ర చరణారవిందవందన పవననందనప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్ర భాషాసామ్రాజ్య సర్వంకష చతుర్విధ కవితా నిర్వాహక సాహిత్యరసపోషణ రామరాజ భూషణ ప్రణీతం బయిన వసు చరిత్రం బను మహాప్రబంధంబునందు సర్వంబును షష్ఠమాశ్వాసము.

విశేషాంశములు :

ప్రతివిలేఖనము: దుర్మతి నామసంవత్సర ఆశ్వయుజబ॥౩. గురువారంవరకు బణమనూరి బాలకవి వాబయ కొమారుడు జగన్నాథయ తమభాసాకుగాను వ్రాసుకొన్న వసుచరిత్ర ముగిసినది. కవి దీనిని తిరుమల దేవమహారాయలకు అంకితము గావించెను.
ఈ ప్రతియందు పూర్తిగా ఆరు ఆశ్వాసములున్నను ప్రథమ పత్రము పూర్తిము నష్టమైనది. పత్రములు కొంత క్రిమిదష్టమైనవి. ప్రతివిలేఖనమున కొన్ని దోషము లున్నవి. లిపి స్పష్టము.

# వసుచరిత్ర

## రామరాజభూషణుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 1544 | కాల్ నెం | : టి3-142 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 84 |
| ప్రతిపరిమాణము | : 44×4 సెం మీ | పత్రపంక్తులు | : 7 |

విశేషాంశములు :

ప్రతి విలేఖనము : శుభకృతు నామసంవత్సర మాఘ బ౧౨ వరకు ప్రతిలోనున్న క్రమాన కందుకూరి వేంకట నర్సు వ్రాసుకునెను.

ఈ ప్రతి యందు ఆరు ఆశ్వాసములు పూర్తిగా నున్నను మొదటి రెండు పత్రములు మాత్రము లేవు. ఈ ప్రతి చాలవరకు క్రిమిదష్టమై శిథిలావస్థలో నున్నది. ప్రతి విలేఖన దోషములు స్వల్పముగ కలవు. లిపి స్పష్టము కాదు.

# వసుచరిత్ర

## రామరాజ భూషణుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4633 | కాల్ నెం | : టి 3-67 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము. | పత్రములు | : 97 |
| ప్రతి పరిమాణము | : 40×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 8 |

విశేషాంశములు :

ప్రతివిలేఖనము :

నందన నామసంవ్వత్సర భాద్రపద శు॥ ౨ బుధవాసరంవరకు .... ....

ఈ ప్రతియందు రాశ్వాసము లున్నను ప్రతి క్రిమిదష్టమై చాలావరకు శిథిలమైనది. లిపియు స్పష్టముగలేదు. ప్రతి విలేఖనమున చాల దోషము లున్నవి.

# వసుచరిత్ర

## రామరాజ భూషణుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 4632 | కాల్ నెం | : టి 3-143 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 78 |
| ప్రతిపరిమాణము | : 47.5×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 7 |

**విశేషాంశములు :**

ఈ ప్రతి చాలపురాతనమైనది. పత్రములు చాలవరకు క్రిమిదష్టమై విరిగిపోయినవి లిపి స్పష్టముకాదు. భాషాదోషములు, ఛందోదోషములు మెండు.

## రామరాజ భూషణుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 1515 | కాల్ నెం | : టి 3-68 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 29 |
| ప్రతి పరిమాణము | : 46×4 సెం.మీ | పత్రపంక్తులు | : 8 |

**విశేషాంశములు:**

ఈ ప్రతియందు మొదటి రెండున్నర ఆశ్వాసములు మాత్రమే యున్నవి. అందులో కూడ రెండు మూడు తాళపత్రములు లోపించినవి. ప్రతి కొంత క్రిమిదష్టమై శిథిలమై యున్నది. లిపి స్పష్టముగ నున్నది. భాషాదోషములు కలవు.

# వసుచరిత్ర వ్యాఖ్యానము

## సోమనామాత్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 3650 | కాల్ నెం | : టి3-282 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 77 |
| ప్రతి పరిమాణము | : 45×4 సెం.మీ | పత్రపంక్తులు | : 8 |

ప్రారంభము :

తరము యిక్కడ వీణావాదనాని స్మృతి చెప్పినాడు గనక స్మృతియె నిట సంచారి భావము చలాచలత్వము లనగా చాపల్య మనెడి సంచారి భావము అర్థద్వయముకున్ను అభేదాధ్యవసాయము రాగాది నిష్పత్తిస్థానమునందు రాగాది నిష్పత్తి యుపయుక్త మని సమాలంకారము.

చ. జనపతి ంబాలువనగా ధైర్యము ఆతిపనురుండు తావకపదానతుడనగా గిరికాదేవికి తండ్రియైన కోలాహలుడు నీకు పాదాక్రాంతు డని అర్థము పాదాహతి నొందిన వాడని భావము. అంగనగన్న తల్లియద్భుత భవదీయ శార్యరసపోషితజీవన యనగా గిరికా దేవికి తల్లియైన శక్తిమతి శౌర్యముచేత పోషింపబడిన బ్రతుకుగలదని అర్థము.

జలములకు జలములవలన ప్రాబల్యముగనక కార్యరసమనేటి రసముచేత పోషితములైన రసములు గలదని చమత్కారమున్ను గ్రహించవలెను.

క. బాలపాణిగ్రహ అళీకధైర్యమునగా లేని ధైర్యము అళీకంత్వప్రియేస్పృతే అగ కూటాగ్రము దిగ్గి అధోరణుడనగా నూపటీడు ని "అధోరణాహ స్తిపకాఇత్యమరః" చూడ్కికెలమిస్ దత్సంభవాస్తద్యుతుల్ నగజాచారుకం చారు వైఖరులు దెల్పంబట్టి ఘర్మంబునేర్పుగతక్కనన్ విశీర్ణచామర మరుత్ప్రేతంబులన్ దీర్పుచున్ ఘర్మ మనగా స్వేదము సాత్త్విక భావములలో భేదము. ని "ఘర్మస్స్యాదాతపే గ్రీష్మే ఉష్ణస్వేదాంభ సోరపీతి విశ్వః" ఇందుకు లక్షణము పద్యము.

క. సమరతి ఘర్మాదులచే విమలశరీరములయందు విస్ఫుట మగు న
చ్చమటకు నభిధానము స్వే దము దా బలుకుదురు సమ్మదమున నభిజ్ఞుల్

శరీరమునందు పుట్టిన స్వేదమును నేర్పుగ కరికర్ణ చామరవాయువుచేత పోగొట్టు కొన్నాడు గానివ్వ బునాదికముచేత ప్రకాశము చేసినవాడు గనక సుర్మాకార గోపన రూపమైన హవ....ద్దయ నేటి సంచారి భావము.

* * *

ముగింపు :

.... .... .... ఫలమనగా బాణాగ్రమని భావము. ని "హల్యాహారీ నా మిత్యమరః. నిజాగలో జలనిర్ముక్త దేశేకాలేచ జాంగలం హేతసమృద్ధి స్యాత్పలే.... లాభయోః. జాతిఫలేచసంకులెస్వబాణాగ్రయోరితివిశ్వః." నిర్జలప్రదేశమందు సంపూర్ణ

ఫలప్రాప్తి చేసినవాడని అద్భుతార్థము. బాహుదిగ్జయ కల్యాణ యనగా దిగ్జయరూపమైన మంగళము కలవాడని అర్థము. నిజాగుప్త కల్యాణహరా నిజాముచేత రక్షింపబడిన కల్యాణపట్టణమును సాధించిన వాడని అర్థము. నిజామ నిక్షిప్త సువర్ణహరు డని అర్థాంతరము.

ఉత్సాహం దేవికళాటకు ........ దహాళకోటకుంభినీ రమణజూటతరకిరీట రత్నపాటల ప్రభాకమల ఝాటయనగా పాదప్రణతులైన మండలాధిపతులయొక్క కిరీటపాటల ప్రభలనెడి కమలవనముగల వాడని అర్థము కలితకూట కనకపాట సంభ్రమభ్రమిత ఘోటయనగా ఉన్నతశృంగమైన కనకగిరియొక్క మార్గమందు దాటి వేగభ్రమితములైన ఘోటకములు కలవాడని అర్థము. ని "పాటవృత్తైచమార్గేచ నామైక దేశీనామ గ్రహణ" మన్నారు గనక కనకశబ్దముచేత కనకగిరియనే దుర్గమని చెప్పబడ్డది. పెడద కోట పటు కవాటపాటనా.

శ్రీమదాత్రేయకుల కలశాంభోనిధి సంపూర్ణ సోమసోమాభిదాన మంత్రీశ్వర పౌత్రేణ సోమసుత సిద్ధేశ్వర మంత్రీశ్వర పుత్రేణ శ్రీపార్వతిరాజేశ్వర సమాసాదిత హృద్యాన వద్య నిఖిలవిద్యావిశారదేన సోమనామ్నా విరచితాయాం వసుచరిత్ర వ్యాఖ్యాయాం పంచమాశ్వాసం సంపూర్ణం.

ఈ ప్రతి వసుచరిత్ర వ్యాఖ్యానము. మూలరహితము. ఇందు మూడవ ఆశ్వాసవ్యాఖ్య ప్రారంభమునుండియు లేదు. ఇందు తృతీయాశ్వాసార్థభాగము. చతుర్థ పంచమాశ్వాసములకు పూర్తిగాను వ్యాఖ్యానము కలదు. వ్యాఖ్యానకర్త సోమనామాత్యుడు. ఇంతకు మించి వివరములు లేవు. మొదటి రెండాశ్వాసములు మృగ్యము.

ప్రతియందు గ్రంథశైథిల్యము కలదు. అచ్చటచ్చట క్రిమిదష్టమై యున్నది. వ్రాత చక్కనిది.

# వాసవదత్తా పరిణయము

## వీరభద్ర కవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 2798 | కాల్ నెం | : టి 8-102 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 60 |
| ప్రతిపరిమాణము | : 40.5×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 |

ప్రారంభము :

శ్రీరామా నయనోత్పలంబులు విరాజిల్లన్ దరస్మేర దృ
క్తారళ్యస్ఫుటచంద్రికల్ మెరయ నందంబొ ప్రసన్నానన
స్ఫారేందుద్యుతి పొల్చు పెన్నుడు జగత్ప్రఖ్యాత చారిత్రునిన్
ధీరస్వాంతుని రాపు మాధవధరిత్రీ కాంతుసం ప్రోవుతన్.

సీ. అలి జాలముల జాలముల నేలగల నీల కచ నిగనిగ సోయగంబుతోడ
చెలువొందు నలయిందు గళలందు గల కందు గనినవ్వు నవ్వుమొగంబుతోడ
పవడంపు గవకెంపు రవపెంపు మన్న బింబాధర ద్యుతులతోడ
జగమెన్నతగ బ్రన్నన గవిన్నగ నున్న కౌను చక్కదనంబు గరిమతోడ

కొమరు ప్రాయపుసిరి ముద్దుగులుకు ప్రబలి హరియురమ్మున నెలకొన్న సరసిజాక్షి
కలిమి పూబోణి సిరులిచ్చుగాత రాపు రామచంద్రుని మాధవ రాయునికిన్

చ. అజనిజ సృష్టికారియయి హవ్యముగై కొని సోమయాజియై
గజిబిజి రేయనుం బగలు గల్పన సేయుచు శబ్దహేతువై
త్రిజగదసుత్వసిద్ధి బ్రకృతిత్వము గై కొని పోల్చు నవ్వృష
ధ్వజు డజు డష్టమూర్తి ప్రమదం బొసగున్ కృతికర్త కియ్యెడన్.

* * * *

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధి యగునట్లుగా నా రచియింపం బూనిన వాసవదత్తా పరిణయంబను మహాప్రబంధంబునకుం గథాప్రారంభం బెట్టి దనిన.

మ. స్మరసామ్రాజ్య రమాసమాన రమణీచంచత్పదాలక్తక
స్ఫురదుత్తుంగ సువర్ణసౌధము కురీభూతాంగ తాపత్రపా

ఖరదత్తాంక సుధాంశుమండలము చెప్పం బాటలీపుత్రమన్
పుర మొప్పున్ నికటస్థితాద్రిజ తటినీ పూతాఖిలాశాంతమై.

సీ. గిరిసారవ ప్రభాస్వరతా రచిత ఘోర పరివార చకిత పక్కిరివరంబు
సలిలాంతరిత సాతలతాంత రుచికాంత జలజాంత పరిఘాఢి వలయితంబు
సురసాల జయశీల సురసాల ఘనజాల పది నీల సితవప్ర పరిసరంబు
ఫల .... ....భూతల జాతరుచి ధూత కలధౌతమయ ధరా విలసనంబు
గోపురాగ్ర విరాజిత గోపురాంత దీపితానర్ఘరత్న ప్రదీప సుప్ర
తాపభాసిత వలయాద్రి భూపదంబు భూపదాంబుజ నూపురం బాపురంబు

సీ. కుంభసంభృత శాతకుంభచ్ఛవిచ్ఛిన్న చండభాను ప్రభామండలములు
తపన ప్రభాబద్ధ ధౌతాగ్రవేలాభ జలధరాంకిత వలభి లసితములు
మదనాహవోదయన్మణి తానుగుణగుణో ర్కల రవాన్విత విటంక వ్రజములు
శశికాంత మణిమయ స్థల సమీకృతయంత్ర సలిల ధారాపూర సలితములు
నికటమణిసాల భంజికాప్రకటితోష్ఠ బింబదంశన కుంతితౌదుంబరాభ
తుండమండిత పంజరస్థాండజములు నందు జెలువొందు భూమి భృన్మందిరములు

ముగింపు :

కం. అయ్యిరువు రిట్లు మారుని కయ్యం బొనరించి యలసి కడువేడుకతో
శయ్యపయి నిదుర జెందిరి అయ్యెడలం బ్రభాత సమయ మయ్యె న్వేగన్.

సీ. కెందమ్మి రేకుల గేరు కన్నులమీద నిద్దురకొరత రాజించియుండ
విడెపు సేతలకెంపు విడిసొంపుగల మోవిపై రదక్షతములు బయలుపడగ
చిటులు గంధంబుతో జిన్నారి పాలిండ్లు నఖరాంకముల సమున్నతి వహింప
చెదరి ముంగురులు నెన్నుదుటిపై దిగజార వదలిన కిల్గంటి వన్నె యొసగ
స్రుక్కి నెమ్మొగ మొకవింత సొబగు దెలుప జిక్కువడి తారహారముల్ చిందులాడ.
ప్రాణవిభుకోర్కి దీర్చి వైభవముతోడ పడతి యోవరిలో బయల్వెడలి నిలిచె.

శా. వందివ్రాతము లందచేరి తగుకైవారంబు గావించి యా
నందంబంది విపంచికావళుల బూర్ణగ్రామ విస్ఫూర్తి నిం
పొందం బాడుచు మేలుకొల్పిరి నిజోద్యోగంబు దీపింపగా
గంధర్వప్రతిమాను నమ్మనుజలోకస్వామి ధీరాగ్రణిన్.

క. ఈ కరణి ననుపమాన శ్రీకలితుం డగుచు నృపతి చిరకీర్తి గనెన్
ప్రాకటముగ నీ సత్కృతి యాకల్పము వెలయు సుకవు లభినందింపన్.

మ. ధనధాన్యాఢ్య నిశాంత శాంత జనసంతానా వనానంద పా
వన దీవ్యైభవ కాంతకాంతవ విభావస్సైజ లీలాశ్రయ
ఘనకాంతా జనతాంత తాంత విమత క్ష్మాపాంచమౌళి ప్రభు
ట్టన ధౌరేయ పదాంత దాంత గుణకాండ ప్రాభవాలంకృతా.

క. చండకరతేజ మహిభృ న్మండల గణనీయ గుణసమాజ రణ ధరా
ఖండల తనూజ నానా పండిత సుర భూజ చతుర భాషాభోజా.

మాలిని :

సతత విమల చైత్రా సజ్జనారామ చైత్రా
వితతగుణ పవిత్రా విద్వదాస్యాబ్జ మిత్రా
చతురసుత చరిత్రా చంద్రభూకాంత పుత్రా
భృతసమధికగోత్రా ప్రీతా లక్ష్మీకళత్రా.

గద్యం :

ఇది శ్రీ వక్కలంక చంద్రశేఖర మహాకవిపౌత్ర భాస్కర సుకవిపుత్ర విద్వజ్జన విధేయ వీరభద్ర నామధేయ విరచితంబైన వాసవదత్తా పరిణయం బను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

విశేషాంశములు :

ప్రతివిలేఖసము : సాధారణ నామసంవత్సర చైత్ర శుద్ధ ౬ శనివారం సర్కి వాసవదత్తా పరిణయం సంపూర్ణంగా వ్రాయుటమైనది.

గ్రంథము అచ్చటచ్చట క్రిమిదష్టమైనది. గ్రంథపాతములు కలవు. మాధవ ప్రభు కంకితము. ఇతడు రేచర్లగోత్రుడు. పద్మనాయక వంశజుడు.

# వ్యాఘ్రబ్రాహ్మణ సంవాదము

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 720 | కాల్ నెం | : టి 3-221 |
| ప్రతి | : తాళపత్రము: అసమగ్రము | పత్రములు | : 12 |
| ప్రతి పరిమాణము | : 39×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 నుండి 7 |

**ప్రారంభము :**

....మధువిమర్దన సకల ధర్మములలోన సత్య ముత్తమం బని సకల శాస్త్ర విధులు పలుకగా విందు తత్ప్రభావంబు నాకు నీకు మ్రొక్కెద దెలుపవె నిశ్చితముగ.

క. ఏ ధర్మముచే కీర్తి సు ధాధామస్ఫ్రదీప్తి దనరుచు నిలుచున్
సాధతరంబుగ దెలుపు ర మాధిపతీ నీ కొనర్తు నభివందనముల్.

గీ. ఎందుచే వినిన వసింతు రెల్లజనులు యెందుచే సమధికైశ్వర్య మందగలుగు
యెందుచే పుత్రసంపత్తి యెనయుచుండు ననఘ తద్ధర్మ మెరుగ నా కాన తిమ్ము.

క. సాంద్రానందమున హరి శ్చంద్రాదులు సత్యరతుల జననాయకులా
యింద్ర పదంబున నేడు ను పేంద్రా యున్నారటంచు యే వినుచుందున్.

వ. అని పలికిన యవసరంబున పతివ్రతా మూర్ధన్య యగు ద్రుపదరాజుకన్యక యదు విభున కిట్లనియె.

**ముగింపు :**

.... నాద్యంతవిరహితుం డఖిలేశ్వరుండు సృజింపపోషింప నడంప గర్త బ్రహ్మయు విష్ణుండు భవుండు నింద్రుండు నగ్నియు, జముడును నైరుతియును వరుణుండును,వాయు కుబేరుడును చంద్రసూర్యులు భూర్భువస్వర్లోకములు దలంప ....త నాథుండు నని మనమున దెలియుము. ధాత్రి హరి .... .... లేదు. వారలన్యోన్య పూజ్యులై వరలుచుంద్రు తద్రహస్యంబు దెలిపెద ధర్మతనయ.

కైలాసంబున కేగికృష్ణుడు శివుం గాక్షించి సేవించి ధీశాలిం సాంబుని గాంచె శంభుడు హరిన సద్భక్తి పూజించి తేజోలాలిత్యకుమారునుం .... దియజ్ఞాను సృజించి నర్చించి నా నాలోకంబు .... .... నగతనయం ధరం సిరిం నాలుగు వర్ణముల

నీతి .... పొందుగ తుదినొక్క అక్షరముపూని అశించిన యంత మాత్ర .... ....
డింపగ చతురాననుండు సరజస్సుడు పంచశరుండు వహ్నియును.

**విశేషాంశములు :**

ఈ కావ్యమునకు ఆద్యంతములు లేవు. గ్రంథము కూడ 12 పత్రములదే. ఇది విడిగ్రంథముగాక వేరొకగ్రంథములోని భాగమై యుండవచ్చును. ఈ గ్రంథ నామము కాని కవిపేరుగాని ఇందెచ్చటను లభ్యముగాలేదు. ప్రతిపై మాత్రము వ్యాఘ్ర బ్రాహ్మణ సంవాదము అని గలదు.

సత్యముయొక్క ప్రాధాన్యము, గోదాన మహిమను వర్ణించు పద్యము లీ కథ యందు కలవు.

# విక్రమార్కచరిత్ర

## కొండయ కవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 8442 | కాల్ నెం | : టి 8-210 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 38 |
| ప్రతి పరిమాణము | : 40.5×3 సెం మీ | పత్రపంక్తులు | : 6 |

**ప్రారంభము :**

శ్రీరంజితంబుగ చెప్పెద వినుము హరినిభుం డగు విక్రమార్క కథలు
సరవి ముప్పదిరెండు సాలభంజికలు వరుసతో చెలరేగి వలనొప్ప నపుడు
చెలగి భోజునకును చెప్పిన విధము చెలయ వెంకటనాథ విన్నవించెదను
లంకేశ వింశతి లాలిత బాహా కంకణ కేయూర కటకాదులకును
సకలవల మొసగు సరస రజితాద్రి నొకనాడు సుఖగోష్ఠి నుండి శంకరుడు
శరదిందు చంద్రికాసార మాధుర్య సరస సదా పూర సల్లాపములను
శ్రవణ సుఖంబుగా శైలనందనకు వివిధ కథావలి వినిపింపుచుండు
పరమేశు వీక్షించి పార్వతి బలికె.

* * *

అని గౌరి యమునగంగ హర్షించిరిపుడు విసుపింప దొణగె నాప్పతాంత మెల్ల
భూమండలమునకు భూషణం బగుచు శ్రీమహనీయమై చెలువందు పురము
రమణీయమగు నమరావతితోడ సమమన నలుకతో సరియన జాలు
సుజనస్తుత బహు సంపద లలర నుజ్జయని పురం బొక్కటి గలదు
ఆపురంబున విక్రమాదిత్య విభుడు శ్రీపెంపు మీరంగ జేయు రాజ్యంబు
ఆతనికి దేవేంద్రు దర్థితో నిచ్చె ప్రతిమల గద్దియ ప్రథతోడ నుండ.

ముగింపు :

.... .... .... .... లని నియమించిన లగ్నంబునందు
శుభ ముహూర్తమునను సుముఖుడై రాజు అభినవ దేవేంద్రుడన తేజరిల్లి.
.... .... .... ఘన ద్రవ్యంబునందు అవధారు యను వేత్రహస్తులతోడ
రత్నచామీ .... రమణీయ దండ నూత్నసిత .... .... ....
నగ్రభాగంబున నతిశయిల్లగను అగ్రగణ్యుండు భోజు డాగద్దె జేరి
.... .... .... .... .... ....
ఆర్జించి యాగద్దె అహరి పూజలను పేర్చిన ఘనతర ప్రేమతోడుతను
వారకాంతలు కవివరులు .... .... .... సామంత భూపతులా ....
ఘన .... .... .... .... చార జనితానురాగులై జయజయ పెట్టి
తనియ భూసురులకు దానంబు లిచ్చి తనకులదైవంబు ధ్యానంబుచేసి
.... .... .... .... .... దండమునబెట్టి భూరితేజమున
ఇది సప్తలాధిక హితకథారచన విదితావతాలిక వెలయ రెండవది
అనిపొర్య .... .... .... ఘనతర సంతోష కవితాస్యు డగుచు
అలమేలుమంగ ౼నాంబుజసీమ వెలుగొందు షట్పద విభవాభిరామ
ఖగకుల .... .... న నగరాజ సచ్చరిత్ర నవ్యచారిత్ర
దేవయపెద్దని ధీజనవర్యు బావంబులోపల బాయనివేల్పు
ఇదిచనమల్లిఖార్జునె .... సదమలచారిత్ర సత్కవిమిత్ర
చిట్టియ ప్రభుతిమ్మ శేఖరపుత్ర ఘట్టితపదపద్మకావ్యవైచిత్ర
జయకా.... ర్తితల్ప సద్గుణాకల్ప నయ .... మ కొండయనామధేయ
విరచితంబై మహావిభవ సౌభాగ్య కరమహోన్నతి కాది కారణంబైన
అనఘాత్ము డగు విక్రమార్కునికథలు ననువొప్పనిది ద్వితీయాశ్వాసమయ్యె.



**విశేషాంశములు :**

ఈ ప్రతి క్రిమిదష్టమై చాలవరకు శిథిలమైనది. భాషాదోషములు ఛందోదోషములు మెండు. లిపి స్పష్టము.

# విక్రమార్కచరిత్ర

ఆక్సేషన్ నెం : 3940 కాల్ నెం : టి 3-293

ప్రతి : కాగితము; అసమగ్రము. పుటలు : 59

ప్రతిపరిమాణము : 29.5 × 6.5 సెం.మీ. పుటపంక్తులు : 28

**ప్రారంభము :**

శ్రీసదాశివమూర్తి చిరకీర్తిబరగు వాసవమునివంద్య వనజభవ స్తుత్య
ఖత్తిసుపుత్రసతుని (?) కైలాసనిలయు కంధరహరుని (?) శైలేంద్ర సతిసుతు(?)
శ్రీగురువెన్నముఖు, శిఖిగమనజనకు .... .... ...
దర్వీకారాభరణు వరపతిసుజన (?) గీర్వాణవంద్యుని గిరిజసుత వంద్య
గంగాధరవరు నభావనదురుని (?) సంగీతలోలుని సకలలోకేశ

* * *

సంలితగంభీర సంతోషకారి అలివేణి పూబోణి అంచిత శ్రోణి
షుప్పదిద్దరు సతుల్ మ్రొగి దన్నుగొలువ అప్పుడు దాగొలువ అంబికాదేవి
ఆరామమున కేగి హరుషంబులోడ అతయంగ నారామ మది యెట్టి దనిన
సురగిరిచందముల్ చూతపోతములు .... .... .... ...

* * *

**ముగింపు :**

కరమర్థి భోజుండు గద్దె మీదెక్క బాగుగా కథలు ముప్పయిరెండిటి ....
ముదముతోబలికె నిరువైమూడో బొమ్మ మదినుబ్బభోజుండు మరియు గద్దెక్క
జనునంతటను ఖల్కె చక్కనిప్రతిమ విని విక్రమార్కుని విధము జెప్పెదను
విలసితముగ నంత విక్రమార్కుండు కలగంగ మర్నాడు గద్దెమీ దెక్క

ప్రేమ కలగన్నంత పెద్దలకు జెప్ప  యేమని కలగంటి యెరిగింపు మనిన
యెట్టిచిరముగంటి(?) యెలమితావె(?)  యట్టనివుష్పముల యలవిధ (?) ....
జగమెక్కి దక్షణ దిక్కున కెలమి  నరుగుచు నేను .... చెప్పెనపుడు(?)
నరయంగ పెద్దలు ఆడిన మాట :  దివిచారింపను (?).... గుదు దోషంబు (?)
వోరు .... యిది యుర్వీశ యనిన  వెలయంగ నపుడొక్క పద్మ........
కలవిరుతు నెలని కల యొకటి  అల..చు పెద్దలు అందరు....నాగ (?)

## విశేషాంశములు

ఈ గ్రంథకర్త నామవివరాదులు లభ్యముకాలేదు. గ్రంథాంతమును ఇందు లేదు.

ఈ ప్రతి చివరికాగితములోని అక్షరములు గోచర మగుట లేవు. ప్రతి యంచులు నలిగి కొన్ని యక్షరములు నశించినవి. ఇందలి లిపి స్పష్టముగా లేదు. ప్రతి విలేఖనమున చాల దోషములు కలవు.

# విక్రమార్కకథలు

| | | | | |
|---|---|---|---|---|
| అక్సెషన్ నెం. | : 616 | కాల్ నెం. | : | టి 3-65 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : | 23 |
| ప్రతిపరిమాణము | : 30×2.5 సెం.మీ. | పత్రపంక్తులు | : | 5 |

ప్రారంభము :

విక్రమార్కవిభుండు భేతాళుని కట్టితెచ్చె ననుచు చెప్ప వినుచునుండ నెట్టివిధమున గొనితెచ్చె నానతిమ్ము వల్లకినాథా.

సీ. విక్రమార్కుండు జగద్విఖ్యాత సత్కీర్తి  జగము బాలించెడు సమయమున
క్షాంతిశీలు డను న ....  నిత్యంబు  నొకపండునున్నపతి నుపద మియ్య
అంతలో నొక్కనా డమ్మని యిచ్చిన  ఫలము వానరుమీద ....  వేయ
నది మర్కటమువిప్ప నందులో నొకమణి  కనుపట్టుటయు ధరాకాంతు డాత్మ
నద్భుతంబది  ....  దెచ్చినవి జూడనట్ల  యైయున్న నతని కిట్టనియె నృపతి,
యేమి యర్థించి తెచ్చితి విట్టి మణులు  ....  యు నిట్లని చెప్పదొడంగె.

గీ. వచ్చు కృష్ణచతుర్దశీ వాసరమున నర్ధరాత్రింబు నాకడ కరుగుదెంచి
పితృ .... .... ధకుండవుగమ్ము భూజనవరేణ్య.

వ. అనుటయు వారాత్రి యతని కడకుంజని, యతని యనుమతిని, మౌనవ్రతస్థుండగు .... భేతాళ వనంబున కరిగి, నగ్నత్వంబున వటజటిలలో దగిలి తలక్రిందై వేలుచున్న భేతాళునిం బట్టి మూపున బెట్టు .... నప్పుడు.

* * * *

ముగింపు :

గీ॥ కొట్టుపాతించి తస్కరు గొరతవేయ వాడు దుఃఖించి నవ్వి జీవంబు విడువ
నంత నా ధీరవతియును నగ్ని చొరగ దగ్గరుటయును శివుడు ప్రత్యక్ష మయ్యె.

గీ॥ అతని ప్రాణము గృపజేసి హరుడు చనియె కొరతపైనుండి దుఃఖంబు గుడిచి పిదప
నవ్వనేటికి జెప్పుమా నరవరేణ్య.

వ. అనిన విక్రమార్కుం డిట్లనియె క్రీతి.

క॥ ధన మెంత తనకు నిచ్చిన వినదయ్యెను నృపతి తనకు విధి యని యేడ్చెన్
వనజాక్షి అగ్నిచొరగా జన జూచిన నవ్వె నిదియె చందంబనుచున్.

వ. ఎప్పటియట్ల తిరిగి పరచిన పట్టితెచ్చు నెడ బేతాళుం డిట్లనియె.

సీ॥ నేపాళదేశ మహీపతి యగు కీర్తి కేతుని సుత మదకీరవాణి
చంద్రికి నాగవసంతోత్సవంబున వనిత జూచెను ఘనస్వామి యనెడు
విప్రకుమారుండు వెలదియు నవ్విప్రు దగజూచె మోహ మిద్దరికి బొడమె
అంత నంతఃపురి కరుగ ఘనస్వామి చెరిమూల దెవు డను సిద్ధయోగి
యొక్క ఘుటికిచ్చి విప్రుని నువిదజేసి నృపతి ముందర యిది నాకు నిజతనూజ
తీర్థయాత్రకు చనుయేగుదెంచు .... .... ....

* * * *

విశేషాంశములు :

ఈ ప్రతియందు విక్రమార్కునికి భేతాళుడు చెప్పిన కథలు గలవు. ఈ ప్రతియందు గ్రంథనామముగాని, గ్రంథకర్త నామవివరాదులుగాని లేవు. కావున ఇదివిక్రమార్కుని

కథలు అనుపేరుతో వ్యవహరింపబడుచున్నది. ఇందు మొదటినుండి వరుసగ పదు నాలుగు కథలు గలవు.

ఈ ప్రతియందలి అక్షరములు స్పష్టముగ లేవు. పత్రములు నలుపు దిరుగుచున్నవి. కొన్ని అక్షరములు కనుపించనంత నలుపుదిరిగినవి. కొన్ని పత్రములు పార్శ్వమున స్వల్పముగా శిథిలమైనవి. ప్రతి విలేఖనమున చాలదోషము లున్నవి. గ్రంథాంతము యిందు లేదు.

# విజయవిలాసము

## చేమకూర వేంకటకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3967 | కాల్ నెం | : టి 3-257 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 34 |
| ప్రతి పరిమాణము | : 41×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 9 |

ప్రారంభము :

శా. శ్రీ లెల్లప్పు డొసంగు నీసకలధాత్రీచక్రమున్ బాహు పీ
ఠీలగ్నంబుగ జేయు దిగ్విజయ మీడీకొన్నచెందాన నే
వేళన్ సీతయు లక్ష్మణుండు దను సేవింపంగ విల్బూని చే
ల్వాలీలం దగు రామమూర్తి రఘునాథాధీశ్వరున్ బ్రోవుతన్.

ఉ. శ్రీకలకంఠకంఠియు ధరిత్రియు దక్షిణవామభాగముల్
గైకొని కొల్వ వారిగడకన్ గడకన్నులకాంతి దేల్చి దా
నాకమలాప్తతం గువలయాప్తత దెల్పెడు రంగభర్త లో
కైకవిభుత్వ మిచ్చు దన యచ్యుత శ్రీరఘునాథశౌరికిన్.

* * *

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన విజయ విలాసం బను మహా ప్రబంధంబునకు కథాక్రమం బెట్టిదనిన, నైమిశారణ్య మహర్షులకు రోమహర్షణి యిట్లని చెప్పందొడంగె.

శా॥ చంద్రప్రస్తర సౌధఖేలన పరశ్యామా కుచద్వంద్వ ని
స్తంద్ర ప్రత్యహలిప్త గంధకలనా సంతోషిత ద్యోధునీ
సాంద్రప్రస్ఫుట హాటకాంబురుహ చంచచ్చంచరీకోత్కరం
బింద్రప్రస్థపురంబు భాసిలు రమాహేలాకళావాసమై.

ఉ॥ ద్వారక ముద్దుచెల్లెలట దన్నగరీమణి సృష్టి యన్నిటం
దేరుగ డైనచో నిదియ నేర్పుల మేరని యెంచి చూడబో
ధారుణి విశ్వకర్మ గురి దానికి నెక్కుడ నీడులేని సిం
గారము గల్గుటందు వెనకన్ సృజియింపక యుండుడే సుమీ.

ముగింపు :

క. చెల్లెలికిని మరిదికి మే నల్లునకు ననర్ఘ మణిమయాభరణంబుల్
వల్లభయు దాను యదుకుల వల్లభు డపు డొసగె బంధువర్గము మెచ్చన్॥.

తే॥ కువలయనయనలు బెనుచు మక్కువలవలన పూట బెరిగెడి వా డొక్కపూట బెరిగి
మెల్లమెల్లన శైశవమెల్ల జార నందె యౌవన మా రాజనందనుండు.

సీ. మనుమార్గమున భూమి మనుమార్గమంతయు స్థిరమతి యగు యుధిష్ఠిరుడు దెలుప
బాటవ వద్వైరి పాటన క్రమ మెల్ల దరవర్జితుండు వృకోదరుడు దెలుప
రంగవత్తుంగ తురంగసమారోహ ముద్దండు డగు నకులుండు దెలుప
సురభి రక్షణకీర్తి సురభిలదిఙ్మండ లుం డగు తదనుజన్ముండు దెలుప

వివిధ కోదండపాండిత్య విలసనంబు దానె తెలుపంగ నేర్చెను తనయు డపుడు
సేవసేయంగ సంతత శ్రీవెలుంగ విజయు డలరారె శాశ్వత విజయు డగుచు॥.

* * *

గద్య :

ఇది సూర్యనారాయణ వరప్రసాదలబ్ధ ప్రసిద్ధ సారస్వత సుధాసారజనిత యశోలతాం కూర చేమకూర లక్ష్మణామాత్యతనయ, వినయధురీణ సకలకళాప్రవీ ణాచ్యుతేంద్ర రఘునాథ భూపాల దత్తహస్తముక్తాకటకవిరాజమాన వేంకట కవిరాజ ప్రణీతంబైన విజయవిలాసం బను మహాప్రబంధంబునందు సర్వంబును తృతీయాశ్వాసము సంపూర్ణము.

విశేషాంశములు

ప్రతివిలేఖనము : ప్రజోత్పత్తి నామ సంవత్సర ఆశ్వీజశుద్ధ ౧ భానువారం ప్రథమ యామం వరకు.

ప్రతి చక్కనిది. వ్రాత బాగుగాన్నది. గ్రంథశైథిల్య, గ్రంథపాత దోషములు లేవు. కావ్యము రఘునాథనాయకున కంకితము.

## విజయవిలాసము

### చేమకూర వేంకటకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3648 | కాల్ నెం | : టి 3-230 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 84 |
| ప్రతిపరిమాణము | : 42×3 సెం.మీ. | పత్రపంక్తులు | : 5 |

విశేషాంశములు :

ప్రతివిలేఖనము : జయ నామ సంవత్సర మార్గశిర శుద్ధ ౧౪ ఆదిత్యవారం సరికి దండెమరాజు వెంకటనరసన్నగారి ప్రతిని వున్నక్రమానను అమిరెపు అచ్చిరాజు కుమారుడు అప్పలరాజు ఖాసాకు వ్రాసెను.

ప్రతి అలతిగా క్రిమిదష్టమైనది. వ్రాత బాగుగానున్నది. అక్షరదోషము లధికము. అచ్చటచ్చట పద్యములలో కొన్ని పదములు లోపించినవి. బహుశః వ్రాయసకాని దోషమై యుండనోపును.

## విజయవిలాసము

### చేమకూర వేంకటకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3649 | కాల్ నెం | : టి 3-231 |
| ప్రతి | : తాళపత్రము ; సమగ్రము. | పత్రములు | : 59 |
| ప్రతి పరిమాణము | : 39.5×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 |

విశేషాంశములు :

ప్రతివిలేఖనము : హేవళంబి నామసంవత్సర కార్తీక బహుళ సప్తమీ ఆదివారంవరక్కు తెలిదేవర సుందరమ్మగారి ప్రతిచూసి ముండ్లపూడి వెంకయ్యగారు వ్రాసినప్రతి క్రమాన విజయవిలాసం మూడాశ్వాసములు.

ప్రతి యటనట క్రిమిదష్టమై యున్నది. గ్రంథ శైథిల్యము లేదు. వ్రాత చక్కనిది.

# విజయవిలాసము

## చేమకూర వేంకట కవి

| | | | | |
|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 719 | కాల్ నెం | : | టి 3-70 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : | 50 |
| ప్రతిపరిమాణము | : 40×4 సెం. మీ. | పత్రపంక్తులు | : | 8 |

విశేషాంశములు :

ఆద్యంతములు లేవు. ఆదియందు పీఠికాభాగము పూర్తిగా లోపించినది. అంత్యమందు సుమారు 12 పద్యములు లోపించియుండును. గ్రంథ మచ్చటచ్చట క్రిమిదష్టమైయున్నది. ఇందు 3 ఆశ్వాసములు గలవు. వ్రాత దోషములు కలవు.

# విజయవిలాసము

## చేమకూర వేంకట కవి

| | | | | |
|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5281 | కాల్ నెం | : | టి 3-94 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : | 65 |
| ప్రతిపరిమాణము | : 42×3 సెం. మీ. | పత్రపంక్తులు | : | 5 |

విశేషాంశములు :

ప్రతి యందు పత్రములన్నియు కలవు కాని కొన్ని పత్రములు పూర్వార్థము ఎడమవైపు మాత్రమే మిగిలి యుండి ఉత్తరార్థము కుడివైపు శిథిలమై యుండుటచే నీ

ప్రతిని యసమగ్ర ప్రతిగా నిర్ణయించడమైనది. గ్రంథము క్రిమిదష్టము. గ్రంథ శైథిల్యం. దోషములు కలవు. వ్రాయసకాని పేరు లేదు. వ్రాతస్పష్టత కొంచెము లోపించినది. వ్రాతిదోషములు, ఛందోదోషములు కలవు. అక్కడక్కడ కొన్ని పదములు లుప్తమై ఛందోదోషమునకు గురియైన పద్యములు కలవు. ప్రథమాశ్వాసాదిని గల పీఠికా భాగమిందు వ్రాయబడలేదు. కథా ప్రారంభము నుండియే ప్రతి గలదు.

# విజయవిలాసము

## చేమకూర వేంకట కవి

| | | | |
|---|---|---|---|
| అక్సేషన్ నెం | : 512 | కాల్ నెం | : టి 3–69 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము, | పత్రములు | : 45 |
| ప్రతిపరిమాణము | : 45.5×4 సెం.మీ | పత్రపంక్తులు | : 6 నుండి 7 |

**విశేషాంశములు :**

ప్రతివిలేఖనము : వర్తమాన వ్యవహారిక చాంద్రమాన పరీధావి నామ సంవత్సర చైత్రశుద్ధ ౨ ఇందువారం నాడు మల్లికార్జుననుమతితో రావులూల కొట్టరవు గండన్న కుమారుడు హితయ్యగారు వ్రాసుకున్నాడు.

కృతిపతి వంశవర్ణన, ప్రార్థనాది పద్యములు గలభాగమిందు లేదు. గ్రంథము బాగుగానున్నది. కాని వ్రాత బాగుగాలేదు.

# విజయవిలాసము

## చేమకూర వేంకట కవి

| | | | |
|---|---|---|---|
| అక్సేషన్ నెం | : 2800 | కాల్ నెం | : టి 3-188 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 59 |
| ప్రతిపరిమాణము | : 38×3 సెం. మీ. | పత్రపంక్తులు | : 4 నుండి 5 |

విశేషాంశములు :

ఈ ప్రతియందు మొదటి రెండు ఆశ్వాసములును, మూడవ ఆశ్వాసముయొక్క ప్రారంభమును కలవు. ప్రతి మిక్కిలి నలుపుదేరిగి కొన్నిపంక్తులు గ్రాహ్యము లగుట లేదు. పార్శ్వములందు శిథిలము అయినది. ఈ ప్రతియందు ప్రారంభము కథా ప్రారంభముతోనే యున్నది.

# విజయవిలాసము

## చేమకూర వేంకట కవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3452 | కాల్ నెం | : టి 3-211 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము. | పత్రములు | : 42 |
| ప్రతిపరిమాణము | : 53×4 సెం.మీ. | పత్ర పంక్తులు | : 7 |

విశేషాంశములు :

ప్రతి విలేఖనకాల మిందు లేదు. గ్రంథమునందలి ప్రతిపత్రము క్రిమదష్టమై యున్నది. గ్రంథశైథిల్యము, గ్రంథపాతము అధికము. గ్రంథాంతమునందలి పత్రములు మిక్కిలి శిథిలావస్థలోనున్నవి.

ఇందు 3 ఆశ్వాసములు గలవు.

# విజయరామచరిత్రము

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5588 | కాల్ నెం | : టి 3-22 |
| ప్రతి | : కాగితము ; అసమగ్రము. | పుటలు | : 78 |
| ప్రతిపరిమాణము | : 27×24.5 సెం.మీ. | పుట పంక్తులు | : 20 |

ప్రారంభము :

క॥ శ్రీరవికుల కలశాంబుధి తారాధిప నవకళింగ ధరణీప మహో
దారయశ పూస పాటీ నారాయణ గజపతీంద్ర నరపాలేంద్రా.

ఆకట్టింపుము రాజసింహము సముద్యద్ద్వార సిబ్రాజితా
నీకంబున్ బెగడొంద తద్బలము లెంతే మోదముం జెంద లో
కైకత్రాణ గరిష్ఠుడై బహునృపాలాగ్రేసరుల్ గొల్వగా
శ్రీకంజాక్షుని పద్మనాభు గనవచ్చెన్ పద్మనాభం బొగిన్॥

క॥ అల పద్మనాభమునకున్ జలమున వేంచేసె రాజచంద్రుడు శ్వేతా
స్యులు కొంత చింత సేయగ బలవద్వైరంబుకాని పనియని కదమన్॥

సీ॥ పరతెంచి పద్మనాభస్వామి మహనీయ చిరమైన రత్నమంటపము నందు
మణి సువర్ణాస్థాన మంటపాంతరమున మువ్వన్నె ముత్తియపుం జరీబు
యేదారు కెంజాయ పాదుషాషానుమో మాలు పర్షున దాపి సేంసీద
కమల కరాంతరోత్కవిభాసితమైన ఘొంపమ్మియన మసలంమనందు

తే. కొలువు గూర్చుండె రాజమండలము గొలువ మంత్రులు దివాను లధిక సామంత జనులు
కదిసి వినుతింప సమయముల్ బెదకుచుండ విజయ రామ మహారాజు వీరమౌళి॥

సీ. మన్నె భూపతులు భూమండలాఖండలా శరణాగతత్రాణ బిరుద యనుచు
కోరివచ్చిన జమిందారు లభీష్ట ని త్యబలసంప్రాప్తి దయాబ్ధియనుచు
రాజాధిరాజులు రాజ్యనిర్వాహక ప్రజ్ఞావిశారద ప్రభు యటంచు
సాహెబుల్ సూబాలు సకలకళింగ దే శపుపాదుషా కిరీటపతి యనుచు

తే. నభినుతించగ దివ్యసింహాసనమున నుదయగిరిమీద భాస్కరుడో యనంగ
నిండుకొలువుండె కన్నులపండుపుగను విజయరామావతార భూభుజలలామ.

ముగింపు :

మ॥ జనకప్రీతి ననేకదానములు రాజశ్రేష్ఠు డవ్వేళ స
జ్జనభూమీసురకోటి కిచ్చి రిపులన్ సాధింప నూహింపుచున్
దనరెన్ మేఘమువిచ్చు సూర్యు డన పుత్రప్రౌఢి శత్రుక్షయం
బని మున్పెద్దలు చెప్పు వాక్యములు సత్యం బెన్ని చూడన్ మహిన్॥

శా॥ శుద్ధస్నానముజేసి యా నృపతి తేజోమూర్తియై యుద్ధస
న్నద్ధుండై నిజవీర సైన్యముల దెందంబుల్ ముదం బొందగా
నౌద్ధత్యారిపరంపరాహరణ వాక్యప్రౌఢి పాటింపుచున్
వృద్ధామాత్యసమేతుడై కొలువు గావించెన్ మహోగ్రాకృతిన్.

వ॥ తదనంతర కథావృత్తాంతం బెట్టియ్యెనని యడిగిన సురేంద్రునకు దేవఋషిపుంగవుం డిట్లనియె.

మ. వరభూనాథ మృగావళీహరణ శుంభద్భీమ శార్దూల బం
ధురసుత్రానన కోటకానన మహాదోశ్శౌర్యదావాగ్ని కీ
లరమానాథ పదారవింద భజనాలాలిత్య సంశీల భా
స్కరవంశాబ్ధి నిశాన్నపాలక కళింగ శ్రీనృపాపాలకా॥

విశేషాంశములు :

ఈ ప్రతియందు ఒకేఆశ్వాసము గలదు. గ్రంథకర్త నామము కనబడ లేదు. ప్రతి అలతిగా శిథిలావస్థలో నున్నది. వ్రాతదోషములు కలవు. ఛందో దోషములు కూడ గలవు. వ్రాత స్పష్టత అంతగా లేదు.

# విజయాంకితచరిత్ర

## వేంకట కవి

ఆక్సెషన్ నెం : 2321 కాల్ నెం : టి 3-186

ప్రతి : తాళపత్రము; సమగ్రము; పత్రములు : 19

ప్రతి పరిమాణము : 44×3 సెం మీ పత్ర పంక్తులు : 5

ప్రారంభము :

శ్రీరఘురాముని చిత్తాన దలచి గౌరీశు ప్రణుతించి కమలజు నెంచి
గజముఖు గొనియాడి ఘనత మీరగను అజుని పట్టపురాణి యగు వాణి బొగడి
అంగజ గురుడగు యాలూరి కోన రంగని మదినిల్పి రమణి తోడుతను
యెన్నిక కెక్కిన పెన్న జూలూరి చెన్న గోపాలుని సన్నుతింపుచును
సతతంబు వ్రతనిష్ఠ సలుపుచున్నట్టి మతిమంతుడగు హనుమంతునిదలచి
శ్రీ వజ్రగిరి నారసింహుల నెపుడు భావంబు లోపల ప్రస్తుతింప్పచును
ఘను నన్ననార్యు నాచన సోమయాజి ననఘు ... మ్మ పోతనార్యుని దలచి

x x x x

కవులకు ప్రాణమిల్లి గరిమ రంజిల్ల   అవిరళంబుగ జేతు నది యెట్లులనిన
శ్రీరాజ యోగ ప్రసిద్ధ మానసుడు   ధైర్యవంతుడు హరి ధ్యానపరుండు

* * *

హరిభక్తి యుతుడు యనఘుడా శుకులు   సిరి వంతుడగు పరిక్షితిజనపాలు
గనుగొని పలికెను కమలాక్షు కథలు   విన విస్మయంబగు వినుము పృథ్వీశ.

x x x x

కురువిభుండగు పౌండ్ర కుండను రాజు   హరిని నిందింపుచు హరియు తాననచు
గ . . తోశంఖ చక్రము కౌస్తుభంబు   గరుడధ్వజంబును గద . . రిలుంబు
మొదలుగా హరిచిహ్నములు వేడ్కదాల్చి   ముదమొప్ప జనులచే మ్రొక్కులు గొనుచు
వాసికెక్కిన కీర్తివంతుడై పౌండ్ర   వాసుదేవుండన వార్త పెంపొంది
తెరగొప్ప పట్టపుదేవు లెనమండ్రు   నిరు దెసలందును హెచ్చి సేవింప
పదియారువేల గోప స్త్రీలతోడ   సుదతులు పెక్కండ్రు . . ల్వ
వసుదేవ నందను వైఖరి దనరి   వసు ధేశులను తన వశముగానేలి

0 0 0

ముగింపు :

ఒకశక్తి జనుదెంచి నూళ్లలో ప్రజల   కకవికలై పార గాల్చుచున్నది ....
యిట్టి యాపద నెందు వెరుగము దీని   మట్టుపెట్టి . . యను మము బ్రోవు కృష్ణ
అని పల్క యాదవు లందర జూచి   మనసులో దలపోసి మాధవుం డంత
వెరవకుమని వారి వెరపెల్ల మాన్పి   పరువిడి నాశక్తి నుగ్రముగను
సరగున తనచేతి చక్రంబువైప   మెరయుచు నదిజని మేదినివణక
చండ భయంకర శౌర్యంబు తోడ   మెండుగా దిశలెల్ల నిండ నార్చుచును
ధీరతతోడ కృత్రిమశక్తి బట్టి   దారుణి బడ గూల్చి త . . మించి
కాశీరాత్రినయుండు గరిమ నొనరించు   వాసికెక్కిన యజ్ఞవాటికి నరిగి

దుడుకున యాజులతో గూడ వాని వడిసి గుండంబు ఐడనూకి మరలి
పురుషోత్తముని పద . . ప్రణమిల్లి హరిగొల్చి భక్తిచె నలరు ...
.... యభిమన్యునందనుడు సీ వ్యాస తనయుని గొని మూడి తగ నెట్టులనియె
మునినాథ నాచిత్తమున గల్గినట్టి యనుమాన ........ ... యాజకులు
క్షితినాథ వినవయ్య ............... ........... విజయాంకిత చరిత్ర
మెలిమితో వినువారికెల్ల సంపదలు గలుగును, దోషముల్ దొలగి చెల్వొందు
శ్రీమంతుడగు పరిక్షితినాథు డంత ధీమంతుడౌ శుకుల్ దెల్పంగ సకల
పుణ్యపురాణము పొంకముగ వినుచు ధన్యుడై కడువేడ్క దనరారుచుండ
అనియిట్లు సకలలోకాధీశు పేర వనజ బాంధవ క్షీవంశవర్ధను పేర
వార్తకెక్కిన యట్టి వసుధ జూలూర కీర్తిగాంచిన చెన్న కేశవుల పేర
రామదాసుండ నలవిమించి భక్తి నేమంబు గల యాంజనేయుల పేర
వన్నె గాంచిన యట్టి వజ్రగిరి మీద వెన్నొందు శ్రీనారసింహుల పేర
చినరెడ్డిరంగని చినసుంక విభుని వినుతి గైకొని కీర్తి వెలయంగ మదిని
ప్రముదితాత్ముండగుచు భాగ్యంబు లొసగు రమణయాలూరి కోనరంగని పేర
ధారుణిలో ........ దనరు నశ్వర్థ నారాయణుని పేర నళినాక్షుపేర
ఘనపెదముల్కి వెంకటకవి వరుం . . .... పొందగా భక్తిప్రేమ రచించె
వరకౌలకును నెల్ల .... .... ధరణిలో నాచంద్ర తారకము గాను

**విశేషాంశములు :**

ఈ కావ్యమును కవి చిన సుంకవిభుని కోరికపై రచించి యశ్వర్థనారాయణునికి అంకితము గావించెను. భాగవతము నందలి హరి విజయములే ఇందలి వస్తువు. ఇది ద్విపద కావ్యము.

ప్రతి మిక్కిలి క్రిమిదష్టమై శిథిలమై యున్నది. కొన్ని పాదములు గ్రాహ్యము లగుటలేదు. కొన్ని పత్రములు తునకలై కూడ నున్నవి. లిపి స్పష్టము. అక్షర దోషములు కలవు.

# విజ్ఞాన ప్రదీపిక

## చెన్న వీరయ కవి

| ఆక్సేషన్ నెం | : 513 | కాల్ నెం | : టి 3-23 |
|---|---|---|---|
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 35 |
| ప్రతిపరిమాణము | : 37×3 సెం. మీ. | పత్రపంక్తులు | : 6 నుండి 8 |

ప్రారంభము :

శ్రీ కృష్ణునకున్ బహువిధ లోకస్తుత్యునకును లోకేశునకున్
గాకోదర వరశాయికి నాకౌక ప్రమదకరణ నైపుణ్యునకున్.

అనేక దండ నమస్కారంబులు గావించి నా యొనర్పం బూనిన యోగ కావ్యంబునకు నామ నిర్ణయం బెట్టిదనిన.

పదునెనిమిది విద్యలలో సదమలమగు సారమెల్ల జర్చించి మదిం
బదిలముగ నెరిగి చెప్పగ నది విజ్ఞాన ప్రదీపికన నుతి కెక్కెన్.

ఇట్లు విజ్ఞాన ప్రదీపిక యను యోగ కావ్యంబు సకల జన సమ్మతంబును సకల శాస్త్ర సమ్మతంబును, సకల మత సమ్మతంబును నై వుండు గావున నందు ప్రారంభం బెట్టి దనిన.

చదివితి మంచు కొందరు ప్రసంగవశంబున కించిదార్థముల్
మదిదలపోసి తన్నియమ మార్గమునందు పరిభ్రమించుచు
న్మదమున సంచరించు జనముల్ గననేర్తురె యాత్మయోగ సం
పదల దనర్చు శాశ్వత శుభప్రదమైన విముక్తి మార్గముల్.

దానములం దపంబులను ధర్మవిశేషత బుణ్యతీర్థ సం
స్నానములం జరించుటలు జన్మవిముక్తముగాగ నేర్చునే
మానిత రాజయోగ నిజమార్గ రసంబున బొంది నిర్మల
జ్ఞానపయోధి వీచికల సంగతిగానని జీవకోటికిన్.

మ. సుగుణత్వంబున తత్ప్రభేద నియతిన్ సొంపొందగాలేక నీ
సగుణంబందున నిర్గుణంబని కడున్ సందేహముం బొందుచు
న్నిగమార్థ ప్రతిపాదకత్వములచే నిత్యంబు వాదింతు రీ
జగతిం గొందరు తాము నేమనుచు షట్చాస్త్రాధికారంబులన్.

వ. ఇట్లు శబ్దార్థంబుల వెంట శాస్త్రవాదంబులు సేయు వారలకు నాత్మజ్ఞానంబు గల్గు తెరంగు దుర్లభంబు గావున సంశయ పరిచ్ఛేదంబుగాదు మరియు బుణ్యవశంబున బుణ్యాత్ములగు వారలకు నాత్మజ్ఞానంబుగల్గు తెరం గెరింగించెన నది యెట్టిదనిన.

ముగింపు :

వ. ఇట్లు నిత్య సాత్త్విక గుణసమేతులైన మహాత్ములకు నిర్యోగక్షేమంబు గలుగు నది యెట్లనిన.

సీ. కర్మేంద్రియంబుల కర్మంబు దగ జేసి బ్రహ్మార్పణం బని పలికి పలికి
బుద్ధియంబుల భోగించినవి యెల్ల యీశ్వరార్పణముగా నెరిగి నెరిగి
సంకల్పవశమున చర్చచేసిన వెల్ల దైవతార్పితముగ తలచి తలచి
స్వప్నాద్యవస్థల సంచరించిన వెల్ల నాత్మార్పితంబుగ నలరి యలరి

ఆ.వె మనసున దలచకను మాటల నుడువక నింద్రియంబులకును నియ్యకొనక
ప్రాప్త వశము నందు బరతెంచు నర్థంబు ననుభవించు వార లాత్మవిదులు.

వ. యదృచ్ఛా లాభంబునం బ్రవర్తించుట నిర్యోగక్షేమం బనం బరగు. ఇట్టి నిర్యోగ క్షేమంబునం బ్రవర్తించిన వారలకు నాత్మజ్ఞానంబు గలుగు నది యెట్లనిన.

సీ. చిద్రూపమైనట్టి జీవాత్మ యందును పరమాత్మ భావంబు పరగ దలచి
ప్రకృతి సాంగత్యంబు పరిహరింపగ నేర్చి పురుషుని సర్వ సంపూర్తి నెరిగి
దేహేంద్రియాదుల తీవ్ర వేగంబున బొరయక చిత్తంబు పొంత జనక
కర్మద్వయంబు కర్తవ్యమొందక సుకృత దుష్కృతముల జుట్టి పడక

తే.గీ నాత్మ భావంబుచే నాత్మననువు పరచి తత్త్వమస్యాది వాక్యాది తలపు జేసి
సోహ మన నేర్పు గలిగిన సుమతులకును పరమ సుజ్ఞాన విభవింబు
పరిణమించు.

వ. ఇట్టి యాత్మ జ్ఞానం బగు నిస్త్రైగుణ్య మార్గంబున బ్రవర్తించు వారలు కృతార్థు
లగుదురు. గావున

మ. బలభద్రానుజ భక్తపాలన కళా పారీణ గోవర్ధనా
చలరాట్ఛత్ర మదోగ్ర కంసహర రాజన్నీల రత్నప్రభో
జ్వల గోపీ సుమనో మనోరథ పికవ్రాతోద్య.... దాదామ ని
త్య లసత్ప్రాభవ ద్వారకానగర పుల్లాంభోరుహా దిందిరా.

క. చైద్యనృప శిరచ్ఛేదన యాద్యంతర పాత నిర్మలాత్మక సాంబా
ప్రద్యుమ్న .... .... మ దా ద్యామలయాచలేంద్ర మన్మథ జనకా

ఉత్సాహ

వేణునాద కేళిలోల, వేదవినుత, పూతనా ప్రాణఘాతుకా, పయోజపత్ర నేత్ర నిత్యక
ల్యాణగుణసమేత దివ్యలక్షణాంగ గరుడకం ఖాణ....కుమార గంధనాగ పాలనా.

గద్య :

ఇది శ్రీ మదన గోపాల చరణ కమల ధ్యానానంద పవిత్ర కౌశిక గోత్ర గోపయా
మాత్యపుత్ర సుజన విధేయ చన్న పీరయ నామధేయ ప్రణీతం బైన విజ్ఞాన ప్రదీపిక
యను యోగకావ్యంబు నందు సర్వంబును చతుర్థాశ్వాసము.

విశేషాంశములు :

ఈ యోగ కావ్యము పదునెనిది విద్యలలోని సారసంగ్రహమగుటచే దీనికి విజ్ఞాన ప్రదీపిక
యను పేరిడినట్లు కవి కావ్యాదిని పేర్కొనెను. ఆశ్వాసాంత గద్యయందు మాత్రమే
కవిపేరు కొద్ది వివరములు లభించుచున్నవి. దైవప్రార్థనానంతరము గ్రంథారంభమున
నామౌచిత్యము తెలుపబడినది. ఇది నాలుగాశ్వాసముల గ్రంథము.

ఈ ప్రతి అంచులు నలుపువిరిగి పైన, క్రింద నున్న పంక్తులు స్పష్టముగ కన్పించుట
లేదు. ప్రతి కొద్దిగా శిథిలమైనను బాగున్నది.

# విజ్ఞాన ప్రదీపిక

## చెన్న వీరయ

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5676 | కాల్ నెం | : టి 3-77 |
| ప్రతి | : తాళపత్రము, సమగ్రము. | పత్రములు | : 32 |
| ప్రతి పరిమాణము | : 44×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 |

**విశేషాంశములు :**

ఈ ప్రతి స్వల్పముగ క్రిమి దష్టమైనది. కొన్ని పత్రములు నలుపు దిరిగినవి. అందుచే లిపి స్పష్టమైనను సరిగా కన్పించుట లేదు. మొత్తము మీద ప్రతి బాగున్నది. ప్రతి విలేఖనమున కొన్ని చ్యుతములు, దోషములు గలవు. ఈ ప్రతి ఈశ్వరనామ సంవత్సర భాద్రపద శుద్ధ దశమి నాటికి సీతారాముని ప్రతి ననుసరించి గోపరాజు పెదవేంకటాద్రిచే వ్రాయబడినది.

# విజ్ఞాన ప్రదీపిక

## చెన్న వీరయ

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5349 | కాల్ నెం | : టి 3-78 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 34 |
| ప్రతి పరిమాణము | : 45.5×4 సెం.మీ | పత్రపంక్తులు | : 6 |

**విశేషాంశములు :**

ప్రతి మిక్కిలి క్రిమి దష్టము. గ్రంథము శిథిలావస్థలో నున్నది. వ్రాత చక్కనిది. వ్రాత దోషములు, ఛందో దోషములు కలవు. ఇందు నాలుగాశ్వాసములు గలవు. వ్రాయసకాని పేరు, వ్రాయబడిన సంవత్సరము మొదలగు వివరములు లేవు. గ్రంథాదిని గ్రంథకర్తృక విషయములు సూచించు అవతారికా భాగము లేదు.

# విజ్ఞానేశ్వరీయము

## మూలఘటిక కేతన

| ఆక్సెషన్ నెం | : 5352 | కాల్ నెం | : టి 3-106 |
|---|---|---|---|
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 18 |
| ప్రతి పరిమాణము | : 45×3 సెం.మీ. | పత్రపంక్తులు | : 8 |

ప్రారంభము :

శ్రీవాణీ గిరిజేశ దంతిముఖ రాజీవాప్తులం గొల్చి వా
గ్దేవిం జిత్తములోన నిల్పుకొని భక్తిన్ .... గీర్తించి నా
నా విద్వత్సభలన్ మదిం దలచి నూత్నప్రౌఢి వాక్యక్రియా
ప్రావీణ్యంబున నుల్లసిల్ల కవులం బ్రార్థించి ధన్యుండనై.

క. వివిధ కలా నిపుణుడ నభి నవదండి యనంగ బుధ జనంబులు మెచ్చన్
భువి బేరు గన్న వాడను కవిజన మిత్రుడను మూలఘటికాన్వయుడన్.

0 0 0

క. ఆచార పరుడె యుత్తము డాచారము లేనివాడె యధముండని పూ
ర్వాచారు లానతిచ్చి కు లాచార క్రమము దెలిపి రది యెట్లనినన్.

0 0 0

వనముకొరకు శూద్రుడు దా విప్రుడ నను .... ....
జీవించునేని వానిం గావలమున గం .... యపుడు ఖండింపదగున్.

అంగడి నర్థించునట్ల యభ్యాగతు విదలించ కొకజాడ ప్రీతి దనిపి
యిరుగురులకు నెట్లయిష్టంబు బలుకుచు బంధువర్గంబుల బరగ ద్రోచి
వీరు వారన కెల్లవారిని దన వారి గా .... .... ....
బ్రాహ్మణభక్తులై పరహితార్థము జేసి శుభగుణంబులయందు ప్రభుతగల్గి
సత్యమును శౌచమును దాన సంగ్రహమును మహిమ జెలగు గృహస్థ ధర్మంబు గలిగి
యున్న పురుషు లుత్తమగతి నొందువార ల .... ....

క. తజ్ఞులకు తెలియునట్లుగ ప్రాజ్ఞులు మరి మెచ్చ తెనుగు భవ్యముగను త
త్వజ్ఞుడు మానయ కేతన విజ్ఞానేశ్వరము జగతి వెలయగ జెప్పెన్.

0 0 0

విశేషాంశములు :

ఈ ప్రతి పూర్తిగానున్నను చాలవరకు క్రిమిదష్టమై శిథిలావస్థలో నున్నది. ఇందు సత్యము, శౌచము, గృహస్థ ధర్మాదులగు కులాచార ధర్మములు చెప్పబడెను. లేఖన దోషము లున్నవి.

# విధికాండ

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 5537 | కాల్ నెం | : టి 3-218 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 14 |
| ప్రతి పరిమాణము | : 30×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : |

ప్రారంభము :

శ్రీకాశీపురధాము నవ్యయుని యక్షేశాత్ము వైశ్వానరో
రాకాకంజ (?) హరాంబు జాతహిత నేత్రానంద సందోహ భ
వ్యాకారాంచిత భక్తవత్సలుని దేవాద్యనుసంరక్షితున్ (?)
శ్రీకంఠున్ పురసూదనున్ నభవునిన్ సేవింతు నెల్లప్పుడున్.

* * *

వ. అని శ్రద్ధానిబద్ధ పూర్వకంబుగా యభ్యుదయ పరంపరాభి వృద్ధిగా నా యొనర్పం బూనిన ప్రబంధ ప్రారంభం బెట్టి దనిన.

క. సురముని నరసేవితమై హరిహర మూర్తులకు సంత తానందంబై
సరసీరుహ భవనుతమై పురహూతను వాంఛిత త్తపోవన భూమిన్.

వ. మహిత మాతులుంగ మందార చందన సాల పనస పాటల క్రము క్ర కందరాళ కదలి ఖర్జూర నింబ పిప్పలి పున్నాగ జంబు జంబీర వట తిలక తింత్రిక దాడింబ నారికేళ

హింతాల తాల తామాల కేతకి లవంగ లుంగ లోచన అర్జున భల్లాతకీ ప్రముఖ రాజిత కుంభిణీ విరాజితంబును కురువింద మధూక శతపత్ర కమల కల్హార కరవీర మల్లికాది వల్లి సంఫుల్ల పుష్ప సల్లలిత పరిమళ సుగంధవాహో బంధురంబును నందు సంచరించు చంచరిక శారికా కీర చక్రవాక నీలకంఠ కళింగ క్రౌంచ కారండ కపోత పారావత భరద్వాజ చకోర లావుక ద్విహంగ సారంగ ప్రమోదితంబును మండిత గండభేరుండ వేదండ కంఠీరవ శరభ శార్దూల శంబీర వరాహ ప్లవంగ శల్య సారంగ చమరి గోకర్ణాది మహో మృగ మందిరంబును మార్జాల మూషక వాసంబును సకల పుణ్య తరంగిణీ మంగళ సముదయంబును నిర్మల సరోవర విలసితంబును నమిత తాపసాత్త మయూధ నిరంతరంబును బహుళ పాఠక నిరంతర నిగమ కోలాహల కలకలారావ విజృంభితంబును సకల మునిజనస్తుత్య పాత్రంబునైన నైమిశారణ్య గణ్య పుణ్య క్షేత్రంబు నందు.

ముగింపు :

సీ. మిడిపండ్లు కోరలు మిట్ట ఫాలంబు బె న్నిశలైనబాహులున్ నిడుద మెడయు
జిగురు నేత్రంబు లెన్నగ దొప్ప కర్ణముల్ గొప్ప బల్బు దరంబు కుప్పతలయు
భీకర తెరనోరు మోకాల బెనుజల్లి వూచాడు చన్నులు విచ్చుకాళ్లు
.... .... .... ....
సామిడికాళ్ల .... సొరగు మ .... ముల్ గట్టిపయ్యద మ .... మోశటి
మెడకు సూత్రంబుగా .... .... .... ....

విశేషాంశములు :

ప్రథమాశ్వాసము కూడ పూర్తిగాలేదు. వ్రాత దోషము లెక్కువగా గలవు. ఛందో దోషములు కలవు. వ్రాత స్పష్టత లేదు. గ్రంథాది యందు గ్రంథ కర్తనామము పేర్కొనబడలేదు. గ్రంథప్రస్తావన యందు కూడ పేర్కొనబడలేదు. ఆశ్వాసాంత గద్యగల పత్రము లేకపోవుటచే గ్రంథకర్త నామము తెలియుట లేదు. కేవలము 14 పత్రములు మాత్రమే గలవు. ఇందు విధి మాహాత్మ్యము వర్ణింపబడినది.

# విభీషణుబుద్ధి

## గోన బుద్ధారెడ్డి

| ఆక్సెషన్ నెం | : 5609 | కాల్ నెం | : టి 3-178 |
|---|---|---|---|
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 20 |
| ప్రతి పరిమాణము | : 43×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 |

**ప్రారంభము :**

అక్కడ రావణుం డఖిల మంత్రులను తక్కక రావించి తగవారి కనియె
మంత్రికోవిదులారా మర్కటుం డొకడు జంత్రతంబు చూపిన చందాన వచ్చి
లంకిణి జంపి యీలంక శోధించి పంకజానన సీత పరికించి కాంచి
నావనంబునుం బెరికి నాసుతుం జంపి నా విక్రమము మీరి ఖనాపురిం గాల్చి
పెక్కువనసురుల పెక్కంద్ర జంపి చిక్కయు మనచేత జెచ్చెరం బోయె

ముగింపు:—

....రుం.... ....విష్ణుం డలిగె నోరాము దురువటి ....వచ్చెనో సంశమించి
....డియేమి నామక యింతశోభింప యవి యేమి ....రం...నా....యుం ....
....టి....దయ....విన్న యత్తకు నాకు వొడలిలో .... .... ....య్యెడిని
అనిపల్కు....విభీషణుండు మునుకొని మోవిచ్చి యిట్లనియె.
అవధారు దేవిని యగనందనుండు రవికులా .... .... .... ....
మంత్రులుం .... .... కూటమున మంత్ర మిట్టిది యని ....మది సేయ
.... .... .... .... .... ....

**విశేషాంశములు :**

ఈ కథాభాగము రంగనాథ రామాయణములోని యుద్ధకాండలోనివి.

ఈ ప్రతి చాలావరకు క్రిమిదష్టమై శిథిలావస్థలో నున్నది. లిపి స్పష్టముగా లేదు. లేఖన దోషములు కలవు.

# విష్వక్సేన ప్రభాకరము

## మరింగంటి వేంకట నరసింహాచార్యులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 6115 | కాల్ నెం | : టి 3-613 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 59 |
| ప్రతి పరిమాణము | : 42.5×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 |

**ప్రారంభము :**

శా. శ్రీమత్కంధి భవాంగనామణి యెదం సింగారముల్లుల్కగా
ప్రేమల్ మీరగ వేంకటాచలపతై ప్రీతిం విజృంభించు యా
స్వామే శిర్సనగండ్లదాము డయి సుస్వాంతంబు రంజిల్లగా
ఆమోదంబున బ్రోచు గావు తెపుడు న్నత్యంత పేర్మి న్నమున్.

కమలదళాక్షు వక్షమున గ్రాలెడు కౌస్తుభ రత్నడోలి కం
దముగని మోదతన్ నిలచి యబ్జభవాండజ చేతనావలిం
మమతచే నేలు నిందిరయు మా గృహ మందుల నిల్చి నిచ్చలుం
విమలతగాగ సౌఖ్యముల వేమరు మమ్ముల బ్రోచు గావుతన్.

అని మదీయకృత కృతికన్యకా మనోహరుండగు శ్రీమద్వేంకట లక్ష్మీనృసింహుల కనవరత కల్యాణ పంపరాభివృద్ధి యగు నట్లుగా రచించి సమర్పింపంబూనిన విష్వక్సేన ప్రభాకరం బను మహాప్రబంధ ముక్తాహారంబున కాధారకం బగు కథాసూత్ర ప్రారంభం బెట్టిదంటేని -

శ్రీరమణీ మనోహరము శిష్టజనౌఘ జయాశ్రమంబునున్
ధారుణి కన్యకావదన దర్పణరాజము నిర్జరౌఘ సం
చారము దివ్యభూమిరుహ సౌరభజాలమునై వెలంగెడున్
శారద వాహినీ తటిని చక్కగ భాసిలు నైమిశాటవిన్.

ఉ. ఆ మహనీయ యాశ్రమము నందుల శౌనకుడాది సన్మునుల్
తామరసాక్షు నాజ్ఞను విధాతను గూర్చెటి సత్రయాగమున్
వారక సేయు నత్తరిని వారిజగర్భు నియామకంబునన్
ఆముఖవైభవం బరయ హర్షత సూతుడు చేరరా గనెన్.

*　　*　　*　　*

చ. తొలియుగ మాదిపాదమున తోయరుహాక్షుడు ముజ్జగాద్యులున్
అలర పయోధి కిల్లిటపు టల్లుడుయై తెలిదీవె రచ్చనున్
చిలువలరేని భోగమృదు సీమను నిందిర సంయుతంబుగా
నిలిచి సమస్తలోకములు నేర్పున బ్రోచుచు నుండు నత్తరిన్.

క. భూసురవంశజు డగు దూ ర్వాసు డనే మునివరుండు వారని నిష్ఠన్
వాసుకి భూషణు గూర్చెటి భాసురముగ తప మొనర్చె బహురౌద్రతగాన్.

*　　*　　*

ముగింపు :

ఉ. పైనములయ్యె యింతులతో భాసురదివ్యవిమానరూఢులై
భూనభ మెల్ల భోరుకొన పొల్పగుభేరులు మ్రోయ తూర్ణతన్
భానుశశాంకు లిర్వురును పాల్పడి బాటలు చూపగాను స్వ
స్థానములందు జేరి రతిసౌఖ్యత గహ్వరి దంతరాధ్యులున్.

వ. ఇట్లు బ్రహ్మరుద్రేంద్రమరాది దిక్పాలకానిచయంబులును సకలసంయమీనికరంబులును తమతమ సన్నివేశ ఆశ్రమంబులుం ప్రవేశించి యిష్టసౌఖ్యాతిశయంబులంనుండి రంత నిక్కడ -

చ. హరిసిరి కంధిరాట్పుత్రియు నావిగ సర్వసుహృజ్జనావళుల్
హరిహయపుత్రి కందులను ఆర్తత సంధిల బ్రోదిచేయగన్
వరవధు లైక్యభావమున వల్పులరేని విలాసలీలలన్
అరమరలేక సౌఖ్యత అహర్నిశి యందుల మెల్గుచుండినన్.

*　　*　　*

విషభవ అంబక విషచరరూపా విషధర బాణా విషభుక్పూరా
విషధర తల్పక విషశిరనటతా విషభవ మందిర విమల సువేషా.

* * *

గద్య :-

ఇది శ్రీమద్వేంకటలక్ష్మీనృసింహ వరప్రసాదలబ్ధ గీర్వాణాంధ్రోభయభాషాకవితా విచిత్ర విదేహ రాజకన్యకాభ్యుదయాది షోడశ మహాగ్రంథబంధురాలంకార నిర్మాణ పారీణ ఘనయశోబంధుర మౌద్గల్యమహాఋషిగోత్రపవిత్ర వేంకటదేశికపౌత్ర తక్కుమార వేంకటాచార్యపుత్ర మరింగటి వేంకట నరసింహాచార్య విరచితంబైన విష్వక్సేన ప్రభాకరం బను మహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము భాసిల్లును.

0 0 0

క॥ ధర దుందుభివత్సరమున కరమగు పౌష్యాంతపక్షభరకరసుతు వా
సరమున సువర్చలాత్మజు వరకథ వ్రాసితిని శ్రీనివాసుని దయచే
సిరిగల మౌద్గలాన్వయ వర అర్పంవేంకటాఖ్యవనరినవాడన్
ధర విష్వక్సేన ప్రభా కరమును వ్రాసితిని యార్యగణము నుతింపన్.

0 0 0

విశేషాంశములు :-

ప్రతి బాగున్నది. లిపి కొంత కష్టసాధ్యము. లేఖనదోషములు గలవు.

# విశ్వామిత్రోపాఖ్యానము

## సోమనాథ కవి

| | | | |
|---|---|---|---|
| అక్సేషన్ నెం | : 8783 | కాల్ నెం | : టి 3-63 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 28 |
| ప్రతి పరిమాణము | : 43×4 సెం.మీ | పత్రపంక్తులు | : 7 నుండి 8 |

ప్రారంభము :

ఉ॥ శ్రీలలితాంగి నంకతలసీమ ధరించి దరస్మితప్ర భా
క్షాళిత తత్కపోలఫలక ప్రతిబింబింత కుండలాంశురిం
ఛోళి దళన్ముఖచ్ఛలిత శోభిలుచున్న మురారి సత్కీర్తి
న్దేలుచుగాక కాటెపలి తిప్పమహాసచివాగ్ర గణ్యునిన్

శా॥ శ్రీకల్యాణసమేతు జేయుత నుమాసీమంతినీకుంభికుం
భౌకార స్తన శాతకుంభపరిరంభామోదపూర్ణామృతా
సేకం బొప్ప శివుండు శేషమణిమంజీరుండు మృత్యుంజయుం
డాకల్పోర్జితకీర్తి కాటెపలి సర్వామాత్యు దిప్పాధిపున్.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన విష్ణుమిత్రోపాఖ్యానం బను మహాప్రబంధంబునకు కథాప్రారంభం బెట్టిదనిన.

తే.గీ. నీలకంఠ సరస్వతీ నీలకంఠు .... .... ....
... త్రంబు విస్తరించి చెప్ప శక్యంబుగా దేమి చెప్ప నిపుడు.

క. ఏ నెరిగినట్లు జెప్పెద మౌనీశ్వరులార దురితమర్దనులారా
మానసములు శ్రోత్రపుటా ధీనములుగ జేసి విను డతిస్థిరబుద్ధిన్.

సీ॥ వప్రాళ్క గర్భ .... .... .... .... ....
.... ద్రళాలా కులాంచల చంద్రమణ్మిలా చంద్రికా క్షాళితా శాతటంబు
శ్రీకరప్రాసాద శిఖర లక్ష్యాతీత సకల నక్షత్ర కక్ష్యాపథంబు
గోపురాగ్రాశేంద్ర కురునిందబృంది మాం గారకీకృత నభస్తారకంబు
తే.గీ. గంధదంతావళ వ్యూహ .... .... .... ....
... ద్వీపమాన సప్త సాగరాడంబరము శ్రీప్రయాగపురము.

ముగింపు :

ఉ. .... .... సదృశుం డగు నబ్బలదానవుం డవ
ష్టంభ విజృంభితుం డగుచు సన్నిధినున్న సభానికేతన
స్తంభ ముదాత్తరోషణమున సన్మణికంకణ శబ్దగుంభసం
రంభ .... .... .... .... కృతిన్.

చ. అనిమిషవైరి దుష్ట దశనాంకుర దష్ట వినిష్ట రోషుడై
కనుగవ ... కణికాలహరు ల్దొరుగంగ వజ్రదం
ష్ట్రుని ముఖ .... .... .... శా
శనిపతనోద్యమానసర చండ తరాంబు ధరారవార్బటిన్.

**గద్య :**

ఇది శ్రీమదుభయకుల పవిత్రాత్రేయ సగోత్ర ఆపస్తంభ సూత్ర సోమయామాత్య పౌత్ర కోటీ .... నిరాతంక నిష్కళంక శారదాభరణాంక సకలవిద్వజ్జన విధేయ సోమ నాథ నామధేయ ప్రణీతంబైన విష్ణు మిత్రోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము :

**విశేషాంశములు :**

ప్రతి అసమగ్రమము. రెండవ ఆశ్వాసములో మొదటి రెండుపత్రములు మాత్రమే గలవు. ప్రథమాశ్వాసము సంపూర్ణముగా గలదు. ప్రతియందు కొన్ని పత్రములు శిథిలములై క్రిమిదష్టములై యున్నవి. పత్రములన్నియు మిక్కిలి పురాతనముగా నున్నవి. పత్రములకు సంఖ్యాసూచిత్వము లేదు.

ఈ గ్రంథము కాటెపల్లి తిప్పమహాసచివాగ్రణి కంకితము.

కవి ఆత్రేయసగోత్రుడు. ఆపస్తంభ సూత్రుడు. ఇతని తండ్రి కోటీశ్వర భట్టారకుడు.

# వీరభద్ర విజయము

## బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 2796 | కాల్ నెం | : టి 3-41 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 188 |
| ప్రతి పరిమాణము | : 43.5×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 5 |

ప్రారంభము :

శ్రీలలితంపుభూతియును శేషవిభూషణముల్ శిరంబుపై
వేలుపుటేరు జాబిటను వెన్నెలపువ్వును మేన కొండరా
చూలియు కేల ముమ్మొనల శూలము నీలగళంబు గల్గు నా
వేలుపు శ్రీమహానగమువేలుపు మాకు ప్రసన్న మయ్యెడున్.

చ। సిరియును వాణి గౌరియును జెన్నుగు కన్యను మేనువాక్కు జె
న్నురమును నుంకువిచ్చి ముద మొప్ప వరించి జగంబులన్నియున్
దిరములు సేయ జాయతుడదీర్ప ద్రయష్ట యుగేశఖుండు నే
హరి విధి శంభుమూర్తి యగు నాథ్యులు మాకు ప్రసన్నమయ్యెడిన్.

వ। అని నిఖిలప్రధానదేవతా ప్రార్థనంబు చేసి.

వ. ఇట్లు మదర్పితం బగు విస్ఫురిత వీరభద్ర విజయాంచిత కథాప్రారంభంబు యెట్టిదనిన-మహిత మాతులుంగ మందార చందన సాల సహకార అష్టవర్ణ పనస పాటల క్రముక చందనాళ కదళీ ఖర్జూర నింబ పిప్పల పున్నాగ వుదుంబర జంబూ జంబీర .... తింత్రిణీక దాడింబ నారికేళ హింతాల కేతకీ తమాల తాల లవంగలుంగ నర్జున భల్లాతకీత ప్రముఖరాజితకుంబవిరాజితంబును కుంద కురవింద మహిమారాత, మధురశత పత్ర కమల కమల కలహార కరవీర మల్లికాదివల్లి సంపుల్ల పుష్ప సల్లలితపరిమళ సుగంధవహ బంధుర దిగదిగంతరాళంబును.

ముగింపు :

మాలిని :

అఖిలభువనపాలా హస్తశాలిత్రిశూలా
శిఖినయనలలాటా శీతధామాంశుజూటా
నిఖిలనిగమసంగా నిర్వికారాంతరంగా
మఖసమయవిజృంభా మంగళస్ఫూర్తిధామా ।

గద్య :

ఇది శ్రీమన్మహామహేశ్వర యివ్వటూరి సోమనారాధ్యదేవ దివ్యశ్రీపాదపద్మారాధక కేసనామాత్యపుత్ర పోతననామధేయ ప్రణీతంబైన వీరభద్రవిజయం బను పురాణకథ యందు దక్షయాగంబును, దధీచిసంవాదంబును, దేవతలపరాజితంబును, వనజనయన,

వనజసంభవ ప్రముఖులై సురల పరమేశ్వరుండు గరుణించుటయు నన్నది చతుర్థా శ్వాసము.

**విశేషాంశములు :**

ప్రతి విలేఖనము :

ఖర నామ సంవత్సర ఆశ్వీయుజ ౧౨ మంగళవారం రోజు ఝామురాత్రిసరిగ్గా వీరభద్రవిజయ చతుర్థాశ్వాసాలున్న చింద్రాడుగరగారురయ్యకి తాడపాపయ్యకు వ్రాసి యిచ్చెను.

వ్రాత దోషము లధికముగా గలవు. గ్రంథమచ్చటచ్చట క్రిమిదష్టమై యున్నది. ఇందు నాలుగు ఆశ్వాసములు కలవు.

# వీరభద్ర విజయము

## బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 3995 | కాల్ నెం | : టిపి-268 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 180 |
| ప్రతి పరిమాణము | : 33×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 నుండి 8. |

**విశేషాంశములు :**

ప్రతి విలేఖనము :

సౌమ్యనామ సంవత్సర వైశాఖ బ౧ మీలవరకు వీరభద్రవిజయం సంపూర్ణం.

నందిగామ లక్ష్మయ్య ప్రతిలో ఉన్న క్రమాన వ్రాసినాడు.

ఈ ప్రతియందు నాలుగు ఆశ్వాసములు పూర్తిగా గలవు. ఇది మిక్కిలి పురాతనమైన దగుటచే నలుపుదిరిగి కొన్ని పంక్తులు కానవచ్చుటలేదు. పార్శ్వభాగములందు కూడ శిథిలమై కొంతభాగము నశించినది. లిపి స్పష్టము. అక్షరదోషములు, అక్షరచ్యుతులు పెక్కులు గలవు.

# వీరభద్రవిజయము

## బమ్మెర పోతన

| | | | | |
|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 1531 | | కాల్ నెం | : టి 3- 74. |
| ప్రతి | : తాళపత్రము, సమగ్రము. | | పత్రములు | : 106 |
| ప్రతి పరిమాణము | : 29.5×4 సెం.మీ. | | పత్రపంక్తులు | : 7 |

**విశేషాంశములు :**

**ప్రతి విలేఖనము :**

వర్తమాన వ్యవహారిక చాంద్రమాన ప్లవంగ నామ సంవత్సర వైశాఖ శుద్ధ ౨ ఇందు వారం నిరుద్దా.... గౌరయ.... భట్టు వెంకట్రాజు కుమారుడు చినవెంకటరామరాజు వీరభద్రవిజయం ప్రతిలో నున్న క్రమాన వ్రాసి ఇచ్చినాడు.

గ్రంథము శిధిలావస్థలో నున్నది. వ్రాతతప్పులు అధికము. గ్రంథము నల్లబడిపోయి నిరుపయోగప్రతిగా మారుచున్నది.

ఇందు 4 ఆశ్వాసములు గలవు. అక్షరములు పూర్తిగా కనిపించుటలేదు.

# వీరభద్రవిజయము

## బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 692 | కాల్ నెం | : 3 టి-86 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 133 |
| ప్రతి పరిమాణము | : 38.5×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 |

**విశేషాంశములు :**

గ్రంథమునందు పెక్కు వ్రాతదోషములు గలవు. పుట సంఖ్యలు తప్పుగా గలవు. ఇందు 4 ఆశ్వాసములు గలవు.

# వీరభద్ర విజయము

## బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4042 | కాల్ నెం | : టి 3-294 |
| ప్రతి | : కాగితము; అసమగ్రము. | పుటలు | : 33 |
| ప్రతిపరిమాణము | : 24 × 43 సెం. మీ. | పుటపంక్తులు | : 45 |

**విశేషాంశములు :**

ప్రతివిలేఖన విషయమున నాగరి లిపిలో నున్న తెలుగునకు - తెలుగులిపిలో నున్న విషయమునకు భేదము గోచరమగుచున్నది. నాగరిలిపిలో ఈశ్వర నామ సంవత్సర శ్రావణశుద్ధ దశమి గురువారం నాడు అని వ్రాయబడియున్నది. తెలుగులో వ్రాయ బడిన సంవత్సరము స్పష్టముగా తెలియుటలేదు. మిగిలిన మాస నామ, తిథి, వాసర ములు మాత్రము సమానము; వ్రాతదోషములు - అక్షరదోషములు అధికముగా గలవు. 4ఆశ్వాసములు గలవు. వ్రాయసకాని నామములేదు. గ్రంథము అలతిగా క్రిమిదష్టమై యున్నది. గ్రంథాంత మందలి పుటలు శిథిలములై యున్నవి. కొన్నిపుటలు లోపించి యున్నవి.

# వీరభద్ర విజయము

## బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్నెం. | : 3993 | కాల్ నెం. | : టి. 3-261 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 137 |
| ప్రతి పరిమాణము | : 31.5×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 నుండి 7 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు నాలుగు ఆశ్వాసములు గలవు. కాని ప్రారంభపత్రము మరియు అటనట కొన్ని పత్రములు లేవు. ప్రతి మిగుల పురాతనమై పత్రములు పార్శ్వములందును

అచట నచట శిథిలములైనవి. లిపి అస్పష్టము. ఈ ప్రతియందలి భాష చాలదోషములతో కూడి యున్నది. కొన్ని పద్యములు, పద్యభాగములు గూడ వ్రాతలో లోపించినవి.

# వీరభద్ర విజయము

## బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం : | 484. | కాల్ నెం | : టి3-299 |
| ప్రతి : | తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 40 |
| ప్రతి పరిమాణము : | 37×3 సెం.మీ | పత్రపంక్తులు | : 5 |

విశేషాంశములు :

ఈ ప్రతియందు మొదటి మూడు ఆశ్వాసములే యున్నవి. అందును 99 పత్రములకు గాను 40 పత్రములే యున్నవి. గ్రంథారంభము కూడలేదు.

లిపి సులభగ్రాహ్యము కాదు. స్వల్పదోషము లున్నవి. ప్రతి నలుపు దిరుగుచున్నది. కొన్ని పత్రశకలు తునుకలైనవి.

ఈ ప్రతి కొలని శ్రీగిరిచే దుర్మతి నామ సంవత్సర అధికశ్రావణ బహుళ దశమీ గురువారం నాటికి వ్రాయబడినది.

# వీరభద్ర విజయము

## బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం : | 782 | కాల్ నెం | : టి 3-81 |
| ప్రతి : | తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 115 |
| ప్రతి పరిమాణము: | 48×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 5 |

**విశేషాంశములు :**

గ్రంథము క్రిమిదష్టమై యున్నది. గ్రంథపాతము, శైథిల్యము కలదు. వ్రాతతప్పులు మిక్కిలిగా గలవు.

నాల్గవ ఆశ్వాసమునందలి చివరిభాగము మిక్కిలి శిథిలము.

# వీరభద్ర విజయము

## బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4352 | కాల్ నెం | : టి 3-150 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పుటలు | : 83 |
| ప్రతి పరిమాణము | : 44.5 × 4 సెం.మీ. | పుటపంక్తులు | : 7 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు ఆద్యంతము లున్నను ప్రతి చాలవరకు క్రిమిదష్టమై శిథిలమైనది. ఈ ప్రతి చాల పురాతనమైనది. పత్రములు రంగు కూడ మారి నలుపు దిరుగుచున్నవి. ప్రతివిలేఖనమున చాల దోషములు గలవు.

# వీరభద్ర విజయము

## బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 1665 | కాల్ నెం. | : టి 3-132 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 61 |
| ప్రతి పరిమాణము | : 45×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 |

**విశేషాంశములు :**

ప్రతివిలేఖనము :

ప్లవంగ నామ సం॥ మార్గశిర శుద్ధ ౧౨ శనివారం వరకు వీరభద్రవిజయం నాల్గు ఆశ్వాసాలను యీ శ్రీ రస్రగుడ మంగరాజు కొమారుడు వెంకయ్య స్వహస్తాన సంపూర్ణంగా ప్రతిలోనున్న క్రమాన వ్రాసుకొనెను.

ఈ ప్రతియందు ప్రథమాశ్వాసము, ద్వితీయాశ్వాసమునందలి కొంతభాగము లేదు. ద్వితీయాశ్వాసము సగము నుండి, నాలుగవ ఆశ్వాసము తుదివరకు గలదు. మధ్య పత్రములు కూడ మిక్కిలి క్రిమిదష్టములై చాల భాగము లోపించినవి. లేఖన దోషము లధికము. లిపి స్పష్టము.

# వీరభద్రవిజయము

## బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3862 | కాల్ నెం | : టి3-291 |
| ప్రతి | : కాగితము; అసమగ్రము | పుటలు | : 7 |
| ప్రతి పరిమాణము | : 23.5×14.5 సెం. మీ. | పుట పంక్తులు | : 20 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు ప్రథమాశ్వాసములోని పదునాలుగు పద్యములు మాత్రమే యున్నవి. లిపి యస్పష్టము. లేఖనదోషము లధికము.

# వీరభద్రవిజయము

## బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 715 | కాల్ నెం | : టి 3-149 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 28 |
| ప్రతిపరిమాణము | : 29×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 7 |

**విశేషాంశములు:**

ఈ ప్రతియందు ప్రథమాశ్వాసము మాత్రమే యున్నది. లిపి స్పష్టమే. కాని భాషా దోషములు పదపాతములు చాల కలవు. ప్రతియొక్క ఊర్ధ్వ అధోభాగములు శిథిలమై పంక్తులు కానరాకున్నవి.

# వీరభద్రవిజయము

## బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 793 | కాల్ నెం | : టి 3-35 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 18 |
| ప్రతి పరిమాణము | : 37×3.5 సెం.మీ | పత్రపంక్తులు | : 5 |

**విశేషాంశములు :**

ప్రతివిలేఖనము : దుర్మతి నామసంవత్సర భాద్రపద శుద్ధ ౭ సోమవారం వరకు వీరభద్రవిజయం.

ప్రతియందు గ్రంథపాతము కలదు. ఇందు నాల్గవ ఆశ్వాసము మాత్రమే కలదు.

# వెల్లగొండ మహాదేవయ్యగారికథ

## పాల్కురికి సోమనాథుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5539 | కాల్ నెం | : టి 3-302 |
| ప్రతి | : తాళపత్రము ; సమగ్రము. | పత్రములు | : 5 |
| ప్రతి పరిమాణము | : 42×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 6 |

**ప్రారంభము :**

అంత వెండియు పండితారాధ్యదేవు దంతకాంతకమూర్తి యట్లొక్క నాడు
శిష్యవర్గంబు దానును శిష్యవర్గంబు సుప్రభాతమున నుత్సుకత మేల్కాంచి

మసలి చుక్కలుదివి మాయక మున్న అసమ శంఖధ్వను లలరక మున్న
అభవాలయంబున నలరు దీపములు ప్రభచెడి వెలవెలబారక మున్న
పరగి వెన్నెల పరపరగాక మున్న సరసిజంబులు మొగి విరియక మున్న
జిగిచెడి కలువలు .... .... క మున్న మొగి జెకోరములు నోర్మూయక మున్న
చొక్కి యొక్కొకయెడ సుఖియింప దలచి

ముగింపు :

పాదముల్ దొల్లింటి భాతిన యమర నాదట భక్తగణాళి హర్షించి
ముట్టినచో బ్రాణమున కాశపడక దిట్టయై పాదముల్ తెగగొట్టు కొన్న
యీ మహాదేవయ్య యిద్ధమహత్వ మేమని వర్ణింప నెట్లునోనెడ
అప్పుడు తుత్తునకలైన పాదంబు లొప్పార శివునిచె నిప్పించినట్టి
యూర్జితపుణ్యు డవర్జిత యశుడు తర్జితాఘుడు మల్లికార్జునపండి
తారాధ్యు బమహత్వమది యట్లు బొగడ గౌరీశ్వరుడ యెరుగుగాక యిద్ధరణి.

విశేషాంశములు :

ఈ కథ పాల్కురికి సోమనాథ విరచితమగు పండితారాధ్య చరిత్రాంతర్గతము. శివభక్త చరిత్రము. ఈ ప్రతి బాగున్నది. లిపి స్పష్టము. లేఖన దోషములు కొద్దిగా కలవు. ఈ కథాభాగము పురాతనప్రకరణము లోనిది.

# వేంకటాచలమాహాత్మ్యము

## తరికొండ వేంకమాంబ

| | | | | |
|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3440 | కాల్ నెం | : | టి 3—208 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము, | పత్రములు | : | 129 |
| ప్రతి పరిమాణము | : 45.5×3.5 సెం.మీ | పత్రపంక్తులు | : | 6 నుండి 7 |

ప్రారంభము :

శ్రీ కాం .... త్మన .... జ చండ కిరణం శీతాంశుబింబాననం
శ్రీ కంఠాబ్జజ సన్నుతాంఘ్రికమలం .... న్మాత్ర మప్రాకృతం।

లోకాతీత మనే .... .... .... పరం సర్వగం ॥
స్వాకారం తరిగొండ శేషకుధరాధ్యక్షం భజేహం సదా ।

ఉ. క్షీర సముద్రమందును విశేషమతిన్ జనియించి కూర్మితో
వారి .... .... .... వక్షమునందు వసించి పూర్ణశృం
గార విలాసలీలల సుఖస్థితి నొప్పుచు భక్తకోటికిన్
గారవ మొప్పగా నెపుడు కల్మల నిచ్చు .... .... ....

0 0 0

వ. అంకితంబుగా నా యొనర్పం బూనిన వేంకటాచల మాహాత్మ్యంబునకు కథాక్రమం బెట్టిదనిన.

సీ. జంబీర మందార .... .... .... .... హింతాలములును
వట బిల్వ బదరి కాశ్వత్థ చందన కుంద కురువక క్రముక తక్కోలములును
నారికేలా .... న నారంగ బంధూక పారిజా తాశోక ....
.... .... .... పున్నాగ కోవిదార మధూక కుటజములును

గీ. మొదలుగా గల బహు వృక్షములును లతలు
పూచి కాచి ఫలింప సంపూర్ణ మగుచు
సర్వకాలం .... .... .... ....
.... .... నైమిశారణ్య మందు.

క. .... ల యేరులు కమలాకర ములు బ .... సార బృందములు
.... కాలము నొక .... విధముగ పొలుపై ప్రవహించు నచట బుధసేవ్యములై.

వ. .... శౌనకాది మహామునులు సూతునిపలన సకల పురాణంబులు విని తదనంతరంబున నొక దినమందు సూతునిం జూచి భూలోకంబున నూటయెనిమిది తిరుపతులు గల వ....

* * *

ముగింపు :

క. వనదనిభాకారుండై వననిధిలో .... న్న వటపత్రముపై
తను దానె జూచి జొక్కుచు నెనవుగ నానంద .... జెందున్.

వ. ఇవ్విధం ........ జెందియుండి ఐహటకాలంబునకు క్రమ్మర మేల్కాంచి .... ప్రపం చంబును వెలి పూర్వప్రకారంబున నిర్మించునప్పుడు దక్క తక్కిన కర్మ ........ చెప్పి క్రమ్మర సూతుం డిట్లనియె.

సీ. పుట్టి గిట్టుచునుండు భూలోకవాసుల రక్షించుటకు రమారమణితోడ
వేంకటాచలమందు విఖ్యాతిగా .... .... .... ....
.... ప్పుచు ఘన పాపములనైన క్షీణింపజేయుచు సిరుల నిచ్చి
పాలింపు చున్నట్టి ఫణి గిరీశున............ కుర్విమీద

గీ. .... .... .... .... డుచు నలుమేలు మంగాఖ్య నద్భుతముగ
నమరు పద్మా .... వేంకటాద్రి కిలను వెలయు శుభ మంగళము గల్గవలయు ననగ

గీ. అప్పుడా మునులెల్ల తథా స్తటంచు .... వేంకటేశ్వర భక్తి కథలు
సూతు డెరిగింప వినుచు మెచ్చుచును వార లంద రందుండి రానంద మతిశయింప.

క. ధరణీ శ్రీ నీళాధిప కరుణారస పూరితాత్మ కామిత....లదా
....ర వేంకటగిరినాయక తరిగొండ నృసింహ దురితదళన శుభాంగా.

మాలిని. సులలిత మణిభూషా సూరిచిత్తాబ్జపూషా కలుష జలధి శోషా .... ....
కలిపురుషజదోషా క్రాంత....వాళిపోషా విలసిత సవిశేషా, వేదవేదాంగ భాషా.

గద్య :

ఇతిశ్రీ తరిగొండ లక్ష్మీనృసింహకరుణాకటాక్ష కలిత కవితా విచిత్ర వశిష్ఠ గోత్ర పవిత్ర కృష్ణయామాత్య తనూభవా వేంగమాంబా ప్రణీతంబైన శ్రీ వీరలక్ష్మీ విలాసం బను వేంకటేశ్వర మాహాత్మ్యంబునందు లక్ష్మిని గూర్చి హరి కొల్లాపురంబున తపంబు జేయుటయు, శుకాశ్రమంబున తపంబు జేయు ముని చక్రి కశరీర వాణి బోధిం చుటయు, ........ మనుకాల నిర్ణయంబును అష్టాదశ పురాణ ప్రశంసయు, పుణ్యజీవులు బొందు సద్గతిక్రమంబులు నను కథలు గల వేంకటేశ్వర మాహాత్మ్యంబునందు వీరలక్ష్మి విలాసం బన్నది షష్ఠమా(?) శ్వాసము సంపూర్ణము.

ఈ ప్రతియందు ఆరు ఆశ్వాసములు కలవు. గ్రంథముయొక్క ఆద్యంతములు గలవు. కాని మధ్య పెక్కు తాళపత్రములు లేవు. ప్రతి మిక్కిలిగ క్రిమిదష్టమైనది. అక్షరదోషములు స్వల్పముగ కలవు. లిపి స్పష్టము.

# వైజయంతీవిలాసము

## సారంగు తమ్మయ్య

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 4686 | కాల్ నెం | : టి 3-112 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 49 |
| ప్రతి పరిమాణము | : 41×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 |

**ప్రారంభము :**

శ్రీ వసుధా సుతాంఘ్రి వివరింప శిరీష దళోపమాన మీ
క్ష్మావిభుకాల్నిసర్గగుణ కర్కశమంశము బల్కిన ............
............నింతులు బల్కగ నంద గొంచు లో
కావనుడైన పెండ్లికొడు కస్మదభీప్సితముల్ ఘటింపుతన్॥

వ. జను లరుదంద నా ఘను .... .... .... .... యంగజూచి తో
నినువగు కూర్మి నీరదము నెమ్మిరహిం బురివిప్పి నియ్యెడన్
గనుగొను వారికిం గలిగె కన్నులపండు వటంచు నె ....
.... .... పల్కి గన్గొనల నవ్వ ధరాసుత మమ్ము బ్రోవుతన్।।

* * * *

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధియు, నభిమతార్థసిద్ధియునుంగా సమర్పణంబుగా నే రచి యింపంబూనిన వైజయంతీవిలాసంబునకుం గథాక్రమం బెట్టిదనిన.

సీ. నిలిచె నే రాజధాని పయోరుహాసను సజ్జపూజ యనంతశయనమూర్తి
చెం .... నే కటకంబులందు సంతతసర్వ పరిపూర్తితో త .... పావిభూతి
పుట్టి రే పట్టణంబున తృణద్రుమలతామూర్తులై తన్నిత్యముక్తవరులు
ప్రవహించు నే వీట పరిఘాతరీతి న వ్విరజాస్రవంతి కావేరి పేర
వే .... శృంగంబు నోంకారవిగ్రహంబు నైన శ్రీరంగదివ్య విమానరాజ
మెచట నివసించె నిల దాని నెన్నదరమె పుణ్యనికరంబు శ్రీరంగపురవరంబు।।

ముగింపు :

గీ. అనఘ తొండరడిప్పొడి యనగ బరగు  నీకు నాళ్వారిపేరు నౌ గాక యనియె
నతడు తొండరడిప్పొడియాళువార  లనగ బ్రఖ్యాతి జెన్నొందె నవనియందు॥

గీ. జియ్యలును దేవదేవికి నెయ్య మలర  విహితవస్త్రాభరణ సమన్వితముగాగ
కనకపాత్ర సమర్పించి యనుపుటయును  న త్తెలిరుబోణియు విర క్తచిత్త  యగుచు॥

కం. పెరుమాళుల కా గిన్నియ  యిరుమడుగులు పసిడిగాన్క యిడి తన కదియే
తిరువారాధనగా గొని  సిరివరు రంగేశ్వరుని భజింపుచు నుండెన్॥

*   *   *

సుగంధి వృ త్తము :

పాదపాంసు వారితాఘ పాదదారవేదనా  వేదనాథతాద్యదిరూపవేద్య భూత్యనాదితా
నాదితాంగజారిచాపనాద తుష్టవేదిజా  వేదిజాలకాంక్షితాభివృద్ధి కల్పపాదపా॥

గద్య :

ఇది శ్రీ మదాప స్తంబసూత్ర భరద్వాజసగోత్ర పవిత్ర శ్రీరామచంద్ర కరుణాంత రంగితవై భవ సారంగు నృసింహమంత్రి తనూభవ పరిచితభగవద్భాగవత కైంకర్య విధాన తమ్మయాభిదాన ప్రణీతంబైన వైజయంతివిలాసం బను మహాప్రబంధంబునందు సర్వంబును చతుర్థాశ్వాసము.

విశేషాంశములు :

ప్రతి విలేఖనము : వ ర్తమాన వ్యవహారిక దుర్ముఖి నామసంవత్సర పుష్యబహుళ ౩ శనివారం వరకు బండి రాఘవురెడ్డిదేశముఖుగారి ప్రతిలోనున్న క్రమాన వైజయంతి విలాసం సంపూర్ణముగాను చెలిమిళ్ళవెంకటకృష్ణారెడ్డిదేశముఖుగారు ఖాసాకు కావలిసి వ్రాసుకొన్నారు.

గ్రంథము క్రిమిదష్టమై శిథిలావస్థలో నున్నది. ఇందు 4 ఆశ్వాసములు గలవు. ఈ గ్రంథము శ్రీరామునకంకితము. ఈ గ్రంథమునకు విప్రనారాయణచరిత్ర మనియు పేరుగలదు. ప్రతియందు వ్రాతదోషములు కలవు.

# వైజయంతీవిలాసము

## సారంగు తమ్మయ్య

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 1751 | కాల్ నెం | : టి 3-57 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము; | పత్రములు | : 43 |
| ప్రతి పరిమాణము | : 45.5×3 సెం.మీ | పత్ర పంక్తులు | : 7 |

విశేషాంశములు :

ప్రతి చాలవరకు క్రిమిదష్టమైనది. ప్రతిలో నాలుగాశ్వాసములు పూర్తిగా నున్నను చివరిపత్రములు కొన్ని విరిగి పోయినవి. లేఖన దోషము అధికము. లిపి స్పష్టము.

# వైజయంతీవిలాసము

## సారంగు తమ్మయ్య

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 745 | కాల్ నెం | : టి 3-37 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 27 |
| ప్రతి పరిమాణము | : 34.5×3 సెం.మీ. | పత్రపంక్తులు | : 4 |

విశేషాంశములు :

ఈ ప్రతియందు ప్రథమాశ్వాసము మాత్రమే యున్నది. అదియైనను క్రిమిదష్టము. మొదటి యైదు పత్రములు లేవు. లేఖనదోషము అధికము.

# వైజయంతీ విలాసము

## సారంగు తమ్మయ్య

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 8654 | కాల్ నెం | : బి 8-236 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 26 |
| ప్రతి పరిమాణము | : 38×3 సెం.మీ | పత్రపంక్తులు | : 6 నుండి 7 |

విశేషాంశములు :

ఈ ప్రతియందు నాలు గాశ్వాసము లున్నను మధ్యలో చాల పత్రములు లోపించినవి. ప్రతి క్రిమిదష్టమై శిథిలావస్థలో నున్నది. లిపి స్పష్టముగా లేదు. లేఖనదోషము లధికము.



## అనుబంధము - I

# గ్రంథకర్తృ సూచిక

| క్రమసంఖ్య | గ్రంథకర్త పేరు | పుట |
|---|---|---|
| 1. | అద్దంకి అమ్మిరాజు | 6 |
| 2. | అనంతామాత్యుడు | 124 |
| 3. | అయ్యలరాజు రామభద్ర కవి | 183,185,186 |
| 4. | అల్లసాని పెద్దన | 130,182 |
| 5. | ఆతుకూరి మొల్ల | 147,149 |
| 6. | ఉరిటి శ్రీరామమూర్తి | 25,134,150 |
| 7. | కందుకూరి వీరేశ్వరామాత్యుడు | 64 |
| 8. | కాకమాని మూర్తి కవి | 173 |
| 9. | కాణాదము పెద్దన | 91,94,95 |
| 10. | కూర్మనాథ కవి | 208 |
| 11. | కొండయ కవి | 228 |
| 12. | గంగాధరుడు | 145 |
| 13. | గద్దం నరసింహారెడ్డి | 8,197 |
| 14. | గర్నెపూడి వేంకటసుబ్రహ్మణ్యకవి | 83 |
| 15. | గోడి మృత్యుంజయ కవి | 27 |
| 16. | గోన బుద్ధారెడ్డి | 153,155,156,157, 158,245 |
| 17. | గోపతి లింగ కవి | 75,201 |
| 18. | చామర్తి శేషగిరి రాయకవి | 180 |

## అనుబంధము - II

# ప్రతివిలేఖన వివరముల పట్టిక

| క్రమ సంఖ్య | ప్రతివిలేఖకుడు | విలేఖకుని తండ్రి | లేఖన కాలము | పుట | ఆక్సేషను నెం. |
|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
| 1. | మందడి వెంకయ్య | పాపయ్య | అంగిరసనామ సం॥ ఫాల్గుణ శుద్ధ 8 స్థిరవారము | 9 | 3413 |
| 2. | భీమణ్ణ | సింగన్న | రౌద్రినామ సం॥ర ఫాల్గుణ బ॥ 10 గురువారము | 13 | 3441 |
| 3. | ఎఱ్ఱాప్రగడ తమ్మప్ప | — | పూర్వభాగము రౌద్రినామ సం॥ కార్తీక బ॥ 7 బుధవారము ఉత్తరభాగము రౌద్రినామ సం॥ మార్గశిర బ॥ 8 | 14 | 592 |
| 4. | సత్యనారాయణాచారి | — | తారణనామ సం॥ కార్తీక శుద్ధ 7 | 17 | 5683 |
| 5. | — | — | ప్లవంగనామ సం॥ వైశాఖ శుద్ధ 2 | 20 | 3826 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| 6. | — | — | ప్లవంగనామ సం॥ శ్రావణ శుద్ధ 10 గురువారము | 22 | 3936 |
| 7. | ఘండ్లపూడి సుబ్బారాయుడు | — | — | 28 | 3563 |
| 8. | కుప్పిలి రంగయ్య | వెంకటనరసయ్య | వికారినామ సం॥ ఆశ్వీజ శుద్ధ 10 గురువారము | 31 | 159 |
| 9. | కొమ్మనాపల్లి కృష్ణమ్మ | సన్యాసి | పింగళనామ సం॥ కార్తీక బ॥ 6. స్థిరవారము | 32 | 2745 |
| 10. | అమిరెపు అప్పల్రాజు | అచ్చిరాజు | దుర్ముఖినామ సం॥ కార్తీక బ॥ 5 ఆదివారము | 34 | 3639 |
| 11. | — | — | సౌమ్యనామ సం॥ మార్గశిర బ॥ 13 బుధవారం | 38 | 3647 |
| 12. | వెంకయ్య | — | క్షయనామ సం॥ చైత్ర శుద్ధ 6 భృగువారము | 41 | 3827 |
| 13. | మెగుతల పుల్లప్ప | చిన్న వీరయ్య | ప్రమాదినామ సం॥ భాద్రపద శుద్ధ 9 | 44 | 3939 |
| 14. | సురపురం బాకాని రమణయ్య | — | కాళయుక్తినామ సం॥ మాఘ శుద్ధ 14 | 55 | 588 |
| 15. | పంతుల వెంకయ్య | — | ధాతనామ సం॥ ఆషాఢ బ॥ 2 గురువారము | 58 | 3971 |
| 16. | అమిరెపు అప్పల్రాజు | అచ్చిరాజు | దుర్ముఖినామ సం॥ చైత్ర శుద్ధ 14 గురువారము | 59 | 3652 |
| 17. | పోతుల పెదరాజినాయుడు | పాత్రినాయుడు | సాధారణనామ సం॥ ఫాల్గుణ బ॥ 7 జయవారము | 59 | 3292 |
| 18. | పెదమజ్జిపీటి అగసాల అయ్యన్న | తమ్మన | ప్రజోత్పత్తినామ సం॥ జ్యేష్ఠ బ॥ 10 | 63 | 804 |
| 19. | గురుబసవప్పమఠం కంకల్లు | — | విజయనామ సం॥ కార్తీక శుద్ధ 7 సోమవారము | 70 | 3972 |
| 20. | గన్నమరాజు గురువరాజు | భగవానులు | విక్రమనామ సం॥ చైత్ర బ॥ 7 | 88 | 624 |
| 21. | మోషె వెంకటరామిరెడ్డి | తిమ్మారెడ్డి | పరాభవనామ సం॥ మాఘ శుద్ధ 14 భృగువారము | 89 | 749 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| 22. | — | — | వి|క్రమనామ సం॥ మాఘ శుద్ధ 2 | 93 | 3824 |
| 23. | — | — | దుర్మతినామ సం॥ భాద్రపద బ॥ 10 | 94 | 6120 |
| 24. | — | గండ్లూరు కుమ్మర సంజీవప్ప | పరాభవనామ సం॥ భాద్రపద శుద్ధ 1 | 98 | 726 |
| 25. | పాలవర్తపు మల్లయ్య | — | నందననామ సం॥ శ్రావణ శుద్ధ 2 గురువారము | 100 | 5534 |
| 26. | పోతుల పెదరాజినాయుడు | పాత్రినాయుడు | పరీధావి నామ సం॥ వైశాఖ శుద్ధ 10 స్థిరవారము | 103 | 3287 |
| 27. | పం॥ వెంకయ్య | — | విజయనాను సం॥ భాద్రపద బ॥ 7 నుండి మాఘ శుద్ధ 7 | 107 | 3976 |
| 28. | ముంగర నర్సన్న | — | శుభకృతు నామ సం॥ శ్రావణ బ॥ 10 బుధవారము | 108 | 315 |
| 29. | — | — | విక్రమ నామ సం॥ పుష్య బ॥ 8 | 108 | 1791 |
| 30. | పోతుల పెదరాజినాయుడు | పాత్రినాయుడు | సౌమ్య నామ సం॥ కార్తీక శుద్ధ 2 గురువారము | 111 | 705 |
| 31. | — | — | రాక్షసనామ సం॥ చైత్రమాసము | 113 | 3628 |
| 32. | — | — | విక్రమనామ సం॥ చైత్ర శుద్ధ 11 గురువారమునుండి స్వభాను నామ సం॥ అధిక జ్యేష్ఠ బ॥ 1 శుక్రవారము | 115 | 4614 |
| 33. | పిండిప్రోలు కామరాజు | లక్ష్మీపతి | విక్రమనామ సం॥ ఆషాఢ శుద్ధ 11 ఆదిత్యవారము | 116 | 3627 |
| 34. | అక్కి వేంకటనర్సు | — | శార్వరి నామ సం॥ జ్యేష్ఠ శుద్ధ 10 ఇందువారము | 117 | 4019 |
| 35. | గెంటె కూర్మనాయకుడు | — | భావనామ సం॥ ఆషాఢ బ॥ 10 జయవారము | 119 | 4618 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| 36. | పోతుల పెదరాజినాయుడు | పాత్రినాయుడు | సౌమ్యనామ సం॥ వైశాఖ బ॥ 6 గురువారము | 119 | 3295 |
| 37. | పిండిప్రోలు కామరాజు | లక్ష్మిపతి | పార్థివనామ సం॥ కార్తీక శుద్ధ 11 భానువారము | 120 | 3686 |
| 38. | రాజ్ఞి కల్కూరయ్య | — | వికారినామ సం॥ శ్రావణ బ॥ 11 జయవారము | 121 | 3637 |
| 39. | — | — | పార్థివనామ స॥ ఆషాఢ బ॥ 10 | 123 | 420 |
| 40. | తిమ్మనార్యుడు | — | హేవళంబి నామ సం॥ వైశాఖ బ॥ 2 | 132 | 549 |
| 41. | ద్వివేదుల మల్లయ్య | — | 9-5-1900; శార్వరినామ సం॥ వైశాఖ శుద్ధ 10 బుధవారం | 148 | 3821 |
| 42. | సంగన్న | — | విషునామ సం॥ పుష్య బ॥ 11. శుక్రవారము | 155 | 3989 |
| 43. | కొట్జిపాటి వెంకటరాముడు | — | విరోధికృతు నామ సం॥ ఫాల్గుణ శుద్ధ 7. గురువారము | 155 | 81[4] |
| 44. | కొమ్మనాపల్లి కృష్ణమ్మ | సన్యాసి | పింగళనామ సం॥ కార్తీక బ॥ 7. ఆదివారము నుండి పింగళనామ సం॥ మాఘ బ॥ 10. సోమవారము | 169 | 2748 |
| 45. | అమిరెపు అప్పల్రాజు | అచ్చిరాజు | సర్వధారినామ సం॥ నిజ ఆషాఢ శుద్ధ 1. స్థిరవారము | 170 | 3651 |
| 46. | — | — | శుభకృతునామ సం॥ మాఘ శుద్ధ 11. | 171 | 707 |
| 47. | అమిరెపు అప్పల్రాజు | అచ్చిరాజు | జయనామ సంవత్సరము | 175 | 3557 |
| 48. | మద్దూరి వెంకన | పాపరాజు | — | 176 | 442 |
| 49. | — | — | యువనామ సం॥ మార్గశిర శుద్ధ 5. భానువారము | 181 | 5558 |

౧

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
| --- | --- | --- | --- | --- | --- |
| 50. | — | — | విజయనామ సం॥ఆషాఢ శుద్ధ 1. అంగారకవారము | 188 | 322 |
| 51. | కింతాడ సూరప్ప | — | కీలకనామ సం॥ శ్రావణ శుద్ధ 8. ఆదివారము | 189 | 2795 |
| 52. | కోట జంగమ బైరాగి | కింతాడ పాపయ్య | సర్వజిత్తునామ సం॥ భాద్రపద బ॥ 12. సోమవారము | 189 | 2794 |
| 53. | — | — | ఆంగిరసనామ సం॥ కార్తీక బ॥ 5. | 190 | 6118 |
| 54. | పంతుల కృష్ణయ్య | వెంకయ్య | పరీధావినామ సం॥ పుష్య బ॥ 7. అంగారకవారము నుండి మాఘ శుద్ధ 12. అంగారకవారము | 190 | 4627 |
| 55. | వెంకటేశ్వరులు | — | సాధారణనామ సం॥ పుష్య బ॥ 12. సోమవారము | 191 | 4565 |
| 56. | గుడిమెళ్ల కృష్ణమాచార్యులు | తిరువెంగళాచార్యులు | ప్రమోదూతనామ సం॥ మాఘ శుద్ధ 3. | 192 | 737 |
| 57. | మురపాక సూరయ్య | — | విళంబినామ సం॥ మార్గశిర బ॥ 15. | 194 | 5643 |
| 58. | మందడి వెంకయ్య | — | ఆంగీరసనామ సం॥ మాఘ బ॥ 5. ఇందువారము | 198 | 2804 |
| 59. | గడివేముల రామయ్య | సంజీవయ్య | విరోధినామ సం॥ వైశాఖ శుద్ధ 7. శుక్రవారము | 200 | 753 |
| 60. | — | — | క్రోధినామ సం॥ చైత్ర శుద్ధ 13. నుండి బ॥ 13. సోమవారము | 208 | 3328 |
| 61. | బణమనూరి జగన్నాథయ | బాలకవి వాబయ | దుర్మతినామ సం॥ ఆశ్వయుజ శుద్ధ 5. గురువారము | 214 | 361 |
| 62. | కందుకూరి వేంకటనర్సు | — | శుభకృతునామ సం॥ మాఘ బ॥ 12. | 215 | 1544 |
| 63. | — | — | నందననామ సం॥ భాద్రపద శుద్ధ 2. బుధవారము | 215 | 4633 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
| --- | --- | --- | --- | --- | --- |
| 64. | --- | --- | సాధారణనామ సం॥ చైత్ర శుద్ధ 6. శనివారము | 221 | 2793 |
| 65. | --- | --- | ప్రజోత్పత్తినామ సం॥ ఆశ్వీజ శుద్ధ 1. భానువారము | 230 | 3697 |
| 66. | అమిరెపు అప్పుల్రాజు | అచ్చిరాజు | జయనామ సం॥ మార్గశిర శుద్ధ 14. ఆదిత్యవారము | 230 | 3648 |
| 67. | ముండ్లపూడి వెంకయ్య | --- | హేవళంబినామ సం॥ కార్తీక బ॥ 7. ఆదివారము | 231 | 3649 |
| 68. | కొట్టరవు హితయ్య | గండన్న | పరీధావినామ సం॥ చైత్ర శుద్ధ 2. ఇందువారము | 232 | 512 |
| 69. | గోపరాజు పెదవెంకటాద్రి | --- | ఈశ్వరనామ సం॥ భాద్రపద శుద్ధ 10. | 241 | 5676 |
| 70. | --- | --- | ఖరనామ సం॥ ఆశ్వయుజ 12. మంగళవారము | 252 | 2796 |
| 71 | నందిగామ లక్ష్మయ్య | --- | సౌమ్యనామ సం॥ వైశాఖ బ॥ 1. | 252 | 3995 |
| 72. | చినవెంకట రామరాజు | వెంకట్రాజు | ప్లవంగనామ సం॥ వైశాఖ శుద్ధ 5. ఇందువారము | 253 | 1531 |
| 73. | --- | --- | ఈశ్వరనామ సం॥ శ్రావణ శుద్ధ 10. గురువారము | 254 | 4042 |
| 74. | కొలని శ్రీ[illegible] | --- | దుర్మతినామ సం॥ అధిక శ్రావణ బ॥ 10. గురువారము | 255 | 484 |
| 75. | రస్రగుడ వెంకయ్య | మంగరాజు | ప్లవంగనామ సం॥ మార్గశిర శుద్ధ 12. శనివారము | 257 | 1665 |
| 76. | --- | --- | దుర్మతినామ సం॥ భాద్రపద శుద్ధ 7. సోమవారము | 258 | 793 |
| 77. | చెలిమిల్ల వెంకట కృష్ణారెడ్డి | --- | దుర్ముఖినామ సం॥ పుష్య బ॥ 3. శనివారము | 263 | 4636 |

# The Andhra Pradesh Government Oriental Manuscripts Library and Research Institute, Abids, Hyderabad-1.

## List Of Publications

1. Seeta Kalyanamu (Telugu Yakshagana) 3-75
   *by Sri Shahajee Maharaja Bonsle*
2. Sringara Padamulu (Telugu Padakavita) 4-40
   *by Unknown poets of antiquity*
3. Indumatee Parinayamu (Telugu Poetry) 4-00
   *by Tenali Ramabhadra Kavi*
4. Sree Geeta Govindam and Sree Geeta Sankaram 3-75
   (Sanskrit in Telugu Script)
   Respectively *by Sri Jayadeva Kavi &*
   *by Sri Pancharatnakavi Anantacharya*
5. Radha Vamseedhar Vilas Natak (Hindi Play) 3-75
   *by Sri Shahajee Maharaja Bonsle*
6. Enugula Veeraswamy's Journal (English Prose) 14-00
   (*Kasiyatra Charitra translated into English*)
7. Sree Virupaksha Sreerama Copper Plate 50-00
   Inscriptions (1576-1644 A. D)
8. Vaikrita Chandrika (Telugu grammar in Sanskrit) 38-00
   *by Manchella Vasudeva Kavi*
9. Naradeeya Puranamu (Telugu Poetry) 65-00
   *by Alladu Narasimha Kavi*
10. Kavi Chintamani (Lakshanagrantha in Telugu) 25-00
    *by Vellanki Tatambhattu*
11. An Alphabetical Subjectwise Index of Telugu 47-00
    Manuscripts in A.P.G.O.M.L.&.R.I. (Telugu)
12. Udayanodayamu (including Vanamali Vilasamu) 153-10
    *by Narana Surana* (Telugu Poetry-Deluxe Edition)
13. Arsha Kutumbamu (Telugu Prose) 47-00
    *by Sri Vasireddi Durgasadasiveswara Prasad*
14. An Alphabetical Subjectwise Index of Sanskrit
    Manuscripts in A.P.G.O.M.L.&.R.I., Vol. *I* (Telugu) 26-00

15. Tarakabrahmaraajeeyamu (Telugu Poetry) — 34-00
*by Chintalapudi Ellanarya*

16. An Alphabetical Subjectwise Index of Urdu Etc. Manuscripts in A.P.G. O.M.L. & R.I. (English) — 39-00

17. Alankara Makarandah (Sanskrit Alankara Sastra) — 33-00
*by Rajasekhara Sudhi* (in Telugu Script)

18. Nahush Natak (Hindi play) — 35-00
*by Giridharadas*

19. Vajragiri Narasimha Satakamu (Telugu)
*by Asakanuri Rangadhama Kavi*
Ramaraja Vatamsa Satakamu (Telugu)
*by Kotikalapudi Kodanda Rama Kavi* } — 17-00

20 Yoga Saktaparinayamu (Telugu Poetry) — 67-00
*by Maddipatla Appana Sastry*
*& Kotra Venkata Rama Kavi*

21. Bhargava Puranamu (Telugu Poetry) — 95-00
*by Bahiri Pama Nayakudu*

22. Mustalhat-i-Thaggi (Urdu) — 92-00
*by Ali Akber*

23. Telugu Descriptive Catalogue Vol. *I* — 56-00

24. „ „ Vol. *II* — 56-00

* Vijnana Saraswati - A Quarterly Research Journal (in English & Telugu)
9 Issues Published — Each Issue — 25-00

Publications of
Govt. ORIENTAL MANUSCRIPTS LIBRARY, MADRAS.

1. Cuddapah Inscriptions — 45-60
2. Pativrata Charitramu (Telugu Dwipada) — 4-20

---

DISCOUNT ALLOWED TO PRIVATE BOOK SELLERS & INSTITUTIONS Etc. On A.P.G.O.M.L &'R.I. Publications.

on Single Copy — 10%
on 5 Copies and above of each Publication — 25%

Copies can be had of
The Director,
A.P. Govt. Oriental Manuscripts Library and
Research Institute, Abids, Hyderabad - 500 001.

